# భారతేతిహాస సినిమాలపై జానపద సాహిత్య ప్రభావం

నందమూరి సాహితీ సమాఖ్య 1996వ సంవత్సరా

గాను నిర్వహించిన పోటీకి సమర్పింపబడి

బహుమతి పొందిన గ్రంథం


డా॥ గల్లా చలపతి

అసోసియేట్ ప్రొఫెసర్

తెలుగు అధ్యయనశాఖ

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

తిరుపతి

# భారతేతిహాస సినిమాలపై జానపద సాహిత్య ప్రభావ

డా॥ గల్లా చలః

మొదటి ముద్రణ : మే, 1999



ఈ గ్రంథం తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో ముద్రింపబడింది. వారికి కృతజ్ఞతలు

వాసు ప్రచురణలు : 6

ప్రతులకు :
శ్రీమతి జి. ఇందిరావతమ్మ
కేరాఫ్ రచయిత.

ధర : రూ. 80/-

రణ :
సెట్
ద్దు

# విషయానుక్రమణిక

| రచయిత చెప్పవలసిన మాటలు | పుటలు |
|---|---|

## మొదటి అధ్యాయం



## రెండవ అధ్యాయం

## మూడవ అధ్యాయం



## నాల్గవ అధ్యాయం

# శుభవచనమ్

ముదివర్తి కొండమాచార్యులు
ధర్మప్రచార పరిషత్తు
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

"నందమూరి సాహితీ సమాఖ్య : గుంటూరు"వారు భారత ఇతిహాస సినిమాలపై జానపద సాహిత్య ప్రభావం అనే అంశం మీద నిర్వహించిన గ్రంథ రచన పోటీలో అవార్డు పొందిన తమ పుస్తకం మీద నా అభిప్రాయం డా. గల్లా చలపతిగారు అభిలషించారు.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆధ్యాత్మిక విద్యాకేంద్రంలో (1980-81) డా. గల్లా చలపతిగారితో కలిసి అధ్యాపక వృత్తి నెరపే అవకాశం నాకు లభించింది. తరువాత చలపతిగారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో సంస్కృతాంధ్ర భాషా బోధకులుగా కుదురుకొన్నారు. నాటినుండి నేటి వరకు శ్రీనివాసుని కొలువులోనే భిన్నశాఖలలో ఉద్యోగము సల్పుచున్నాను.

ఆంగ్ల సంస్కృతాంధ్ర భాషా విశారదులు, సౌజన్య నిధులు నైన చలపతిగారు ప్రతిభా సంపన్నులు, రమణీయ రచనాశక్తి గలవారు. వారు రచన మీద నా అభిప్రాయం కోరడంలో వారికి నామీద గల అవ్యాజ ఆదరాభిమానాలే కారణం.

రెండున్నర మాసముల వ్యవధిలో ఇంత విషయం సేకరించి ఇంత మనోహరంగా రచన చేయడమన్నది సృష్టిలో అసాధారణం. రమారమి రెండువందల పుటలకు విస్తరించిన ఈ గ్రంథంలో 1. సాహిత్యం నుండి సినిమాదాకా, 2. భారతేతివృత్త సినిమాలు - కథాసంవిధానం. 3. భారతేతివృత్త సినిమాలు - జానపదాంశాలు, 4. భారతేతి వృత్త సినిమాలు, పాటలు పద్యాలు, జానపదీయత అను నాలుగు ప్రకరణాలున్నాయి. ఆయా ప్రకరణాల్లో చిత్తశుద్ధిగా శీర్షికకు తగినట్లు విషయం వివేచించబడింది. అధ్యాయాంతము లందు ఉపయుక్త గ్రంథ పట్టికలు చూచినపుడు ఈయన ఈ అల్ప వ్యవధిలో ఇన్ని పుస్తకాలెలా చూశారా ఆశ్చర్యం కలగక మానదు. "అప్పప్పు బుద్ధికి

స్మర్తవ్యం 1932 నుండి 1991 వరకు నిర్మితములైన భారత కథా చిత్రాలన్నీ నేను చూశాను. చూచి మరచిన ఆ సినిమాలలోని దృశ్యాలను రసము చిప్పిలే చలపతిగారి సరళ సుందరమైన భాషలో మరల దర్శించ గలిగాను. ఈయన ఆయా సన్నివేశాలు వర్ణించడంలో అతి నిపుణుడు.

సర్వజ్ఞసింగభూపాలుడు రచించిన రత్నపాంచాలి అనే సంస్కృత నాటిక ఆధారంగా సహజ కవి డా. మల్లెమాల సుందర రామిరెడ్డిగారు తీసిన సినిమా "శ్రీ కృష్ణ విజయము" - ఈ పుస్తకంలో ఉటంకించబడింది. ఆ సినిమాకు సంబంధించిన కథాదుల చర్చ జరుగలేదు. ఇంత మంచి పుస్తకంలో శ్రీ కృష్ణ విజయ గాధా సంవిధాన సంకీర్తన జరుగలేదని చింత నాకు కల్గింది. ఇందుకు రచయితకు గల సమయాభావము ప్రబల కారణమైయుండవచ్చు.

అన్నమాచార్య కళా మందిరములో భగవద్గీతాపారాయణ ప్రవచనాదులు చేపట్టకముందు తరచు సినిమాలు చూచేవాణ్ణి. బుద్ధి వికాసమునకు అవి ఎంతో దోహదం చేస్తాయి. కళాకారులు మాత్రం తప్పక సినిమాలు చూచి తీరాలని నెరనమ్మిన వారిలో అగ్రగణ్యుణ్ణి. ఆధ్యాత్మిక గంధం దట్టంగా అలముకొన్న ఈ వయస్సులో ఆ అభిరుచి అంతకంతకూ పలుచబడింది. కాని ఈ గ్రంథ పఠన సమయంలో యాభైయేండ్ల నా సినిమా అనుభూతి ఒక్కసారి రెక్కలు విచ్చుకొని విహాయస వీధులలోనికి రివ్వున ఎగిరిపోయింది. భారతీయ చిత్రజగత్తుకు సంబంధించిన ఈ మధుర రచన ఒక ప్రబంధ పఠన వేళ పాఠకునకు కలుగు రసానుభూతినిస్తుంది అనడంలో సందేహంలేదు. ఆంధ్ర పాఠకలోకమున బహుళ వ్యాప్తి పొందగలదని నేను విశ్వసిస్తున్న ఈ ముద్దైన రచనకు బ్రహ్మాయుస్సు!.

తేది : 12-6-99 ముదివర్తి కొండమాచార్యులు

# రచయిత చెప్పవలసిన మాటలు

ప్రతి సంవత్సరం విడుదలవుతున్న తెలుగు సినిమాల సంఖ్య ఇతర భారతీయ భాషా చిత్రాలతో పోల్చిచూస్తే ఎంతో ఎక్కువ. ఇది సినిమాల పట్ల తెలుగు ప్రజల అభిరుచిని వ్యక్తం చేస్తుంది. తెలుగు సినిమాలకు 1950 నుండి 1970 వరకు స్వర్ణయుగం. ఈ ఇరవై సంవత్సరాల్లో పౌరాణిక జానపద సాంఘిక చిత్రాలు ఇంచు మించు సమానంగానే వచ్చాయి. ఈ సినిమాలలో మంచి సాహితీ విలువలున్నాయి. ప్రజలలో కళాభిరుచిని పెంచే అంశాలున్నాయి. ఈ చిత్రాలకు పని చేసిన కళాకారులు, సాంకేతిక నిపుణులు, కవులు రచయితలు ఒక రకమైన నిబద్ధతతో, కళాభిరుచితో, అంకిత భావంతో వ్యవహరించడం వల్ల పదికాలాల పాటు స్మృతిలో నిలిచిపోయే ఉత్తమ కళాఖండాలనదగిన సినిమాలొచ్చాయి. 'పౌరాణిక చిత్రాలు తెలుగు వాళ్లు తీస్తేనే చూడాలి' అని పెద్ద పెద్ద వ్యక్తులు మన పౌరాణిక చిత్రాలకు యోగ్యతా పత్రాలు ఇచ్చారు. పురాణ కథలంటే తెలుగు ప్రజలకు ఎంతో మక్కువ. అలాగే పౌరాణిక సినిమాలన్నా ఎంతో ఇష్టం. 1950 నుండి 1970 వరకు అనేక పౌరాణిక చిత్రాలొచ్చాయి. వీటిలో భారత కథా చిత్రాల కొక ప్రత్యేకత ఉంది. మనసును రంజింపజేసే కథలు, పౌరాణిక పాత్రలను అనితర సాధ్యంగా మహోన్నతంగా పోషించే నటీనటులు, అద్భుతంగా మలచి ప్రేక్షకులను పౌరాణిక లోకాలకు తీసుకెళ్లే ప్రతి భావంతులైన దర్శకులు దీనికి కారణం.

తెలుగు వచ్చిన పౌరాణిక చిత్రాలు - ముఖ్యంగా భారత కథా చిత్రాలు వెండి తెరమీద కదిలే దృశ్యకావ్యాలు. 1970 తరువాత కూడా కొన్ని భారత కథా చిత్రాలు వచ్చాయి. ఇవి కూడా ప్రేక్షకులను అలరించాయి. తెలుగలో వచ్చిన భారత కథా చిత్రాలన్నీ ప్రజాదరణ పొందినవే. ఈ చిత్రాలకు కథ - మాటలు - పాటలు సమకూర్చిన రచయితలు, కవులు ప్రధాన కథలతో పాటు సమకాలీనంగా ప్రజలలో వ్యాప్తి పొందిన

ఆయా ప్రభావాలు పడడం వల్ల భారత కథా చిత్రాలలో జానపద కథలు కూడా చోటు చేసుకున్నాయి.

భారత కథా చిత్రాలపై జానపదుల ప్రభావం పరిశీలింప దగిన అంశం. నందమూరి సాహితీ సమాఖ్య గుంటూరు వారు 1996 సంవత్సరానికి 'భారతేతిహాస సినిమాలపై జానపద సాహిత్య ప్రభావం' అనే అంశంమీద గ్రంథ రచన పోటీ నిర్వహించారు. భారత కథా చిత్రాల మీద నాకున్న అభిరుచి నన్నీ గ్రంథ రచనకు ప్రోత్సాహించింది. గడువులోపల నేను సేకరించగలిగిన అంశాలను ఈ గ్రంథంలో పొందుపరచాను. గ్రంథరచనకు సమాఖ్యవారు ఇచ్చిన గడువు సుమారు రెండున్నర నెలలు. గ్రంథ విస్తృతి పెద్దది. 1932 నుండి 1991 వరకు భారత కథా చిత్రాలు నిర్మింపబడినాయి. ఈ చిత్రాలను 'క్యాసెట్ల' రూపంలో సంపాదించి చూడడానికి పెద్ద ప్రయత్నం చేయవలసి వచ్చింది. క్యాసెట్లన్నీ తిరుపతిలో దొరకలేదు. ఇతర ప్రాంతాలనుండి కూడా సేకరించడం జరిగింది.

ఈ గ్రంథం రచిండంలో ఒక పద్ధతి పాటించబడింది. ఆయా చిత్రాలలోని కథాంశాలు, పాటలు, పద్యాలు ఎలా జానపద సాహిత్య ప్రభావానికి లోనైనాయో చూపడానికి ముందు ఆయా అంశాలు కవిత్రయ భారతంలో ఎలా ఉన్నాయి, జైమిని భారతాది గ్రంథాల్లో ఎలా మార్పుచెంది కనిపిస్తున్నాయి, అనే అంశాలను; నాటకాలలో ఎలా పరిణమించాయి అనే అంశాలను మదింపు వేసి తరువాత జానపదుల ప్రభావం ఎలా పనిచేసిందో వివరించే ప్రయత్నం చేయబడింది. ఈ గ్రంథం నాలుగు అధ్యాయాలుగా రూపు దిద్దుకొన్నది. 'సాహిత్యం నుండి సినిమాదాకా' అనేది మొదటి అధ్యాయం. ఇందులో ప్రధానంగా సాహిత్యం నుండి సినిమా ఎలా ఉత్పన్నమైందో చూపబడింది. రెండవ అధ్యాయం 'భారతేతి వృత్త సినిమాలు - కథా సంవిధానం'. ఇందులో ప్రధానమైన భారత కథా చిత్రాల కథా స్వరూపం వివేచించబడింది. మూడవ అధ్యాయమైన 'భారతేతి వృత్త సినిమాలు - జానపదాంశాలు'లో ఈ సినిమాలలోని కల్పనలు, సంఘటనలు పాత్రలు మొదలైన అంశాలలోని జానపదీయత వివరింపబడింది. 'భారతేతి వృత్త సినిమాలు - పాటలు - పద్యాలు - జానపదీయత' అనేది నాల్గవ అధ్యాయం. భారతేతి వృత్త

సినిమాలలో గల సంస్కృత శ్లోకాలు, తెలుగు పద్యాలు - పాటలు మొదలైన వాటిని గురించి ఇందులో వివరింపబడింది. చివర కొన్ని అనుబంధాలు, ఉపయుక్త గ్రంథసూచిక ఉన్నాయి.

'నందమూరి సాహితీ సమాఖ్య' ఈ గ్రంథానికి అయిదువేల రూపాయల నగదు బహుమతిని 23-7-1996న ప్రకటించింది. 15-8-96వ తేది నాగభైరవ ఎడ్యుకేషనల్ అకాడమీ (గుళ్లాపల్లి, ప్రకాశంజిల్లా)లో బహుమతి ప్రదానోత్సవం జరిగింది. ప్రముఖ సినీ నటులు శ్రీ నందమూరి బాలకృష్ణ బహుమతి ప్రదానంచేశారు.

ఈ గ్రంథ రచన ప్రారంభించినప్పటి నుండి ముగిసేవరకు వివిధ దశలలో నాకు అన్ని విధాల సహాయపడిన ఆత్మీయులు, మిత్రులు ఎందరో ఉన్నారు. వాళ్ల కందరికి హృదయ పూర్వక కృతజ్ఞతలు. 'అవార్డు' పొందిన ఈ గ్రంథాన్ని స్వయంగా ముద్రించుకోవడానికి అనుమతి ఇచ్చిన 'నందమూరి సాహితీ సమాఖ్య'కు, ఆ సంస్థ కార్యదర్శి డా||జి. దామోదరనాయుడు గారికి హృదయపూర్వక కృతజ్ఞతలు చెప్పడంలో ఎంతో సంతోషముంది. ఈ గ్రంథాన్ని ఓపికగా చదివి 'శుభవచనమ్' పేరుతో తమ అభిప్రాయాన్ని ఇచ్చిన మహాకవి శ్రీ ముదివర్తి కొండమాచార్యుల వారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం అర్థించిన వెంటనే సానుకూలంగా స్పందించి తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్థిక సహాయంచేశారు. అందుకు నిండుమనస్సుతో వారికి కైమోడ్పులు సమర్పిస్తున్నాను. ఈ సందర్భంలో ఆచార్య కె. సర్వోత్తమరావుగారు, డా||మోడసాని మోహన్‌గారు, శ్రీ కోరాడ రామకృష్ణగారు స్మరింపదగిన గొప్పవారు. వారికి మనఃపూర్వక కృతజ్ఞతాసుమాలు.

తిరుపతి — గల్లా చలపతి
6-5-1999.

# సాహిత్యం నుండి సినిమాదాకా

భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే నిలువుటద్దాలు రామాయణ భారత భాగవత గ్రంథాలు. తరతరాల భారత సంస్కృతిని నిక్షిప్తం చేసుకొని భావితరాల వారికి ప్రదర్శించే వైదిక లౌకిక సాహిత్యమెంతో ఉంది. వేదోపనిషత్తులు, ధర్మశాస్త్రాలు, పురాణాలు, కావ్యాలు భారతీయుల జీవితాలను వ్యాఖ్యానిస్తాయి. సనాతన సంప్రదాయం ప్రతిపాదించిన భారతీయ జీవన విధానానికి, భారతీయుల జీవన విధానానికి వ్యత్యాసంలేదు. చతురాశ్రమాలు, చతుర్విధ పురుషార్థాలు శాంతియుత జీవన సౌభాగ్యం కోసం మన మహర్షులు మనకోసం ఏర్పరచిన పద్ధతులు. బ్రహ్మచర్యం, గృహస్థం, వానప్రస్థం, సన్యాసం అనే నాలుగు ఆశ్రమ దశల్లో ఒకదశలో నిర్వర్తించ వలసిన విధులు మరొక దశలోకి కొనసాగరాదు. ధర్మార్థకామమోక్షాలనే నాలుగు పురుషార్థాలలో అర్థకామాలు ధర్మబద్ధం కావాలని నియమించ బడింది. జీవితం పట్ల మన ప్రాచీనుల కున్న ఇటువంటి విలువైన అభిప్రాయాల వల్లనే భారతీయ జీవితాలలో సంఘర్షణకు తావులేకుండా పోయింది. జీవితం నియమబద్ధంగా కొనసాగడానికి అవకాశం ఏర్పడింది. వ్యక్తి స్థాయి నుండి సంఘస్థాయికి, సంఘస్థాయి నుండి దేశస్థాయికి ఈ జీవన పద్ధతులు వ్యాపించి దేశం మనుగడ శాంతియుతంగా కొనసాగాలని ఆకాంక్షించారు మనప్రాచీనులు.

జీవితాన్ని అందంగా దిద్దుకోవడం, ఆనంద క్షణాలను వృథా కానీయ కుండా అనుభవించడం, వ్యక్తి తనకు నిర్దేశించిన జీవిత పంథాలో పయనించడం ద్వారా ఇతరుల జీవితాలకు ఆటంకాలు కలిగించకుండా ఉండడం అనే అంశాలు భారతీయుల జీవితాలతో ముడిపడిన విషయాలు. శాస్త్ర పురాణ కావ్య సాహిత్యమంతా ఈ విషయాలను ప్రతిపాదించి మానవ జీవితానికి సన్నిహితమైంది. జీవితాన్ని అందంగా దిద్దుకోవడమంటే ఐహికాముష్మిక అంశాలను తమ జీవితాలలో సమన్వయించు కోవడమేనని భారతీయుని భావన. భారతీయుడు భావించినది ఆధ్యాత్మిక సౌందర్యాన్ని. అందమంటే చక్షురింద్రియ గోచరమైందికాదు. మనసు పొరలలో రజస్త మనస్సులను అణచి ఆలోచనలను సత్త్వదశోన్ముఖంగా పయనింపజేస్తూ దృగ్గోచరమయ్యే ప్రకృతి సోయగాలను ఆధ్యాత్మీకరించుకోవడం మన సౌందర్య

దర్శనం. ఆధ్యాత్మిక సౌందర్యంలో వ్యక్తి నిష్ఠమైన ప్రాపంచిక అందాలన్నీ మునిగి దానిలో లయించి పోతాయి. మనది ఆత్మిక సౌందర్యమేగాని శారీరకం కాదు.

భారతీయులకు జీవిత ధ్యేయమన్నా జీవితాదర్శమన్నా సత్త్వ భావోపన్నమైన అధ్యాత్మిక సౌందర్య దర్శనమే. అందాన్ని చూడడం లేక అనుభవించడం, ఆనందంగా జీవించడం అనేవి ఆ సౌందర్యపు అంచులు. చతుర్థ పురుషార్థమైన మోక్షం అంటే ప్రాపంచిక వాసనల నుండి విడివడిన మనస్సు ఆధ్యాత్మిక పరిమళంతో నిండడమేనని పండితుల అభిప్రాయం. సౌందర్య దర్శనంలో ఒక భాగమైన ఆనందం మానవుని లౌకిక జీవితాన్ని నిర్దేశిస్తున్నది. భగవంతుడు చేసిన సృష్టి ఆనందమయం. సృష్టిలో ప్రపంచితమైన ఆనందాన్ని అనుభవించడానికే మానవజన్మ. జనన మరణాల మధ్య వ్యక్తమయ్యే అనేక జీవితాంశాలు ఆనందంతో ముడిపడినవే. అయితే మానవుడికివి స్థానభేదాన్ననుసరించి కష్టాలుగా సుఖాలుగా అనుభవ గోచరమవుతున్నాయి. సృష్టి ఆనందం నుండి పుట్టి ఆనందంలో పయనించి ఆనందంలో కలిసి పోతున్నదని మహర్షుల మాట. కొండలో పుట్టలో వాగులో వంకలో కనిపించే అందాన్ని ఆధ్యాత్మికంగా దర్శించడమే మన పద్ధతి. ఈ ఆధ్యాత్మికానందాన్ని సాహిత్యం 'రసం' అనే పదంతో వ్యక్తం చేసింది. రసమంటే ఆనందం. ఇది ద్వంద్వాతీతంగా, త్రిగుణాతీతంగా ఉంటుంది. ఇలాంటి ఆనందం పొందిన వ్యక్తికి సృష్టి ఆనందమయంగా కనిపిస్తుంది. అతని మనసులో ఆధ్యాత్మికతత్త్వం పురులు విప్పుకొంటుంది. అతనికి జీవితాదర్శం లేక జీవితధ్యేయం నెరవేరినట్లనిపిస్తుంది. అందుకే తైత్తిరి యోపనిషత్తు 'రసోవైసః' అని, 'రసగ్ హ్యేవాఽయం లబ్ధ్వానందీభవతి' అని పేర్కొన్నది.

ఒక జీవితంలో కలిగే ఆనందం తత్త్వ సౌందర్య దర్శనం చేయగల సాధనంగా మారితే ఆజీవిత ధ్యేయం నెరవేరినట్లే. జీవితం ఆనందం నుండి పుట్టినప్పటికీ ఆ విషయం మానవుడికి తెలియాలి. ఆనందం - జీవిత విధానం - తత్త్వ సౌందర్య దర్శనం అనే మూడంశాలు మానవ జీవిత ధ్యేయ సాధనలో మూడు సోపానాలు. జీవిత ధ్యేయం తపస్సువల్ల సిద్ధిస్తుంది. తపస్సంటే ఏకాగ్రత. ఇది మానసిక వాచిక కాయక భేదాలతో మూడు రకాలు. ఈ మూడు రకాల ఏకాగ్రత భక్తియోగ, కర్మయోగ, జ్ఞాన యోగాలలో దేనిద్వారా నైనా సిద్ధిని కలగజేస్తుంది. ఇది ఆధ్యాత్మికమైన సాధన. జీవిత

ధ్యేయ సాధనకు మరొక మార్గం కళాసాధన. కవిత్వ సంగీత నృత్యాదులు కళలు. కళను అభ్యసించి, అందులోని పరసీమను చేరుకొని సాత్విక దశలో పండుతున్న మనస్సును కళలో అంతర్ముఖం చేయడం వల్ల ఆనందం కలుగుతుంది. ఆ యానందం బ్రహ్మానంద సహోదరం. అది అనుభవ గోచరం కావడమే జీవిత ధ్యేయ సిద్ధి.

**కళలు - ఆనందం :** కళ అనిర్వచనీయం. ఎన్ని ప్రయోజనాలున్నా వెంటనే ఆనందం కలగడం కళకు పరమ ప్రయోజనం. ఈ ఆనందం మానసికమైనా సత్వ దశకు సంబంధించినదిగా ఉంటుంది. కళాదర్శనం వల్ల మనో మాలిన్యాలు అణగిపోతాయి. అప్పటి వరకు తెలియని స్వర్గ ద్వారాలు మనస్సులో తెరుచుకొంటాయి. దృష్టి ఊహల కందనంత దూరం సాగిపోతుంది. అవ్యక్తమైన మాధుర్యం, ఆనందం అనుభవ గోచరమవుతాయి. కళకు పరమావధి ఇలాంటి అనిర్వచనీయమైన రసాను భూతిని కలిగించడమేనని రసజ్ఞుల, శిల్పుల అభిప్రాయం. ఇలాంటి కళను నిర్వచింప బూనడం సాధ్యంకాదు. "When one art can fully be explained by another, then it is a failure" అని రవీంద్రుడు; "Art is to be felt not to be explained" అని అవనీంద్రనాథ టాగూరు చెప్పిన మాటలు ఈ సందర్భంలో గమనార్హం. కళల సంఖ్య చతుష్షష్టికి మించి పోయింది. ఈ కళలలో కవిత్వం, సంగీతం, చిత్రలేఖనం, విగ్రహశిల్పం, నాట్యం అనే ఐదు కళలను లలిత కళలుగా రసవేత్తలు గుర్తించారు. లలిత కళలకు సరసకళలని కూడా మరొక పేరు. జయదేవుడు తన గీత గోవింద కావ్యంలో వీటికి విలాస కళలని మరొక పేరు సూచించాడు.[1]

లలిత కళల పరమార్థం ఆనందమైనప్పటికి ఆయాకళలు గ్రహించే భౌతిక ద్రవ్యాపేక్ష ననుసరించి తారతమ్యాలుంటాయి. ఈ అయిదింటిలో కవిత్వం ఉత్తమోత్తమమైన కళగా అంగీకరింప బడింది. చిత్రలేఖన విగ్రహ శిల్పాలలో చలనం ఉండదు. సంగీత నాట్యాలలో చలనమున్నప్పటికి చెవిటి వాడికి సంగీతం, గుడ్డివాడికి నాట్యం అందవు. ఈ రెండు తరగతుల వారికి కవిత్వం ఆనందదాయక మవుతుంది. కళలన్నీ సౌందర్య ద్యోతకములైనా ఏ కళలో సౌందర్యం చలిస్తుందో ఆ కళ గొప్పది. చలనం సౌందర్యానికి మోహనత్వాన్నిస్తుంది.[2] మిగిలిన కళలకున్న పరిమితులు కవిత్వ కళకు

పైగా మిగిలిన కళలన్నీ అందులో కనిపించడానికి అవకాశముంది. అందుకే ప్రాచీన కాలంనుండి కవిత్వానికి ఎంతో ఆదరణ ఉంది. వేద ఋక్కులు గాన యోగ్యతగల కవితా ఖండికలే. వేదకాలం నుండి నేటి వరకు కవితా కళ భిన్న రూపాలను పొందినా సజీవంగా ఉంది.

ప్రాచీన కాలంనుండి స్రష్టలు ద్రష్టలు అయిన కవి పుంగవులు కవిత్వం ద్వారానే జీవిత ధ్యేయం నెరవేర్చుకొనే ప్రయత్నం చేశారు. జనన మరణ దురితములకులోను గాని జీవితం కావాలని తిక్కన,[3] 'శ్రీకైవల్య పదంబు చేరుటకు నైచింతించెదన్' అని పోతన ప్రకటించుకోవడం దీనిని నిరూపించే అంశం. కళను సృష్టించే వాడికి రెండు ధ్యేయాలుంటాయి. కళద్వారా జీవిత గమ్యాన్ని చేరుకోవడంకోసం కళను సృష్టిచడం ఒకటి. ఇది వ్యక్తిగతం. తాను సృష్టించిన కళద్వారా ఇతరులను ఆనందపెట్టడం, తద్వారా వాళ్ల జీవితాలను నిర్దేశించడం రెండవది. ఇది సమాజగతం. కళను సమాజంలోని జనం దగ్గరకు తీసుకొని వెళ్లి వారికర్థమయ్యే రీతిలో దానిని ఆవిష్కరించడం కళావేత్తపని. ఏకళ అయినా అర్థమయినప్పుడే ఆనందదాయక మవుతుంది. అర్థం కావడమన్నది ఒక్కొక్కప్పుడు కంటి ద్వారా సాధ్యమైతే మరొకప్పుడు మనసుద్వారా సాధ్యమవుతుంది. మనసు ద్వారా అర్థమైనపుడు కలిగే ఆనందం అనిర్వచనీయం. మనసుకు పరిధి లేనట్లే ఈ ఆనందానికి కూడా పరిధిగాని పరిమితిగాని ఉండదు. ఇతర కళా స్రష్టల విషయం ఎలా ఉన్నా కవిత్వ కళను సృష్టించేవాడు ఒక సంఘటననుగాని, ఒక కథనుగాని విపులీకరిస్తూ దానిద్వారా ఆనందాన్ని కలిగించడమే కాకుండా మానవ జీవితానికి ఆ కథాంశాలను దగ్గరగా తీసుకొని వెళ్లాలి. అంటే కవిత్వకళ మానవ జీవిత వ్యాఖ్యానంగా ఉండాలి. అప్పుడే అది మానవ మనసులను స్పందింపజేస్తుంది. అతడు చేసే కథాంశ వివరణ కవిత్వమవుతుంది లేదా కావ్యమవుతుంది. చదివి, విని అర్థం చేసుకొనే వాళ్లకు కళగా భాసిస్తుంది. అందుకే కావ్యకళను గుణ గరిష్ఠమైన ఉత్తమ పురుషార్థ సిద్ధిగా భావించడం జరిగింది. లేన్‌కూపర్ అనే ఆంగ్ల విమర్శకుడు "Poetry is the most vital and the lasting achievement of man" అన్న మాటలలో ఈ యర్థమే ధ్వనిస్తుంది.

**కవితాకళ - భిన్న రూపాలు :** కవితా కళ శ్రవ్యదృశ్య భేదాలతో రెండు విధాలుగా ఆవిష్కరింప బడింది. ఇతిహాసపురాణకావ్యాదులు శ్రవ్య

ిభాగానికి, నాటకాలు దృశ్య విభాగానికి చెందుతాయి. ఇతిహాస పురాణాలకు
ముందే భారతదేశంలో వైదిక సాహిత్యం వెల్లివిరిసి బహుళ ప్రచారం పొందింది.
ైదిక సాహిత్యంలో ప్రతిఫలించిన భారతీయ సంస్కృతే తరువాత కాలాలలో
ంచ్చిన సాహిత్య రూపాలలో కూడా కనిపిస్తుంది. వైదిక సాహిత్యం ఆర్ష
ధర్మాలను లోకంలో సుప్రతిష్ఠం చేయడానికి పుట్టినా ఎన్నో లౌకిక ధర్మాలను
ూడా ప్రబోధించింది. వేదవేద్యుడైన పరమ పురుషుడు దశరథుని కుమారుడైన
్రాముడుగా జన్మించగా వేదం ప్రాచేతసుని చేతుల మీదుగా
ృమద్రామాయణంగా రూపొందింది.[5] దివ్యత్వాన్ని వీడి మర్త్యత్వాన్ని పొందిన
్రాముడు ఆదర్శ లౌకిక పురుషుడై ఆయన కాలంనాటి జన జీవితాన్ని
ంతో ప్రభావితం చేశాడు. వ్యాస మహర్షి విరచిత మహాభారతం ఆనాటి
ంఘ స్థితిగతులను వివరించే ఉత్తమ గ్రంథం. ఇందులోని శ్రీకృష్ణ ధర్మరాజాది
ాత్రల స్వార్థలౌక్య వితరణాది గుణాలు పూర్తిగా మర్త్యజీవితానికి
ంబంధించినవే. శ్రీమద్రామాయణ మహాభారతాలు రెండూ ఇతిహాసాలుగా
ిసిద్ధిపొందాయి. జన జీవితాన్ని అమితంగా ఆకర్షించి ప్రభావితం చేసిన
ీరి కథలు ఇతిహాసాలలో వివరింప బడతాయి. సమకాలీనులలో ప్రచారం
ొందిన అలాంటి వీరుల మహత్వాన్ని తెలిపే కథలు గాథలు తరువాత
లాలకు ప్రసరించి చరిత్రకు ముడిసరుకులవుతాయి. ఈరకంగా చూస్తే
ఇతిహాసాలే భారతదేశ చరిత్రను తెలిపే మొదటి ఆధారమనిపిస్తుంది.

ఇతిహాసాల తరువాత పురాణ సాహిత్యం పుట్టింది. పురాణాలలోని
ిషయాలు పాతవైనా అప్పటికప్పటికి నవ్యంగా భాసిస్తాయి. పురాణాలకిదే
ధాన లక్షణం. పురాణాలు స్వర్గ మర్త్య పాతాళాలను ఒకచోట చూపించే
ేకానేక కథలతో నిండి ఉంటాయి. వీటిలో కనిపించే పాత్రలు చాలావరకు
ితలే. అయినా ఈ పాత్రలన్నీ సమకాలీన సమాజ వ్యవస్థను, మానవ
భావాన్ని బాగా వ్యక్తం చేస్తాయి. పురాణాలకు ఆంధ్రదేశంలో ఎంతో
చుర్యం ఉంది. పురాణాన్ని కథగా చెప్పడం ఆంధ్రులకు అలవాటైనంతగా
ిర ప్రాంతాల్లో లేదేమోననిపిస్తుంది. మనకు భారతం కూడా పురాణమే.
్రటికీ పురాణం చెప్పే పండితులున్నారు. పల్లెప్రాంతాల్లో వర్షం కోసం,
ర శుభాల కోసం పురాణం చెప్పించే అలవాటు ఉంది. ఈ అలవాటు
ణాల్లో ఇప్పుడిప్పుడే పట్టణ నాగరికత పరదా చోటుకు వెళ్లిపోతున్నది.
ాణ కథలను విన్నపుడు ఆ కథలలో ప్రసక్తమయ్యే పాత్రల స్వభావం

అలాంటి స్వభావం గల శ్రోతలను స్పందింప జేయడంవల్ల వాళ్లు తన్మయులయ్యే అవకాశముంది. రాముడు, కృష్ణుడు పాత్రలను గురించి విన్నపుడు ఆ లోకాతీత వీరుల గుణాలను అలవరచుకోవాలనే కోరిక ఆత న్మయత్వాన్ని కలిగించవచ్చు. అలాగే దుర్యోధన కీచకులను గురించి విన్నపుడు వారి మనస్తత్వాని కనుకూలంగా కూడా శ్రోతలు స్పందించవచ్చు. పురాణ పఠనం, తద్వివరణ శ్రోతలలో సుగుణ శీలతను కలిగించడానికే కాబట్టి పౌరాణికుడు క్రూరపాత్రలు మంచి పాత్రలతో సంఘర్షించి చివరకెలా అధోగతి పాలవుతాయో చెపుతాడు. ఈ వివరణ శ్రోతలలో మంచి చెడ్డలను బేరీజు వేసుకొని మంచిని ఎందుకు గ్రహించాలో తెలుసుకోవడానికి కారణమవుతుంది. ఈ రకంగా చూసినపుడు పురాణకథలు, పాత్రలు పాతవైనా ఆ కథలిచ్చే సారాంశాలు, ఆ పాత్రల మనస్తత్వాలు ఎప్పటికీ కొత్తగానే స్ఫురిస్తాయనిపిస్తుంది.

ఇలాంటి పురాణ ప్రతిపాదిత ముఖ్యాంశాన్ని ప్రధానంగా పెట్టుకొని ఆ తరువాత కావ్యకర్తలు కావ్యాలు రాశారు. రాను రాను సంఘంలో మార్పులు ఎక్కువగా రావడం, ఆ మార్పుల సంక్లిష్టత కావ్యాలలో ప్రతిబింబించడం జరిగింది. అందువల్ల కావ్యాలు చాల లౌకికంగా రూపొందాయి. పురాణాలలోని కథలను నామ మాత్రంగా గ్రహించి కావ్యకర్తలు కల్పనలకే ఎక్కువ చోటిచ్చారు. ఈ సిద్ధాంతానికి సంస్కృత కావ్యకర్తలు, తెలుగు కావ్యకర్తలు కూడా కట్టుబడినవారే. ఈ సిద్ధాంతమే వారి కావ్యాలకు జనాదరణను కలిగించింది. తమ రచనలకు కావ్య గౌరవాన్ని, జనాదరణను పొందడానికి వాళ్లు మూడు జాగ్రత్తలు తీసుకొన్నారు. ఒకటి - మానవాతీతమైన శక్తి ఒకటుందని, అదే దైవమని దానికిష్టమైన రీతిలో చరాచర ప్రకృతి ప్రవర్తిస్తూ ఉంటుందని చెప్పడానికి త్రిమూర్తులు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు మొదలైన వారి కథలను కావ్యాలలో వర్ణించి పఠితలలో లేదా శ్రోతలలో భక్తిని, తాత్త్విక జిజ్ఞాసను కలిగించడానికి ప్రయత్నించారు. రెండు - కథలను ఆధారంగా పెట్టుకొని పఠిత లేదా శ్రోత నివసిస్తున్న సమాజ స్థితితో చారిత్రక సంబంధమున్న సమాజస్థితిని వర్ణించి వారికి చారిత్రక జ్ఞానం కలిగించారు. మూడు - పాత్రల స్వభావాన్ని అతి విపులంగా వర్ణించి తాము చదివిన లేదా వినిన కథాంశం తమ చరిత్రేనన్న భావం పఠితలలో లేదా శ్రోతలలో కలిగించారు. ఈ మూడు విషయాలను సమన్వయించి

చేసిన రచనకు జగద్ధితం ప్రయోజనంగా భావింపబడింది. నన్నయభట్టు జగద్ధితంకోసం భారతాంధ్రీకరణకు పూనుకొన్నట్లు చెప్పుకొన్నాడు.[6] ఇంకా ముందు కాలాలకు వెళ్లి పరిశీలిస్తే తమ కావ్య నాయకుల ఉత్తమ గుణాలు తమ కావ్య శ్రోతలకు లేదా పఠితలకు కలగాలని కవులు ఆశించినట్లు అర్థమవుతుంది. కాళిదాసు రఘువంశం మొదటి సర్గలో 'సోహ మాజన్మశుద్ధానాం' అనే అయిదవ శ్లోకం నుండి 'శైశవేభ్యస్త విద్యానాం' అనే ఎనిమిదవ శ్లోకం వరకు అంటే నాలుగు శ్లోకాలలో రఘువంశ రాజుల ఉత్తమాదర్శ గుణాలను వర్ణించాడు. ఈ గుణాలలో కొన్నిటినైనా తన పాఠకులు అలవరచు కుంటారని కాళిదాసు విశ్వసించి ఉంటాడు.

వైదిక ఋషిగాని, పురాణకర్తగాని, కావ్యకర్తగాని తమతమ రచనల ద్వారా చేసిన బోధనలవల్ల ప్రజలలో సద్గుణాలు, సత్సంప్రదాయాలు అలవడి మానవ సమాజంలో సుఖశాంతులు వెల్లి విరియాలని కోరుకొని ఉంటారనడంలో ఎలాంటి సందేహం అవసరం లేదని ఇప్పటి వరకు చేసిన చర్చకు సారాంశం. ఇక్కడ గమనించవలసిన అంశాలు కొన్ని ఉన్నాయి. ఏకాలపు సాహిత్యమైనా ప్రజలకు అర్థమైనపుడే వారిని స్పందింపజేస్తుంది. అర్థంకావడం రెండు రకాలు. అక్షర జ్ఞానమున్న వాళ్లు అర్థం చేసుకోవడం ఒక పద్ధతి. అక్షర జ్ఞానం లేనివాళ్లు విని అర్థం చేసుకోవడం మరొక పద్ధతి. రెండు తరగతుల వారికి విషయావగాహనను కలిగించే ఒక సమానాంశముండాలి. అది వాళ్లకు వారసత్వంగా సంక్రమించిన భారతీయ సంస్కృతి. సాహిత్యం సంస్కృతిలో ఒక అంశమే. సమానాంశమున్నప్పటికి అక్షర జ్ఞానమున్న వాళ్లకు విషయగ్రహణ శక్తి అధికంగా ఉంటుంది. ప్రాచీన కాలంలో అక్షరాస్యుల సంఖ్య అతిపరిమితం. భారతదేశమంతటా గ్రామీణ సంస్కృతే కనిపించేది. గ్రామీణ సంస్కృతిలో వ్యావసాయక సంస్కృతి ముఖ్యమైన భాగం. అక్షరాస్యులు గుడులలో బడులలో పాలకుల చావడులలో కాలం వెళ్లబుచ్చుతుంటే నిరక్షరాస్యులు కర్షకులుగా పొలాలలో కష్టించేవారు. వీళ్లకు జ్ఞానంగాని, వినోదంగాని గుడులలో అక్షరాస్యులైన పండితుల ద్వారానే కలగవలసి ఉండేది. గుడి మానవజీవితంలోని అన్ని అంశాలతో ముడిపడిన ఒక గొప్ప కళాకేంద్రం.

పగలంతా పొలాలలో కష్టించి సాయంకాలం దేవాలయాలకు వచ్చే ప్రజలకు భక్తితో పాటు మానసికానందం కూడా అవసరం. దీనికి అవసరమైన

ప్రాంగణాలలోనే పురుడు పోసుకున్నాయనడంలో ఆశ్చర్యంలేదు. ముఖ్యమైన కళలు దేవాలయ పూజావిధానంలో భాగంగా ఏర్పడినాయి. భగవంతుని అనంత కళ్యాణ గుణాలను గానం చేయడంలో కవిత్వకళ, గానకళ ఉన్నాయి. దేవుని మహనీయతను అందరికీ తెలిసేలా ప్రదర్శించడంలో నాట్యకళ దాగి ఉంది. ఈ కళలన్నీ భగవంతునికి ప్రీతి పాత్రంగా ఏర్పడినవే. దేవాలయాలలో రూపుదిద్దుకొన్న ఈ కళలు దేవాలయ రంగమంటపాలపై ప్రదర్శింపబడినాయి. ప్రదర్శన కళలు నాటక కళలో అంతర్భవించాయి. దేవునికి సంబంధించిన వివిధ మహనీయ ఘట్టాలు నాటకాలుగా ప్రదర్శింపబడేవి. నాటక కళ ప్రజలకు ఆనందాత్మకంగా ఉపదేశాత్మకంగా కనిపించినా దేవునికి మాత్రం ప్రీతిపాత్రం. అందుకే నాట్యశాస్త్రం నాటక ప్రదర్శనను యజ్ఞంతో పోల్చింది. నాటక ప్రదర్శనను తిలకించినవారికి యజ్ఞం చేసినంత పుణ్యం వస్తుందని అభిప్రాయపడింది. ఈ కళలలో సంగీతనృత్యాలు మాత్రం దేవదాసీల దోహదంతో పెరిగి పెద్దవైనాయి"[7]
డా|| రామగోపాలరెడ్డి ఇచ్చిన ఈ వివరణవల్ల ప్రజల వినోదం కోసం దివ్య ఇతివృత్తాలు నాటకాలుగా దేవాలయ రంగమంటపాలపై ప్రదర్శింపబడేవని, నాటక ప్రదర్శనకు మంచి ప్రచారం ఉండేదని తెలుస్తున్నది. దేవాలయ ప్రాంగణాలలో పౌరాణికుడు వివరణాత్మకంగా చదివే శ్రవ్య ప్రబంధం కంటే రంగమంటపాలపై ప్రదర్శింపబడే దృశ్య ప్రబంధాలు ప్రజలకు వెంటనే అర్థమై సద్యః ప్రయోజనాన్ని కలగిస్తాయి. దృశ్య ప్రబంధం అంటే నాటకం. శ్రవ్య ప్రబంధంలో ఉన్న నాటక లక్షణాలను పౌరాణికుడుగాని పండితుడుగాని వివరించినప్పటికి, సాక్షాత్తూ రంగస్థలంపై నటులు ప్రదర్శించే కథాంశాలు ప్రజలకు అర్థమైనంతగా అర్థంకావు. శ్రవణేంద్రియం కంటే చక్షురింద్రియం గొప్పదిగదా! ఈ నాటకాలలో శ్రీరామ శ్రీకృష్ణాది సుగుణ పాత్రలను, దుర్యోధన కీచకాది దుర్గుణ పాత్రలను నటులు ధరించి అభినయించి ప్రేక్షకులకు ఆనందం, దానితో బాటు ఉపదేశం కలిగిస్తారు. బహుశా ఈ కారణం చేతనే నాటక రచన అతి ప్రాచీన కాలంలోనే జరిగిందేమో.

**నాటకం - ప్రదర్శనకళ :** 'నాట్యమ్' అనే శబ్దం నుండి నాటకం పుట్టింది. నాట్యం అనే పదంలో నాటక రచన, నాటకప్రయోగం అనే రెండంశాలు ప్రధానంగా ఉంటాయి. నాట్యానికి చెందిన సమస్త విషయాలు భరతముని విరచిత నాట్యశాస్త్రంలో ఉన్నాయి. నాట్యశాసత్ర్ర క్రీస్తుశక

ప్రారంభప్రాంతంలో రచింపబడినట్లు భావింపబడుతున్నది.[8] భరతుని నాట్య శాస్త్రరచనకు ఎంతో ముందునుండి అంటే సుమారు క్రీ.పూ. 500 సంవత్సరాల నుండి సంస్కృత నాటకాలు ఉండినట్లు చూపే ఆధారాలున్నాయి.[9] దీన్ని బట్టి ఆలోచిస్తే అప్పటికే ప్రచారంలో ఉండిన నాటకాలకు భరతుడు శాస్త్రీయ లక్షణ చట్రాన్ని తయారు చేసినట్లు చెప్పవలసిఉంది. భరతుడు తన నాట్యశాస్త్రంలో నాట్యోత్పత్తిని గురించి వివరించాడు. ఆయన చెప్పిన నాట్యోత్పత్తి వివరణమిది - త్రేతాయుగంలో దేవతలు బ్రహ్మ దగ్గరకుపోయి శూద్రులకు ఉపయోగపడే వేదరచన చేయమని ప్రార్థించారు. అప్పుడు బ్రహ్మ ఋగ్వేదం నుంచి పాఠ్యాన్ని, సామవేదం నుంచి గానాన్ని యజుర్వేదం నుంచి అభినయాన్ని అథర్వవేదం నుంచి రసాన్ని తీసుకొని పంచమవేదంగా నాట్య వేదాన్ని సృష్టించాడు. బ్రహ్మ ఆజ్ఞ మీద విశ్వకర్మ నాట్యగృహాన్ని నిర్మించాడు. భూలోకంలో నాట్యకళా ప్రచారానికి భరతముని నియోగింపబడినాడు. ఇంద్రధ్వజోత్సవ సమయంలో మొదటి సారిగా భరతుడు తన శిక్షితులైన పుత్రులద్వారా నాట్యాన్ని ప్రదర్శింప జేశాడు.[10] ఈ కథ ననుసరించి నాట్యవేదం శూద్రులకు ధర్మజ్ఞానం కలిగించడానికి పుట్టిందని అర్థమవుతుంది. వేద పఠనాధికారం లేని వారు నాటక దర్శనం ద్వారా ధర్మజ్ఞానం సంపాదించేవారు. దుఃఖార్తులకు, శ్రమార్తులకు, తపస్విజనులకు విశ్రాంతిని, శాంతిని కలిగించే విధంగా కూడా నాట్యవేదం రూపొందిందని భరతుడు చెప్పినాడు. నాట్యంలో అభినయం, గేయం, గానం ప్రముఖమైన అంశాలు. ఇవి వేటికవి స్వతంత్రకళలైనా అన్నీ కలిసి నాటకమై 'నాటకం సమాహారకళ' అనడానికి అవకాశమేర్పడింది. ఈ కథలో వేదాల ప్రస్తావన ఉండడం వల్ల భారతదేశంలో నాటక రచన - ప్రదర్శన అతి ప్రాచీన కాలం నుండి ఉండినవని చెప్పడానికి వీలవుతన్నది.

సంస్కృత సాహిత్యాన్ని బాగా పరిశీలించిన పండితులు ఇప్పుడు మనకు దొరుకుతున్న నాటకాలలో భాసమహాకవి నాటకాలే ప్రాచీన నాటకాలని, భాసుడే మొదటి నాటక కర్త అని అభిప్రాయపడుతున్నారు. భాసుడు 24 నాటకాలు రాసినట్లు ప్రసిద్ధి ఉంది. అయితే 13 నాటకాలే దొరుకుతున్నాయి. ఈ పదమూడు నాటకాలను 1912-13లో గణపతి శాస్త్రి దేవనాగరలిపిలో

ఆ విషయాలను నిర్ణయించడానికి కావలసిన ఆధారాలు ఇంకా దొరకవలసి ఉంది. భాసుని పదమూడు నాటకాలివి 1. దూతవాక్యం. 2. కర్ణభారం 3. దూతఘటోత్కచం, 4. ఊరుభంగం, 5. మధ్యమవ్యాయోగం, 6.పంచరాత్రం, 7. అభిషేకం, 8. బాలచరితం, 9. అవిమారకం, 10. ప్రతిమా 11. ప్రతిజ్ఞాయౌగంధరాయణం 12. స్వప్నవాసవదత్త, 13. చారుదత్త. ఈ నాటకాలలో శ్రీమద్రామాయణ, మహాభారతాలకు సంబంధించిన కథలతో నిర్మితమైనవే ఎక్కువగా ఉన్నాయి. దీనిని బట్టి భాసుని కాలంలో (క్రీ.శ 1 నుండి క్రీ.శ. 4వ శతాబ్ది మధ్య) భారతదేశంలో అప్పటికి ఇతిహాస స్థితిని పొందిన రామాయణ భారతాలకు ఎంత ప్రాచుర్యముందో అర్థమవుతుంది. ఈ నాటకాల ప్రభావం తరువాతి సంస్కృత మహాకవులపై ఎంతో ఉంది. ఈ నాటకాలననుసరించి కాకపోయినా దేశంలో రామాయణ భారత కథలకు గల ప్రాచుర్య దృష్టిలో ఈ కథలకు సంబంధించిన నాటకాలెన్నో వచ్చాయి. భట్టనారాయణుని వేణీసంహారం; భవభూతి ఉత్తరరామచరిత్ర; మురారి అనర్ఘరాఘవం; రాజశేఖరుని బాలరామాయణం, బాలభాంతం; దిఙ్నాగుని కుందమూల; జయదేవుని ప్రసన్న రాఘవం మొదలైనవి కొన్ని ప్రసిద్ధనాటకాలు.

భారతదేశంలో నాటకకళ వికసించిన తరువాతనే రామాయణ భారతేతిహాసాలు ప్రజలలోకి ముఖ్యంగా నిరక్షరాస్యులైన ప్రజలలోకి వెళ్లడానికి అవకాశమేర్పడింది. శ్రీరామ నవమి ఉత్సవాలు, జన్మాష్టమి ఉత్సవాలు దేశమంతాజరగడానికి; భారతీయ సంస్కృతి పరిరక్షణకు, ఈ ఇద్దరు దేవతల దేవాలయాల నిర్మాణానికి కూడా అవకాశం కలిగింది. భారతీయ సంస్కృతికి ప్రతిబింబాలైన పురాణేతిహాసాల ప్రభావం ప్రజలపై బాగాపడింది. ఇది జాత్యైక్యతకు దోహదం చేసింది. ఈ అభ్యుదయ పంథాకు కారణాలెన్ని ఉన్నా తమ కిష్టమైన పురాణ పాత్రలను నాటకాలలో ప్రజలు ప్రత్యక్షంగా చూచి స్పందించడం ప్రధానకారణంగా భావించవచ్చు. సంస్కృత సాహిత్యం దేశభాషలలోనికి అనువదింపబడినప్పటినుండి పురాణదేవతల కథలన్నీ దేశభాషలలో వచ్చాయి. ఈ మార్పు పురాణేతిహాసాలకు ఇంకా ప్రాచుర్యాన్ని, జనాకర్షణను కలిగించింది. ఆంధ్రదేశంలో నన్నయ భారత రచనతో అనువాదయుగం ప్రారంభమైంది. తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథాది మహాకవులు సంస్కృత పురాణాలను తెలుగుచేశారు. ఈ కవులు ఆ రచనలలో పాండిత్య

ప్రకర్షకోసం కల్పించినవెన్ని ఉన్నా మూలగ్రంథాలలోని సారాన్ని మాత్రం యథాతథంగా తెలుగులోకిదించారు. తెలుగు వారు రామాయణ భారతాలను, పురాణాలను తెలుగులో చదువుకోవడం సాధ్యమైంది.

రామాయణ భారతాలతోపాటు శ్రీకృష్ణుని జీవితాన్ని వివరించే వ్యాస భాగవతం పోతన చేతుల మీదుగా తెలుగు కావడం వల్ల భాగవత కథలకు కూడా ఆంధ్ర దేశంలో ప్రచారం వచ్చింది. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు తెలుగువారి ఇలవేల్పులైనారు. అయినా పురాణ కథలన్నిటిలో భారతకథకు ఆంధ్రదేశంలో విశేషాదరణ ఉంది. భారత పాత్రలన్నీ తెలుగు ప్రజల జనజీవనంలో బాగా కలిసి పోయాయి. కవిత్రయం వారు తెలుగు ప్రజల కృతజ్ఞతకు పాత్రులయ్యారు. తెలుగువారు ధర్మభీమార్జున నకుల సహదేవులను తమ ఇండ్లలోని అన్నదమ్ముల అనుబంధానికి తీపి గుర్తుగా సంభావిస్తారు. తెలుగు వారి దృష్టిలో ద్రౌపది ఒక దేవత. ఆంధ్రదేశంలోని కొన్ని ప్రాంతాలలో ద్రౌపదిదేవి తిరునాళ్లు ఇప్పటికీ జరుగుతున్నాయి. భారత పర్వాలలో రసోదంచితమైన విరాటపర్వకథను తెలుగు ప్రజలు దేవాలయాలలో పౌరాణిక పండితులచేత చెప్పించుకొని వింటారు. పాండవుల అరణ్యావాసానికి గుర్తుగా వనభోజనాలు వెళ్లడం తెలుగువారికి ఎంతో ప్రియం. ఇలా భారతకథ తెలుగువారి జీవితాలలో అపరిహార్యమైన సాంస్కృతిక అంశంగా కనిపిస్తున్నది.

**తెలుగు నాటక రంగం - భారతనాటకాలు :** భరతుని నాట్యశాస్త్రం పుట్టిన కాలానికి కొంచెం ముందు వెనుకగా ఆంధ్రదేశంలో కూడా నృత్య సంగీత నాటకాలు, వాద్యాలు ప్రచారంలో ఉండినట్లు హాలుడు సంకలించిన గాథాసప్తశతిని బట్టి తెలుస్తుంది. గాథలలో కనిపించే మద్దెల, వీణ, హరితాళం, నటి, నాటకం, పూర్వరంగం మొదలైన పదాలు దీనికి సాక్ష్యం. భరతుని నాట్యశాస్త్రం, నందికేశ్వరుని అభినయ దర్పణం ఆంధ్రదేశంలో ప్రాచుర్యం పొందాయి. ఆంధ్రులు బహు నృత్య గీత వాద్య లలితాభినయ ప్రియులని భరతుడు పేర్కొన్నాడు.[11] ఆంధ్ర దేశాన్ని పాలించిన వివిధ రాజ వంశాలవాళ్లు నాట్యకళను పోషించారనడానికి ఉదాహరణలెన్నైనా దొరుకుతాయి. తూర్పు చాళుక్యరాజు గుణగ విజయాదిత్యుడు 'గాంధర్వవిద్యా ప్రవీణ' బిరుదాంకితుడు. నట్టువరాలైన చెల్లవ్వకు ఈ రాజు భూదానం చేసినట్లు శాసనముంది.[12] రాజరాజు నన్నయతో 'ఉదాత్త రసాన్వితకావ్యనాటక క్రమములు పెక్కు చూచితి' నన్నాడు. గరుడోపాఖ్యానంలో నన్నయ సముద్రాన్ని వర్ణిస్తూ

'నాటక ప్రయోగంబునుంబోలె ఘన రసపాత్ర శోభిత రంగ రమ్యంబైన దాని' అని రాశాడు.[13] నన్నెచోడుని కుమారసంభవంలోని దీక్షాధ్వర ధ్వంసాది ఘట్టాలు "పద్యనాటికలు"గా కనిపిస్తాయని దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి వారి నన్నెచోడ కవి చరిత్రంలో నిరూపించారు. పాల్కురికి సోమన బసవపురాణం లోని

ప్రమధ పురాతన పటుచరిత్రములు - క్రమ మొంద బహునాటకము లాడువారు
లలితాంగ రస కళాలంకార రేఖ - లలవడ బహురూపమాడెడువారు
భారతాది కథల జీరమరగుల - నారంగ బొమ్మల నాడించువారు
కడు నద్భుతంబుగ గంబ సూత్రము - లడ రంగ బొమ్మల నాడించువారు

అనే ఈ ద్విపద పంక్తులలో 'నాటకము', 'భారతాదికథలు', 'చీరమరగుల' గమనింపవలసిన అంశాలు.

తిక్కన భారతంలో గల నాటకీయత తెలియనిదికాదు. ఆయన నడిపిన రాయబార ఘట్టాలు దీనికి ప్రబల నిదర్శంగా నిలుస్తాయి. మూలంలో లేక పోయినా బృహన్నల ఉత్తరాదులకు నేర్పిన దంతా దేశినృత్యంగానే పేర్కొనబడింది. అప్పటికి ఆంధ్రదేశంలో ప్రచారంలో ఉండిన దేశి నృత్య పద్ధతులను జాయపసేనాని తన 'నృత్తరత్నావళి'లో గ్రంథస్థంచేశాడు. ప్రతాపరుద్ర యశోభూషణ కర్త విద్యానాధుడు నాటక లక్షణాలను చెప్పిన ప్రథమాంధ్రాలంకారికుడు. ఇతడు 'ప్రతాపరుద్ర కల్యాణం' అనే సమగ్రాంగమైన నాటకం రాశాడు. అగస్త్యుని మేనల్లుడైన గంగాధరుడు మహాభారతాన్ని నాటకీకరించినట్లు గంగాదేవి మధురావిజయం పేర్కొంటున్నది.[14] క్రీడాభిరామం తెలుగులో తొలి రూపకం. ఇది రావిపాటి త్రిపురాంతకుని 'ప్రేమాభిరామనాటకాన్న'నుసరించి రచింపబడింది. ఇది గోవింద మంచన శర్మకు, టిట్టిభశెట్టికి మధ్య జరిగిన సంభాషణ రూపంలో ఉంది. ఓరుగల్లు వేశ్యవాటికలో గల మాచల్దేవి అనే వారంగన చరితం నాటకంగా ప్రదర్శిస్తుండినట్లు వీరి సంభాషణద్వారా తెలుస్తుంది. ఎఱ్రన 'సూత్రధారి', 'నటింపగ', 'ఎఱ్రనితెర', మొదలైన నాటకోచితమైన పదాలను తన రచనలలో ఉపయోగించాడు.[15] ఆనాటికి వీధినాటకంగా ప్రదర్శితమౌతుండిన యక్షగానాన్ని

శ్రీనాథుడు పేర్కొన్నాడు. (భీమేశ్వ పురాణం 3-65) రాచకొండ ప్రభువైన సింగభూపాలుడు 'నాటకపరిభాష' అనే గ్రంథం రచించినట్లు తెలుస్తుంది.[16] అది అలభ్యం. ఈ గ్రంథం ఆనాటి వీధినాటకాలలో భాష ఎలా ఉండాలో చెప్పడానికి ఉద్దేశింపబడి ఉంటుంది.

సంగీత, నాట్యాలకు సంబంధించిన లక్షణ గ్రంథాలెన్నో రెడ్డిరాజుల కాలంలోను, విజయనగర రాజులకాలంలోను వచ్చాయి. పదునైదవ శతాబ్దికి చెందిన ఒక తమిళ శాసనంలో సాళువ నరసింగ రాయల నగరులో ఉండిన ఒక నాటక శాల ప్రస్తావించబడింది.[17] లలిత కళలకు కృష్ణరాయల కాలం స్వర్ణయుగం. నృత్య నాటక సంగీతాది కళలు ఎంతో అభివృద్ధిదశలో ఉండినవి. క్రీ.శ. 1514 నాటి ఒక తమిళ శాసనంలో తిరువత్తూరులోని కేశవస్వామి ఆలయస్థంభం మీద రాయలనాటి నటులపేర్లు చెక్కబడి కనిపిస్తున్నాయి.[18] అల్లసాని పెద్దన మనుచరిత్రలో (5-63) రామరాజ భూషణుని వసుచరిత్ర (1-103)లో నాటకములు ప్రస్తావించబడ్డాయి. నాయకరాజుల కాలంలో యక్షగానాలకు ఎనలేని ప్రాచుర్యం కలిగింది. ఇవన్నీ వీధి నాటకాలే. రామాయణ, భారత కథలకు చెందిన ఇవన్నీ వీధి నాటకాలే. రామాయణ, భారత కథలకు చెందిన ఇతివృత్తాలకానాడు ప్రజాదరణ విశేషంగా ఉండేది. ఈనాటకాలలోని పాటలు పద్యాలు ప్రజల నోళ్లలో నానుతుండేవి. రఘునాథనాయకుని రాజ్యంలో ఎన్నో నాటకశాలలుండినట్లు చేమకూర విజయ విలాసాన్నిబట్టి తెలుస్తుంది. ఇలా పరిశీలిస్తూపోతే ఆంధ్రదేశంలో ప్రాచీన కాలం నుండి నాటకాలాడబడినట్లు, ఇతివృత్తాలు పురాణాల నుండి గ్రహింపబడినట్లు, వాటిలో రామాయణ భారత కథలకు సంబంధించనవే ఎక్కువగా ఉండినట్లు వెల్లడవుతుంది.

**(అ) ఆధునిక యుగం - నాటకప్రాచుర్యం :** క్రీ.శ. 1857లో బొంబాయి, కలకత్తా, మద్రాసు నగరాలలో విశ్వవిద్యాలయాలు స్థాపించబడి తెలుగుదేశంలో ఆంగ్ల విద్య వ్యాపించినప్పటినుండి తెలుగు సాహిత్యానికి సంబంధించి ఆధునిక యుగంగా భావించవచ్చు. ఆంధ్ర దేశంలో ఆధునిక యుగంలో నాటకావిర్భావం కోరాడ రామచంద్రశాస్త్రి 'మంజరీ మధుకరీయం'తో మొదలైనట్లు విమర్శకుల అభిప్రాయం. తెలుగులో శ్రవ్య కావ్యాలలోనే నాటక ఛాయలు కనపడడం, ప్రదర్శన కోసమే కవులు రచనలు చేసి ఉండడం ఇంతకు ముందే గమనించాం. 1860లో రచింపబడిన శాస్త్రిగారి నాటకం

రూపకం. ఈ కాలంలో అప్పటికి సంస్కృతంలో ప్రసిద్ధిపొందిన నాటకాలను ఆంధ్రీకరించడం ప్రారంభమైంది. 1871వ సం॥లో కొక్కొండ వెంకటరత్నం పంతులు నరకాసుర విజయ వ్యాయోగాన్ని ఆంధ్రీకరించారు. 1875 ప్రాంతంలో పరవస్తు వేంకటరంగాచార్యులు అభిజ్ఞానశాకుంతాన్ని తెలిగించారు. తరువాత ఉత్తరరామచరిత్ర, మృచ్ఛకటికాలను ఆంధ్రీకరించారు. ఈ నాటకాలన్నీ ప్రదర్శనకు ఉద్దేశింపబడినా ప్రదర్శింబడలేదు. ఇవన్నీ శ్రవ్యరూపకాలే. (Closet Dramas). మొదటి సారిగా 1880లో ఆంధ్రదేశంలో ప్రదర్శింపబడిన నాటకం కందుకూరి వీరేశలింగంగారి 'వ్యవహార ధర్మబోధిని'. అదే సంవత్సరం కందుకూరి అనువాద రూపకాలైన రత్నావళి, చమత్కార రత్నావళి, (కామెడీ ఆఫ్ ఎర్రర్స్) కూడా ప్రదర్శింపబడినాయి. కందుకూరివారు ఇంకా అభిజ్ఞాన శాకుంతలం, మాళవికాగ్ని మిత్రం, ప్రబోధచంద్రోదయం, రాగమంజరి, కల్యాణ కల్పవల్లి, వెనీసువర్తక చరిత్ర, ప్రహ్లాద, హరిశ్చంద్ర, దక్షిణగోగ్రహణం అనే నాటకాలను సంస్కృతం నుంచి ఆంగ్లం నుంచి అనువాదం చేయడమేగాక స్వతంత్రంగా కూడా రచించారు. దీనితో ఆంధ్రదేశంలో నాటక ప్రదర్శనకు ప్రజాదరణ కలిగింది. నాటక పరిషత్తులు ఏర్పడడం ప్రారంభమైంది. ధార్వాడ నాటక సమాజం వారు తెలుగుదేశంలో సంచరిస్తూ నాటకాలు ప్రదర్శించడం దీనికి కారణం.

ఇమ్మానేని హనుమంతరావు 1889లో రాజమండ్రిలో హిందూనాటక సమాజన్ని స్థాపించారు. చిలకమర్తి లక్ష్మీ నరసింహం రచించిన 'కీచక వధ' నాటకం ఈ సమాజంలో ప్రదర్శింపబడింది. తరువాత చిలకమర్తి వారు గయోపాఖ్యానం, పారిజాతాపహరణం, సీతాకల్యాణం, పార్వతీపరిణయం, నలనాటకం, ద్రౌపదీపరిణయం మొదలైన నాటకాలను రచించారు. వీటిలో కొన్ని ప్రదర్శింపబడినాయి. గయోపాఖ్యానం వీరికి విశేషమైన ప్రఖ్యాతిని కలిగించింది. ఈ నాటకాన్ని గురించి లక్ష్మీ నరసింహంగారు తన స్వీయ చరిత్రలో "తెలుగు దేశములో గయోపాఖ్యానమును ప్రదర్శింపని రంగ స్థలము లేదని చెప్పవచ్చును. కొన్ని స్థలములలో కొందరు పెద్దమనుష్యులు గయోపాఖ్యాన నాటక విషయమై పోటీ పరీక్షలు పెట్టి కృష్ణార్జున పాత్రలు పలువురచేత ధరింపజేసి వారిలో శ్రేష్ఠముగా నభినయించిన వారికి బంగారు పతకములు మొదలైన బహుమతులిచ్చుచు వచ్చిరి" అని రాసుకొన్నారు.

ఈ కాలంలోనే కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి గయోపాఖ్యానం, శశిరేఖా పరిణయం, సుభద్రా పరిణయం, కీచక వధ, ద్రౌపదీ వస్త్రాపహరణం మొదలైన భారత నాటకాలతోపాటు కొన్ని రామాయణ నాటకాలను కూడా చేర్చి మొత్తం 31 నాటకాలను రచించారు. ఇవేవీ ఇప్పుడు దొరకవు.[19]

రాయల సీమలో కూడా నాటక సమాజాలు స్థాపించబడినాయి. ధర్మవరం కృష్ణమాచార్యులు 'సరసవినోదిని'ని స్థాపించి గద్యపద్యగేయాత్మకంగా చిత్రనళీయం మొదలైన 28 స్వతంత్ర నాటకాలను రచించారు. బళ్లారిలో మొదటి సారిగా 1886లో చిత్రనళీయ నాటక ప్రదర్శన జరిగింది. ఆచార్యులవారి ముద్రిత నాటకాలలో బృహన్నల, ప్రమీలార్జునీయం, పాంచాలీ స్వయంవరం భారతకథకు సంబంధించినవి. ప్రమీలార్జునీయంలో స్త్రీవిద్య, పాంచాలీ స్వయంవరంలో యువతుల వివాహచర్చ ప్రస్తావించబడినాయి. ఇది నాటకాల ద్వారా రచయిత సాధించిన సాంఘిక ప్రయోజనం. రాయలసీమ నాటకరంగం మీద మరొక నాటక సమాజాన్ని స్థాపించినవారు కోలాచలం శ్రీనివాసరావు. వీరు 'సుమనోరమసభ'ను స్థాపించి సుమారు 28 నాటకాలను రచించి ప్రదర్శించారు. శిరోమణి, ధర్మవిజయం (భారతయుద్ధం), చంద్రహాస, ద్రౌపదీ వస్త్రాపహరణం, బభ్రువాహన, కీచకవధ (సైరంధ్రి) అనే నాటకాలు వీరు రచించిన భారత నాటకాలు. నెల్లూరు జిల్లాకు చెందిన మరొక ప్రఖ్యాత నాటకకర్త వేదం వేంకటరాయ శాస్త్రి. వీరు పది రూపకాలను రచించారు. వీరి స్వతంత్ర నాటకాలలో ప్రతాపరుద్రీయం (1897), బొబ్బిలి యుద్ధం (1916) ముఖ్యమైనవి.

1880లో ముద్రింపబడిన వావిలాల వాసుదేవశాస్త్రిగారి 'నందకరాజ్యం' మొదటి సాంఘిక రూపకం. అప్పటి నుండి పౌరాణిక, చారిత్రక నాటకాలతో పాటు సాంఘికేతి వృత్తాలుగల నాటకాలు కూడా వెలువడినాయి. గురజాడ రచించిన కన్యాశుల్కనాటకాన్ని 1892 ఆగస్టు నెలలో విజయనగరం జగన్నాథవిలాసినీ నాటక సమాజం వాళ్లు ప్రదర్శించినప్పటి నుండి ఆంధ్రదేశంలో నాటక రచనలో ముఖ్యమైన మార్పు వచ్చింది. నాటక కర్తలు సాంఘికేతి వృత్తాలను నాటకీకరించడం ప్రారంభించారు. పౌరాణిక నాటక రచన తరువాత కూడా కొనసాగినా దాని ఉరవడి కొంత తగ్గింది.

(ఆ) భారతనాటకాల ప్రజాదరణ : కవిత్రయ భారతం ఆంధ్ర దేశంలో విశేష ప్రాచుర్యం పొందింది. నిరక్షరాస్యులు చదివించుకొని విన్నారు.

'వింటే భారతం వినాలి - తింటే గారెలు తినాలి' అనే విషయం తెలుగు భారతాన్ననుసరించి ఏర్పడిన దేనన్న అభిప్రాయముంది. తెలుగుభారతం వచ్చిన తరువాత అక్షరాస్యులైన పండితులు దానిని మూలభారతంతో పోల్చి చూచుకోవడం మొదలైంది. భారత కథను 'ఊకుడు కథ'గా చెప్పేవాళ్లు అప్పటికి భారతానికి సంబంధించి జనవ్యవహారంలో ఉండిన విషయాలనేగాక కొన్ని విషయాలను కల్పించికూడా చెప్పడం జరిగింది. మూలకర్తగాని, కవిత్రయంగాని అసందిగ్ధంగా కథను వదిలివేసిన సందర్భాలను జానపదులు తాము అల్లిన కథలతో పూరించడంవల్ల గ్రంథ రూపం పొందిన భారతంలో లేని కథలు ప్రచారమైనాయి. ఇలాంటి కథలపై ప్రజలకు వల్లమాలిన అభిమానమేర్పడింది. భారత కథలను నాటకాలుగా రాసిన వాళ్లుకూడా కొన్ని ఔచితీవంతమైన కల్పనలు చేశారు. బభ్రువాహన, ప్రమీలార్జునీయం మొదలైన నాటకాలు ఈ తరగతికి చెందినవే.

భారత కథలపై ప్రజలకు అభిమానమేర్పడడానికి కారణం అవి జనజీవితంలో ఎదురయ్యే సంఘటనలన్నింటికి మానవ స్వభావంలోని ప్రతి అంశానికి సరిపోయే కథాంశాలను కలిగి ఉండడం. అందుకే ప్రజలు భారతకథలంటే చెవికోసుకొన్నారు. భారత నాటకాలను తప్పకుండా చూశారు. భారత కథలకు ఇంకా ఎక్కువ ప్రజాదరణను కలిగించినవి తిరుపతి వేంకటకవుల పేర 16 నాటకాలు ఉన్నాయి. వీటిలోనే గాక తెలుగు నాటకాలలోనే ఇంత ప్రసిద్ధిపొందిన నాటకాలను వేళ్లమీద లెక్కించవచ్చుననడం నిజం. 1903లో తిరుపతి శాస్త్రిగారు 'పాండవ విజయం' ను రచించి ప్రకటించారు. వేంకటశాస్త్రిగారు దానినే పెంచి 1911లో ఉద్యోగం, విజయం అను పేరుతో రెండు భాగాలు చేశారు. అవే ప్రసిద్ధాలైన పాండవోద్యోగం, పాండవవిజయం. ఇవి రెండు కలిసి 'పాండవోద్యోగ విజయములు'గా రూపొందాయి. తొలి రోజులలో ఉద్యోగ విజయాలను విడివిడిగా ప్రదర్శించేవారు. 1915 నుండి రెండింటిలో కొన్ని భాగాలను తగ్గించి ఒకే నాటకంగా ఉద్యోగవిజయములను పేర ప్రదర్శించడం ప్రారంభమైంది. ఈ నాటకాలలోని కృష్ణార్జున పాత్రలను ధరించి తెలుగునాటకరంగంలో ఉత్తమ నటులనిపించుకున్న వారెందరో ఉన్నారు. ఆనాటకాల వల్లనే కొందరు నటులు ప్రసిద్ధులైనారు. మల్లాది గోవిందశాస్త్రి, ముంజులూరి కృష్ణారావు,

డి.వి. సుబ్బారావు, బందా కనకలింగేశ్వరరావు, పీసపాటి నరసింహమూర్తి మొదలైనవారు కృష్ణవేషం ధరించి పద్యాలను రాగయుక్తంగా పాడి ప్రేక్షకుల మన్ననలు పొందారు. తిరుపతి వేంకటకవులు రచించిన భారత నాటకాలివి. 1. పాండవవిజయం (1903), పాండవాశ్వమేధం (1903), పాండవ ప్రవాసం (1907), పాండవ జననం (1908), పాండవోద్యోగం (1911), పాండవ రాజసూయం (1921).

పౌరాణిక నాటకాలు ముఖ్యంగా భారతనాటకాలు బాగా ప్రజాదరణ పొందడానికి కారణం ఆ నాటకాలలోని పద్యాలు. నటులు ఆ పద్యాలను పాడి రాగాలను సాగదీస్తున్నపుడు ప్రేక్షకులు పొందే ఆనందానికి మేర ఉండేది కాదు. పౌరాణిక నాటకాలలోని పద్యాలను ప్రేక్షకులు కంఠస్థంచేసేవారు. ముఖ్యంగా పాండవోద్యోగవిజయ నాటకాలలోని పద్యాలలో కనీసం నాలుగైదైనా నోటికిరాని తెలుగు నాటక కళాభిమాని ఉండడు. తిరుపతి వేంకటకవుల పద్యాలు పశువుల కాపర్ల నాల్కలమీద కూడా నాట్యం చేశాయి.

'బావా ఎప్పుడు వచ్చితీవు', 'చెల్లియో చెల్లకో',

'సంతోషంబున సంధిచేయుదురె'

మొదలైన శ్రీకృష్ణరాయబారఘట్టానికి చెందిన పద్యాలను తెలుగు ప్రజలు ఇప్పటికీ తమ లౌకిక జీవిత సందర్భాలలో కూడా వాడు కోవడం కనిపిస్తున్నది. పౌరాణిక కథలు పనికి రావని చెప్పేవారున్న ఇప్పటి సంఘంలో కూడా పౌరాణిక నాటకాలకు గిరాకి ఉంది.

**(ఇ) పౌరాణిక నాటకాలకు ప్రేరణ :** పురాణ కథలంటే తెలుగువారికి వల్లమాలిన అభిమానం. కథ ఎవరైనా చెపుతూవుంటే ఊకొడుతూ వినడమే వీరి అలవాటు. నన్నయ భారతం కూడా వైశంపాయనుడు జనమేజయునికి చెప్పినట్లు ఉంది. మన సాహిత్యమంతా ఒక రకంగా కథాసాహిత్యమే. శాతవాహనుల నాటి బృహత్కథ జానపదకథల మణిహారం. దీని ప్రభావం తెలుగు వారి మీద కూడా ఉంది. అయినా తెలుగువారికి జానపద కథలకంటె పురాణ కథలపైననే అభిరుచిమెండు. పురాణ కథలలో కూడా భారతకథలంటేనే ఎక్కువ ఇష్టం. నాటకావిర్భావకాలం నుండి 1915 నాటికి భారత కథకు సంబంధించిన నాటకాలు 29 వెలువడ్డాయి. ఈ 29లో

గోదావరీ కృష్ణా జిల్లాలలోనే 23 నాటకాలు వెలుగు చూశాయి.[20] దీనికి కొన్ని కారణాలను అన్వేషించవచ్చు.

1. భారతకథ వీరరస ప్రధానం. భారత నాటకాల్లో పద్యాలున్నాయి. నటులు రాగయుక్తంగా పద్యాలను సాగదీసి పాడడం 'వన్స్‌మోర్'లు కొట్టించుకోవడం వల్ల ప్రజలకు వీరావేశం కలిగించి వారి మెప్పుకు పాత్రమైనాయి.

2. నాటక రచయితలలో కూడా తమ నాటకాలద్వారా ప్రజాదరణ పొందాలనే అభిప్రాయం కలిగింది. భారతాదిపర్వంలోని శకుంతల కథ ఎక్కువ ప్రజానురంజకం కావడంవల్ల కాళిదాసు అభిజ్ఞానశాకుంతలం అనేక రచయితలచేత అనువదింపబడింది. రాయదుర్గం నరసయ్య శాస్త్రి, వేదం వేంకట రాయశాస్త్రి, దాసు శ్రీరాములు, వడ్డాది సుబ్బారాయుడు, కందుకూరి వీరేశలింగం మొదలైన వారంతా ఈనాటకాన్ని అనువాదం చేశారు. రచయితలలో ఏర్పడిన స్పర్థకూడా దీనికి కారణం. ఈకారణం చేత కూడా భారత నాటకాలకు ప్రజాదరణ కలిగింది.

3. భారతదేశ స్వాతంత్ర్యోద్యమ స్ఫూరితో సాహిత్యం సృజింపబడిన కాలంలోనే నాటకాలు రచింపబడినాయి. కాంగ్రెసువాళ్లు స్వరాజ్య తీర్మానం చేసి తత్సాధనకు పోరాడుతున్న రోజులవి. దేశప్రజలను స్వాతంత్ర్య సమరోన్ముఖులను చేయవలసిన బాధ్యత తమపై ఉన్నదని ఇతరకవులతో పాటు నాటక కవులు కూడా గ్రహించారు. పూర్వాంధ్ర జాతీయ వీరుల చరిత్రలను నాటకీకరిస్తే ప్రజాచైతన్యాన్ని కలిగించవచ్చునని కొందరు భావిస్తే కొందరు వీరరసస్ఫోరకమైన భారత కథాంశాలను నాటకీకరించారు. తిరుపతి వేంకటకవుల పాండవోద్యోగ విజయనాటకాలీ తరగతికి చెందినవి. ఈ నాటకాలలో కృష్ణుని ప్రపంచ నాటక సూత్రధారిత్వం, ధర్మరాజు రాజనీతి, దుర్యోధనుని రాజసం, భీష్ముని కృష్ణభక్తి, కర్ణుని స్వామిభక్తి మొదలైన విషయాలు వివరింపబడినాయి. తిరుపతి వెంకటకవులు పాండవులను ధర్మవీరులుగా చిత్రించారు. అక్కడక్కడ మాతృదాస్య విమోచనం, స్వాతంత్ర్య సముపార్జన మొదలైన భావాలను పొందుపరచి తెలుగు

ఉద్యమ స్ఫూర్తి కూడా కలిగింది.

4. సహజంగానే ఇతర సాహిత్య ప్రక్రియలలో నాటకానికి ప్రజాదరణ ఎక్కువ. ప్రజలు దీనిద్వారా రసాభివ్యక్తిని సులభంగా పొందగలరు. కవిత్వ సంగీత నృత్యాది కళలన్నీ సమన్వయం పొందడం వల్ల నాటకం 'సమాహారకళ' గా చెప్పబడింది. 'నాటకాంతం హి సాహిత్యం' అన్న విషయం కూడా దీనినే నిరూపిస్తుంది. ఈ కారణం వల్ల ఎన్నో నాటక సమాజాలు వెలిశాయి. నాటక పోటీలు నిర్వహింపబడినాయి. నాటకంలో నటించడం కళారాధనగా మారింది. గాన మాధుర్యంచేత కొందరు, అభినయకౌశలం చేత కొందరు గొప్ప నటులుగా తయారయ్యారు. టంగుటూరి ప్రకాశం పంతులు, హరి ప్రసాదరావు, బలిజేపల్లి లక్ష్మీకాంతం, ముప్పిడి జగ్గరాజు, యడవల్లి సూర్యనారాయణ, ఉప్పలూరి సంజీవరావు, స్థానం నరసింహారావు, బెల్లంకొండ సుబ్బారావు, టి.వి.రాఘవాచారి (బళ్ళారి రాఘవ) డి.వి. సుబ్బారావు మొదలైన వారంతా గొప్పనటులుగా పేరు పొందారు. ఈ కారణం వల్లకూడా నాటకాలధికంగా రచింపబడి ప్రదర్శింపబడినాయి.

పైన చూపిన కారణాలేగాకుండా నాటక ప్రాచుర్యానికి మరికొన్ని కారణాలున్నాయి. పౌరాణిక నాటకాల ద్వారా సామాజిక సమస్యలకు పరిష్కారంచూపడం నాటక కవుల ప్రజాదరణకు ముఖ్యకారణం. దాయభాగ పరిష్కారం ప్రతి తెలుగు గృహంలో ఎదురయ్యే సమస్యే. ఆంగ్ల సంస్కృతి ఉమ్మడి కుటుంబాల విచ్ఛిన్నతకు కారణం కావడంవల్ల అన్నదమ్ముల మధ్య, చివరకు తల్లిదండ్రుల బిడ్డల మధ్య భేద బీజాలు మొలవడం మొదలైంది. కౌరవ పాండవులవలె ఇరుపక్షాల అన్నదమ్ముల మధ్య రగులుకొన్న వివాదాన్ని కృష్ణుడు వలె గ్రామపెద్దలు రాయబారం జరిపి పరిష్కరించడం, ఈ రాయబారానికి కౌరవ సభ కాకుండా గ్రామచావడో లేక రచ్చబండో కూడలి స్థలం కావడం తెలుగు ప్రజల అనుభవంలోని విషయం. ఇలాంటి కారణలెన్నో ఆంధ్రదేశంలో నాటకాలను పోషించాయి. భారతకథలు ఆంధ్రదేశంలోనేకాదు ఇతర దక్షిణ రాష్ట్రాలలో కూడా ప్రాచుర్యం పొందాయి. దక్షిణ భారతదేశంలో సినిమాశకం ఆరంభమైన తరువాత మొదట్లో పౌరాణిక

కథలే ముఖ్యంగా భారత కథలే సినిమాలుగా నిర్మింప బడినాయి. ఆయా పౌరాణిక సినిమాలకు కథలు తయారుచేసిన రచయితలు అప్పటికే ఆ కథలు నాటకరూపంలో ఉండడంవల్ల ఆనాటకాలను బాగా ఉపయోగించుకున్నారు. సినిమాకోసం కథను కొంత మార్పుచేసుకున్నా చాల సినిమాలు నాటకాలలోని కథను, పద్యాలను యధాతథంగా వాడుకున్నాయి.

**పౌరాణిక కథలు - సినిమాలు :** రంగస్థలం మీద చూచిన నాటకాన్ని తెరమీద చూడడం ఎంతో సంతోషం కలిగించే విషయం. నాటకంలో చూపలేని అనేకాంశాలను సినిమాలో చూపడానికి వీలుంది. సినిమా ఒక మాయా ప్రపంచం. అందులో విహరించడం ఒక అనుభూతి. రంగస్థల నాటకం చూడడంలోను, సినిమా చూడడంలోను ఒకే రకమైన అనుభూతి కలిగినా ప్రేక్షకుని బాగా రంజింపజేసేది సినిమా. నాటకంలో సూత్రధారుడు సినిమాలలో దర్శకుడయ్యాడు. శాస్త్రప్రగతి మనకిచ్చిన గొప్ప కానుక సినిమా. గోడకు గల ఒక రంధ్రంనుండి పొగ రూపంలో (చీకటిలో చూచినపుడు) బయటకు వచ్చి ఎదురుగా కట్టిన తెల్లని తెరపై బొమ్మలను ప్రదర్శించే సినిమాను మొదటి రోజుల్లో జనం వేలం వెర్రిగా చూచేవారని ఆనాటి సినిమాను గురించి వయోవృద్ధులు ముచ్చటించుకొంటూ వుంటే వింటాం. తెరమీద బొమ్మలు కదలడం, అభినయించడం, మాట్లాడడం, పాటలు పాడడం చూస్తుంటే సాంకేతిక శాస్త్రకారుడు మానవుని మరో లోకంలోకి తీసుకొని పోయినట్లుండేదని ఆనాటి సినిమా ప్రేక్షకులైన ఈనాటి వృద్ధులు చెపుతుంటారు. సినిమాకు జనాకర్షణ కలిగిన తర్వాత 'స్టేజిడ్రామా'లకు గిరాకి తగ్గి పోయిందని, చాలమంది 'స్టేజి ఆర్టిస్టులు' సినిమాలలో నటించడం ప్రారంభించారని కూడా చెపుతారు. ఈ మాటలు అక్షరసత్యాలు.

ఇరవయ్యో శతాబ్ది మొదట్లో భారతీయులు సినిమాను గురించి విన్నారు. ఆ తరువాత రెండు మూడు సంవత్సరాలకు సినిమా చూశారు. రంగస్థల నాటకాలను ప్రదర్శింపజేసేవారికి సినిమా ఒక వరంలా భాసించింది. ఆరుబయట రంగ స్థలంలో 'పెట్రోమాక్సులైట్లు' పెట్టుకొని కొన్ని వందల మంది క్రిక్కిరిసి ఉండగా చివర కూర్చున్న ప్రేక్షకులకు కూడా వినపడేటంత గట్టిగా సంభాషణలను పద్యాలను పలుకుతూ ఎంతో కష్టపడుతూ ఉండిన నటులకు సినిమాలలో నటించడం హాయనిపించింది. సినిమాను ఒకచోటనుండి

కొన్ని సాంఘిక ప్రతిబంధకాలు ఉండినప్పటికి కొంతకాలం తరువాత ప్రజలలో మంచి పేరు ప్రతిష్ఠలు ఏర్పడినాయి. అప్పటి నటులంతా తీయగా పాడగలిగిన వారే. సినిమాలలో కూడా ఎవరి పాటలు వారే పాడుకునేవారు. ఇప్పటిలాగ ఒకదృశ్యాన్ని రెండుమూడుసార్లు తీసే సౌకర్యాలంతగా లేక పోవడంవల్ల నటులు మనసును శరీరాన్ని ఒక చోట పెట్టుకొని చాల జాగ్రత్తగా ఒకేసారి విజయవంతంగా నటించేవారు. ఇది వారిలో మంచి క్రమశిక్షణకు కారణమైంది. ఇలా ఏర్పడిన క్రమశిక్షణ చాలామంది నటుల జీవితాలలో పండు వెన్నెలను కాయించింది. ఆతరం నటులను మనమిప్పుడు కదిలిస్తే ఇలాంటి చారిత్రక విషయాలెన్నో బయటపడతాయి.

ఆకాలపు నటులంతా రంగస్థలం మీద ఆరితేరినవారే. పైగా పౌరాణిక నాటకాలలో నటించి పద్యాలు పాడి మెప్పించినవారు. మొదట్లో అలాంటివారే సినిమాలలో నటించడంవల్ల సినిమా నిర్మాతలు పౌరాణిక కథలనే సినిమాలుగా తీయడం ప్రారంభించారు. తెలుగులో సినిమాలు వచ్చిన నాటికి ఆంధ్రదేశంలో ప్రదర్శన యోగ్యమైన సాంఘిక నాటకాలు రావడం, వీటికి ప్రజాదరణ కలగడం జరిగింది. సాంఘిక సంస్కరణ దిశగా రచయితలు పయనిస్తున్న రోజులవి. పురాణాలకథలను విశ్లేషించి వాటిలోని మానవీయ విలువలను ప్రతిపాదిస్తూ నాటక రచయితలు నాటకాలు రాసేవారు. పాశ్చాత్య సంస్కృతి మన సంస్కృతిని కలుషితం చేస్తున్నదని, దానిని నిరోధించి మన ప్రజలకు మన సంస్కృతి విలువలను తెలియజెప్పాలని రచయితలు భావించారు. దేశంలో ఇలాంటి పరిస్థితులు నెలకొనిఉన్నా పురాణకథలే సినిమాలుగా వచ్చాయి. పురాణాలకు గల ప్రజాదరణ అసంఖ్యాకమైన నాటకాల ఆవిర్భావానికి ఎలా కారణమైందో అదే విధంగా సినిమాల ఆవిర్భావానికి కూడా కారణమైంది. తెలుగు ప్రజలలో ఇప్పటికీ పౌరాణిక కథలమీద అనురక్తి ఉంది. మనది పురాణ సంస్కృతి. భారతీయ సంస్కృతి పురాణాలలో నిక్షిప్తమైఉంది. శ్రీరామ శ్రీకృష్ణుల కథలకు తెలుగువారి హృదయాలలో బలమైన ముద్ర ఉంది. అందువల్ల సినిమావాళ్లు పురాణకథలనే సినిమాలుగా తీశారు. సినిమా ప్రారంభమైన మొదటి రోజుల్లో సాంఘికేతి వృత్తాలు గల

స్వాతంత్ర్య పిపాసను కలిగించడానికి ప్రయత్నించాయి. ఈ ప్రయత్నానికి వీరరసోదంచితమైన భారత కథలే బాగా నప్పడం వల్ల నిర్మాతలంతా భారతంలో ప్రజలను ఉత్తేజ పరిచే అంశాలున్న కథలనే సినిమాలకు ఎన్నుకున్నారు. సినిమా ప్రారంభపు రోజుల్లో భారతీయ సంస్కృతికి దర్పణాలైన సావిత్రీ సత్యవంతులకథ, ద్రౌపదీ వస్త్రాపహరణకథ, గరుడగర్వభంగం మొదలైన కథలు సినిమాలుగా వచ్చి ప్రజలకు భారతీయ ధర్మాన్ని విప్పిచెప్పాయి. సావిత్రికథ జనరంజకం కావడం వల్ల 1933లో రెండుసార్లు చలన చిత్రంగా నిర్మింపబడింది. భక్తి, పాతివ్రత్యం, ఆదర్శదాంపత్యం, స్త్రీలపట్ల గౌరవం, భ్రాతృప్రేమ, పరోపకారం మొదలైన అంశాలను పౌరాణిక కథల ద్వారా సినిమాలలో చూపించారు.

**తెలుగు సినిమా - ఆవిర్భావికాసాలు :** సుమారు నూరు సంవత్సరాలకు ముందు బొంబాయిలో మొదటి సారిగా సినిమా ప్రదర్శన ఏర్పాటైంది. బ్రిటీష్ వాళ్ల కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఆ సినిమా పూర్తిగా విదేశీ సినిమా. ఆసినిమాను తెల్లదొరలంతా ఆసక్తిగా చూశారు. ఈ సంఘటన జరగడానికి ఒక సంవత్సరం ముందు లుమిరి సోదరులు కదిలే బొమ్మలను తన లోపల బంధించి మళ్లీ ప్రదర్శించే కెమెరా, ప్రొజెక్టర్లను పారిస్‌లో మొదటి సారిగా ప్రదర్శించి సినిమా నిర్మాణానికి మార్గం వేశారు. ఈ విషయం తెలిసినప్పటి నుండి భారత ప్రజలు ఆ వింతవస్తువుల కోసం ఆశగా ఎదురు చూశారు. తరువాత సంవత్సరానికి సినీ ప్రొజెక్టర్ వచ్చి ఒక చిత్రాన్ని ప్రదర్శించింది. ఈ చిత్రంలో ఒక రైలు స్టేషన్‌లోకి రావడం చూపబడింది. తరువాత సముద్ర స్నానాలు చేయడాన్ని చిత్రించిన 'దిసీబాత్' వంటి కదిలే బొమ్మల్ని ప్రదర్శించి చూపడం జరిగింది. అప్పుడు టికెట్ ఒకరూపాయి. నేటి విలువతో పోల్చిచూస్తే వందరూపాయల పైమాట. అయినా జనం విపరీతంగా చూశారు. భారతదేశంలో 1910 నుండి 'మూకీ' సినిమాలు ప్రారంభమయ్యాయి.

ఈ విచిత్రాలన్నీ బొంబాయిలో జరిగాయి. 1910లో ఆర్.జి. టోర్నె 'భక్తపుండరీక్' అనే మూగ చిత్రాన్ని నిర్మించాడు. అయితే విదేశీ సాంకేతిక నిపుణుల సహకారంతో రంగ స్థల నాటకాన్ని యథాతథంగా తెరకెక్కించడం చేత అయనకు భారత చలన చిత్ర పితగా గుర్తింపురాలేదు. 1911లో వచ్చిన 'రాజదర్బారు' భారతదేశంలో మొదటి మూకీగా పరిగణించబడింది.

విదేశీశాస్త్రజ్ఞుల సహకారం లేకుండా నిర్మించిన పూర్తి నిడివి మూకీ 1913లో వచ్చిన 'రాజాహరిశ్చంద్ర'. కాబట్టే చిత్ర నిర్మాత దాదా సాహెబ్ పాల్కే భారతీయ చలన చిత్ర పితగా పరిగణింపబడ్డారు.[21] 'రాజాహరిశ్చంద్ర' విడుదల కాకముందే తెలుగు వాడైన రఘుపతి వెంకయ్య మద్రాసులో మూకీచిత్ర ప్రదర్శనకు నాంది పలికాడు. మద్రాసులోని విక్టోరియా పబ్లిక్‌హాల్‌లో ఈయన 1909లో కదిలే బొమ్మల ప్రదర్శనను నిర్వహించాడు. మచిలీపట్నంకు చెందిన రఘుపతి వెంకయ్య ప్రథమ తెలుగు సినిమా ప్రదర్శకుడేగాక మొట్టమొదటి స్టూడియో యజమాని, చలనచిత్ర నిర్మాత కూడా. ఈయన మద్రాసులో మొదటి సినిమా థియేటర్ 'గెయిటీ'తో పాటు సినిమాల నిర్మాణానికి 'గ్లాస్ స్టూడియో'ను కూడా నిర్మించాడు. 'స్టార్ ఆఫ్ ఈస్ట్ ఫిల్మ్స్' సంస్థ యాజమాన్యంలో తన కుమారుడైన ఆర్. యస్ ప్రకాశ్ దర్శకత్వంలో మూకీ చిత్రాలు నిర్మించాడు. ప్రకాశ్ మూకీ చిత్రాలకు దర్శకత్వం వహించడమేగాక వాటిలో ఒకటైన 'భీష్మప్రతిజ్ఞ'లో హీరో పాత్ర ధరించాడు. అయనే మద్రాసులో 'ఫిల్మ్‌ప్రాసెసింగ్' కోసం 'గోవర్ధన్ లేబరేటరీ'ని స్థాపించాడు. ఇతడే మొదటి తెలుగు చలన చిత్ర దర్శకుడు. మొదటి తెలుగు చలన చిత్ర కథానాయకుడు కూడా.

విదేశాలలో సినిమాటోగ్రఫీ పరిజ్ఞానం నేర్చుకొని వచ్చిన ఆర్.ఎస్. ప్రకాశ్ తన విద్యను సి.పుల్లయ్య. వై.వి. రావులకు నేర్పాడు. వీళ్లు బొంబాయి వెళ్లి దాదాసాహెబ్ పాల్కే దగ్గర దర్శకత్వ మెలకువలు నేర్చుకొని వచ్చారు. తరువాత సి. పుల్లయ్య 1926లో 'మార్కండేయ మూకీ చిత్రాన్ని నిర్మించి ఇంటి గోడలపై ప్రదర్శించి 'గోడమీదబొమ్మ' నానుడికి ఆద్యుడైనాడు. టెంట్ సినిమాలు, గోడమీద బొమ్మలతో పనిలేకుండా ఆంధ్ర దేశంలో మొట్ట మొదట 'పర్మనెంట్'గా నిర్మించిన సినిమా థియేటర్ 'మారుతీ సినిమా'. ఇది 1921లో పోతన శ్రీనివాసరావుచేత విజయవాడలో నిర్మించబడింది. సరికొత్త దృశ్య ప్రక్రియ అయిన మూకీ చిత్రం (నిశ్శబ్ద చలన చిత్రం) మొదట్లో ఆసక్తిదాయకంగా ఉండినా తరువాత తరువాత ప్రేక్షకులకు విసుగు కలిగించింది. దీనిని గమనించిన ప్రదర్శకులు మొదట ప్రదర్శన శాలల్లో వ్యాఖ్యాతలను నియమించారు. తరువాత నాటకాలలో వలె తెరముందు ప్రేక్షకులకు అడ్డం లేకుండా పొడుగాటి గొయ్యి తవ్వి అందులో వాద్యగోష్ఠిని ఏర్పాటుచేసి సినిమాలోని సంఘటనకు సరిపోయే శబ్దాలను, సంగీతాన్ని

వినిపించారు. ఇది ప్రేక్షకులలో కొంతవరకు ఆనందానుభూతిని కలిగించింది. అయినా మూకీలు నాటకాల పోటీని తట్టుకొని నిలబడలేకపోయాయి. అప్పుడు ప్రేక్షకులను సంతృప్తి పరచడంకోసం మూకీ చిత్రాలలోనే వాద్య గోష్ఠి ద్వారా పాటలను వినిపించడం ప్రారంభించారు. 1931లో మొదటి టాకీ చిత్రం భక్త ప్రహ్లాద రావడంతో ప్రేక్షకులు ఈ ఇబ్బంది లేకుండా సినిమాలోనే మాటలను పాటలను వినే అవకాశం కలిగింది.

మొదటి టాకీ చిత్రం రావడానికి ముందు జరిగిన కొన్ని చారిత్రక సంఘటనలను గుర్తుచేసుకోవలసిన అవసరముంది. స్టేజి డ్రామాలతో తృప్తి పడుతున్న తెలుగు ప్రజలకు సినిమా మోజు ఏర్పడింది. హెచ్.యమ్.రెడ్డి యల్.వి. ప్రసాద్‌లు బొంబాయికి వెళ్లి ఎన్నో కష్టాలు పడి సినిమా నిర్మాణంలోని అనేకాంశాలను నేర్చుకున్నారు. హైద్రాబాదుకు చెందిన పైడిజయరాజ్, తెనాలికి చెందిన పి.వి. రావు బొంబాయికి వెళ్లి అక్కడ మూకీ చిత్రాలలో నాయకులుగా నటించేవారు, హెచ్.ఎమ్.రెడ్డి బెంగుళూరులో పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగాన్ని వదిలేసి బొంబాయిలోని శారదా ఫిల్మ్ కంపెనీలో 'రిప్లెక్టర్‌బాయ్' గా చేరాడు. ఎల్.వి.ప్రసాద్ 1929లో 100 రూపాయిలతో బొంబాయి వెళ్లాడు. ఆయన స్టూడియోలలో 'ట్రాలీబాయ్' మొదలుకొని 'ఎక్స్‌ట్రా' వరకు రకరకాల పనులు చేసి చివరకు 'అసిస్టెంట్ డైరెక్టర్' స్థాయికి ఎదిగాడు. తరువాత ప్రప్రథమ భారతీయ టాకీ 'అలంఅరా'లో అయిదు ఎక్స్‌ట్రా పాత్రలు ధరించాడు. అలం అరా విజయవంతం కావడంతో ఆచిత్ర దర్శకుడు ఎం. ఇరానీ దృష్టి దక్షిణ భారతీయ భాషాచిత్రాల వైపు ప్రసరించింది. అప్పటికే ఆరు మూకీ చిత్రాలకు దర్శకత్వం నెరపిన హెచ్.ఎమ్.రెడ్డికి తొలి తెలుగు తమిళటాకీ చిత్రాలను నిర్మించే బాధ్యతను అప్పగించారు. ఆయన దర్శకత్వంలో 1931లో తొలితెలుగు టాకీ 'భక్తప్రహ్లాద' నిర్మించబడింది. సురభి బృందం ప్రదర్శించిన స్టేజినాటకం ఆధారంగా నిర్మించిన ఈ చిత్రం ఆంధ్రదేశంలో ఘనవిజయం సాధించింది. తెలుగు పాటలు తమిళ సంభాషణలతో ఈయనే నిర్మించిన తొలి తమిళ టాకీ 'కాళిదాసు' కూడా విజయాన్ని సాధించింది. అవిధంగా హెచ్.యమ్. రెడ్డి దక్షిణ భారత దేశంలో టాకీ చిత్రాల పితామహుడుగా చలన చిత్ర చరిత్రలో నిలిచిపోయారు. అప్పట్లో ఆయనకు సహాయక

తెలుగు సినిమాకు రూపురేఖలు దిద్ది ప్రాణం పోసిన సినిమా పెద్దలందరూ 1930వ దశకంలో మద్రాసు చేరారు. ఇక్కడే హెచ్.యమ్. రెడ్డికి బి.యన్.రెడ్డితో పరిచయమైంది. వీళ్లిద్దరూ ప్రఖ్యాత నటీమణి కన్నాంబతో కలిసి 'రోహిణీ పిక్చర్స్'ను స్థాపించారు. ఈ సంస్థ 1938లో నిర్మించిన 'గృహలక్ష్మి' చిత్రంలోనే చిత్తూరు నాగయ్య సినిమా రంగ ప్రవేశం చేశారు. ఆంధ్ర దేశంలో అశేష ప్రజాభిమానం పొందిన మొట్టమొదటి సినీ హీరో నాగయ్యగారే. తొలితెలుగు టాకీ భక్త ప్రహ్లాద విడుదలైన తరువాత వరుసగా అయిదేళ్లపాటు పౌరాణిక నాటకాలే సినిమాలుగా మలచబడినాయి. అవి ధర్మార్థకామ మోక్షాలను గురించి చెపుతూ ప్రజలకు సంప్రదాయ విలువలను బోధించేవి. మచిలీ పట్నానికి చెందిన పినపాల వెంకటదాసు మద్రాసులో 'వేల్ పిక్చర్స్ స్టుడియో'ను స్థాపించి 1934లో సీతా కళ్యాణం, 1936లో మాయాబజార్ ( శశిరేఖా పరిణయం) అనే చిత్రాలను నిర్మించాడు. ఈ మాయాబజార్ చిత్రం విజయం పొందడంతో 1957లో విజయావారు మళ్లీ ఈ చిత్రాన్ని నిర్మించారు. పౌరాణిక చిత్రాలతో పాటు ఆనాటి నిర్మాతలు సమాజంలోని వాస్తవిక సమస్యలను పరిష్కరించే ఉద్దేశంతో సాంఘిక చిత్రాలు కూడా నిర్మించడానికి పూనుకొన్నారు. ఈ నేపథ్యంలో మొదటి సాంఘిక చిత్రం 'ప్రేమవిజయం' 1936లో విడుదలైంది. అయితే ఈ సినిమా విజయవంతం కాలేదు. తరువాత 'రంగూన్ రౌడి' అనే స్టేజి నాటకం ఆధారంగా 11938లో హెచ్.యమ్.రెడ్డి, బి.యన్.రెడ్డి కలిసి నిర్మించిన 'గృహలక్ష్మి' చిత్రం విజయవంతమైంది. మధ్యపానం వల్ల కలిగే అనార్థాన్ని తెలుపుతూ పాతివ్రత్య సంప్రదాయాన్ని ప్రబోధించిన గొప్ప సాంఘిక చిత్రమిది.

సాంఘిక ప్రయోజనంగల చిత్రంగా చరిత్రలో నిలిచిపోయిన సినిమా 'మాలపిల్ల'. పత్రికలకన్నా సినిమాయే శక్తివంతమైన ప్రచార సాధనమని గుర్తించిన గూడవల్లి రామబ్రహ్మం నిర్మించిన చిత్రమిది. ఆనాడు దేశాన్ని ఊపేస్తుండిన హరిజనోద్యమాన్ని రామబ్రహ్మం తన సినిమాకు ఇతివృత్తంగా తీసుకొన్నాడు. దీనికి గుడిపాటి వెంకటచలం కథారచన చేయగా తాపీ ధర్మారావు సంభాషణలు రాశారు. బసవరాజు అప్పారావు ఆ చిత్రంలోని పాటలకు కావ్యగౌరవం కలిగించారు. ఇందరు ప్రముఖుల సృజనాత్మక శక్తితో రూపొందిన ఈ సినిమా తెలుగుదేశంలోనే గాక ఇతర దక్షిణాది రాష్ట్రాలలో కూడా అఖండవిజయం సాధించింది. ఆ తరువాత రామబ్రహ్మం

1939లో నిర్మించిన రైతుబిడ్డ చిత్రంలో ఫ్యూడల్ వర్గాలపై తిరుగుబాటు ఉండడంతో ఈ చిత్రాన్ని ప్రభుత్వం నిషేధించింది ఆతరువాత ఆంధ్రదేశంలో సంచలనాత్మక సందేశంగల సామాజిక చిత్రాల సంఖ్య తగ్గిపోయింది. మాలపిల్ల విజయం 1939లో అయిదు సాంఘిక చిత్రాల నిర్మాణానికి, విడుదలకు దోహదం చేసింది. పౌరాణికాల నుంచి తెరపి ఇచ్చిన ఈ సాంఘిక చిత్రాలలో రైతుబిడ్డతో పాటు వందే మాతరం, మళ్ళీపెళ్ళి, అమ్మ, వర విక్రయం వంటి చిత్రాలున్నాయి. వీటిలో సి.పుల్లయ్య దర్శకత్వం వహించిన వరవిక్రయం చిత్రంతోనే ప్రసిద్ధనటి భానుమతి సినీరంగ ప్రవేశం చేశారు. కాంచనమాల, శాంతకుమారి. కన్నాంబ, భానుమతి అప్పటి సినీనాయికలు.

మొదటి టాకీ చిత్రం 'భక్త ప్రహ్లాద' 1931లో విడుదలైనప్పటి నుండి 1940 వరకు వేళ్లమీద లెక్కించదగినట్లుగా కొన్ని సాంఘిక చిత్రాలు తప్పిస్తే మొత్తంమీద వచ్చిన వన్నీ పౌరాణిక చిత్రాలే. సంవత్సరాల వారిగా పౌరాణిక చిత్రాలివి -

1932 - పాదుకా పట్టాభిషేకం, శకుంతల

1933 - రామదాసు, రామదాసు, సావిత్రి, సావిత్రి (ఒకే చిత్రం రెండుసార్లు చిత్రింపబడడానికి కారణం వేరు వేరు సినిమా కంపెనీల వాళ్లు తీయడం)

1934 - అహల్య, లవకుశ, సీతాకల్యాణం

1935 - అనసూయ, ద్రౌపదీమాన సంరక్షణం, ద్రౌపదీ వస్త్రాపహరణం, ప్రమీలార్జునీయం, మాయాబజార్, లంకాదహనం, వీరాభిమన్యు, సంపూర్ణరామాయణం, సతీతులసి, సులోచన.

1937 - దశావతారములు, నరనారాయణ, మోహినీరుక్మాంగద, రుక్మిణీ కల్యాణం.

1938 - కచదేవయాని, చిత్రనళీయం, జరాసంధ, మార్కేండయ, మోహినీ భస్మాసుర.

1939 - పాశు పతాస్త్రం, శ్రీవేంకటేశ్వర మహత్యం

1940 - భూకైలాస్, మైరావణ.

**జానపద సాహిత్య ప్రభావం**

ఈ పది సంవత్సరాలలో ఈ పౌరాణిక చిత్రాలతోపాటు గుబేబకావళి వంటి జానపద చిత్రాలు, సారంగధర, భోజ కాళిదాసు వంటి చారిత్రక చిత్రాలు, విప్రనారాయణ, మీరాబాయి వంటి భక్తుల చిత్రాలు వచ్చాయి. సినిమా వినోద సాధనమనే అభిప్రాయం సినిమా నిర్మాతలలోను, ప్రేక్షకులలోను ఉండడంవల్ల ఏ ఇతివృత్తానికి సంబంధించిన సినిమానైనా ప్రజలు చూచేవారు. సినిమాకు సామాజిక ప్రయోజనం ఉండాలనే అంశం అప్పటికి ప్రయోగాత్మకంగానే ఉండేది. 1960 నుండి వచ్చిన చిత్రాలు సామాజిక ప్రయోజనాన్ని సాధించడానికి బాగా ప్రయత్నం చేసినట్లు కనిపిస్తుంది. సినిమా భక్తికి సంబంధించినదైనా కావాలి లేదా ప్రేమకు సంబంధించినదైనా కావాలి అనే అభిప్రాయం అప్పట్లో బాగా ఉండేది. భక్తి, ప్రేమ అనే భావాలు బాగా రసపుష్టిని కలిగిస్తాయి. అందుకే ఈ రెండు భావాల చుట్టూ నిర్మితమైన చిత్రాలు బాగా విజయవంతమైనాయి. భక్తిని వ్యక్తపరిచేవి పౌరాణిక చిత్రాలుకాగా, ప్రేమను వ్యక్తపరిచేవి సాంఘిక చిత్రాలు. భక్తి, ప్రేమ మనుషులను గాఢంగా ఆలోచింపజేసే భావాలు. ప్రేక్షకులలో ఏర్పడే ఈ తీవ్రతను తేలిక పరచడానికి సినిమాలలో కొన్ని హాస్య సంభాషణలను పెట్టడం 1940 నుండి మొదలైంది. హాస్య రూప కల్పనకు కొందరు నటులను పెట్టి కథలో వారికిగల సంబంధం హాస్య స్ఫోరకంగా ఉండేటట్లుచేసి నిర్మాతలు, దర్శకులు ఈ రకమైన కృషిచేశారు. సినిమా కథారచయితలు హాస్య సంభాషణలను చొప్పించడం కోసం మూలకథనే కొంత మార్చిన సందర్భాలు కూడా ఉన్నాయి. హాస్యం సాంఘిక చిత్రాలలో రాణించినట్లు పౌరాణిక చిత్రాలలో రాణింపుకురాదు. 1957లో నిర్మింపబడిన 'మాయాబజార్' చిత్రంలో దర్శకుడు కె.వి.రెడ్డి హాస్యస్ఫోరకమైన సన్నివేశాలను కల్పించి ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించారు. ప్రేక్షకులను గిలిగింతలు పెట్టే సున్నితమైన హాస్యాన్ని మేళవించి నిర్మించిన పౌరాణిక చిత్రరాజమిది. అప్పటి వరకు చిన్న చిన్న పాత్రలు పోషిస్తూ ఉండిన రమణారెడ్డి, రేలంగి వెంకట్రామయ్యలకు ఈ చిత్రం హాస్యనటులుగా మంచిపేరు సంపాదించి పెట్టింది. అప్పటికీ ఇప్పటికీ ప్రజలచేత 'శభాష్' అనిపించు కొంటున్న చిత్రం మాయాబజార్. ఈ చిత్రంలో నటించిన నటులంతా తరువాత గొప్ప గొప్ప కళాకారులయ్యారు. 1950 నుండి సినిమా నిర్మాణానికి కావలసిన హంగులన్నీ అమరడంవల్ల దక్షిణాది రాషభాషలలో తీయబడిన ప్రతిచిత్రం మద్రాసులోనే నిర్మింపబడింది. మద్రాసు

తెలుగు సినిమా చరిత్రలో 1957 నుండి 1970 వరకు గల పదమూడు సంవత్సరాల కాలాన్ని స్వర్ణయుగంగా భావించవచ్చు. కథ, సంభాషణలు, పాటలు, సంగీతం, దర్శకత్వం మొదలైన సినిమాకు సంబంధించిన అంశాలలోను, నటుల నటనా ప్రదర్శనలోను అసమానమైన ప్రతిభ కనిపించిన కాలమిది. కలకాలం గుర్తుంచుకోదగిన సినిమాలు ఈ కాలంలో నిర్మింపబడినాయి. చెంచులక్ష్మి (1958) అప్పుజేసి పప్పు కూడు (1959), అభిమానం (1960), శాంతి నివాసం, భార్యాభర్తలు (1961), రక్తసంబంధం, సిరిసంపదలు (1962), నర్తనశాల, శ్రీకృష్ణార్జునయుద్ధం (1963), గుడిగంటలు, మూగమనసులు (1964), నాదీఆడజన్మే, పాండవ వనవాసం (1965), పల్నాటియుద్ధం, శ్రీకృష్ణ పాండవీయం (1966), ఉమ్మడి కుటుంబం, రంగులరాట్నం (1967), అదృష్ట వంతులు, నిండు సంసారం (1968), ఆదర్శకుటుంబం, కథానాయకుడు (1969), కోడలు దిద్దిన కాపురం, సంబరాలరాంబాబు (1970), మొదలైన చిత్రాలు తెలుగు ప్రజల జన జీవన స్రవంతిలోని ఎత్తు పల్లాలను, ఆటుపోట్లను, సుఖదుఃఖాలను, మనసులు - మమతలను చిత్రించి ఉన్నతమైన విలువలను సంతరించుకొన్నాయి. తెలుగు సినిమా తెలుగువారి గుండెలను పొంగించిన కాలమిది. మానవ జీవితాలలోని భావాలను సజీవంగా నిలిపిన చిత్ర రాజాలివి.

**భారత కథా చిత్రాలు :** తెలుగు సినిమా చరిత్రలో టాకీ యుగం ప్రారంభమైనప్పటి నుండి అంటే 1931 నుండి నేటి వరకు అంటే 1995 వరకు కొన్ని సినిమా పత్రికలలోని[22] వివరాల ననుసరించి 2923 తెలుగు సినిమాలు నిర్మింపబడి విడుదలైనాయి. వీటిలో పౌరాణిక, సాంఘిక, జానపద, అపరాధ పరిశోధనాత్మక సినిమాలున్నాయి. మొత్తం మీద సాంఘిక చిత్రాలే ఎక్కువ. తెలుగు ప్రజలకు శ్రీకృష్ణుడంటే వల్లమాలిన అభిమానం, భక్తి ఉండడం వల్ల కృష్ణుడు పేరుమీద చాలాసినిమాలు వచ్చాయి. కృష్ణుడు కథతో భారతకథకు ఏదో రకంగా సంబంధముండి తీరుతుంది. అందువల్ల కృష్ణకథా చిత్రాలను కూడా భారత కథా చిత్రాలతో కలిపి చూడవలసి ఉంటుంది. అలాంటి సినిమాల పట్టిక ఇది.

1932 - శకుంతల

1933 - సావిత్రి (కృష్ణాఫిలింస్), సావిత్రి (ఈస్టిండియా కంపెనీ)

1935 - శ్రీకృష్ణతులాభారం, శ్రీకృష్ణలీలలు

1936 - శశిరేఖా పరిణయం, ద్రౌపదీ మాన సంరక్షణ, ద్రౌపదీ వస్త్రాప
ప్రమీలార్జునీయం, మాయాబరజార్, వీరాభిమన్యు.

1938 - కచదేవయాని, జరాసంధ

1939 - పాశుపతాస్త్రం

1942 - బభ్రువాహన

1943 - కృష్ణప్రేమ, గరుడ గర్వభంగం

1944 - భీష్మ

1955 - శ్రీకృష్ణతులాభారం

1957 - మాయాబజార్, సతీసావిత్రి

1958 - శ్రీకృష్ణగారడి, శ్రీకృష్ణమాయ

1960 - శ్రీ కృష్ణరాయబారం

1961 - శ్రీకృష్ణకుచేల, కృష్ణప్రేమ

1962 - భీష్మ

1963 - నర్తనశాల, శ్రీకృష్ణార్జున యుద్ధం

1964 - బభ్రువాహన, కర్ణ

1965 - పాండవ వనవాసం, ప్రమీలార్జునీయం, వీరాభిమన్యు

1966 - భీమాంజనేయ యుద్ధం, శకుంతల, శ్రీకృష్ణతులా
శ్రీకృష్ణపాండవీయం

1967 - శ్రీకృష్ణావతారం

1971 - శ్రీకృష్ణసత్య, శ్రీకృష్ణవిజయం

1972 - బాలభారతం

1975 - యశోదాకృష్ణ

1979 - శ్రీమద్విరాటపర్వం

1982 - ఏకలవ్య

1991 - బ్రహ్మర్షి విశ్వామిత్ర

ఈ పట్టికలోగల 50 సినిమాలలో కొన్ని మళ్ళీ మళ్ళీ నిర్మింపబడినాయి. సతీసావిత్రి నాలుగుసార్లు (1933, 1933, 1957, 1977) శకుంతల రెండు సార్లు (1936, 1965), బభ్రువాహన రెండుసార్లు (1942, 1964) నిర్మింప బడినాయి. కృష్ణుడు పేరు మీద వచ్చిన మొదటి సినిమా శ్రీకృష్ణతులాభారం (1935). ఈ పట్టికలోని సినిమాలలో కృష్ణుడు పేరుమీద వచ్చిన సినిమాల సంఖ్య 15. ఈ పదిహేను సినిమాలలో కొన్నిటిలో భారతకథ శ్రీకృష్ణుని కథ చుట్టూ అల్లుకొని ఉండడం గమనించవచ్చు. కృష్ణకుచేల లాంటి కొన్ని సినిమాలు కేవలం కృష్ణకథకే సంబంధించినవి. ఈ పట్టికలోని సినిమాలలో భారతకథా ప్రాచుర్యం కలవి 39. మళ్లీ మళ్లీ తీయబడిన సినిమాలను మినహాయిస్తే భారత కథా సినిమాలు 30గా లెక్కతేలతాయి.

సినిమాలుగా తీయబడిన భారత కథలను పరిశీలిస్తే ఇవన్నీ ఆదిసభారణ్య విరాటోద్యోగ పర్వాలలో గల కథలుగా తెలుస్తాయి. ఈ అయిదు పర్వాలలోని కథలు జనప్రియమైనవి. వీటిలోనూ ఆది, అరణ్య పర్వాలలోని కథలు అధికంగా కనిపిస్తాయి. శశిరేఖా పరిణయం, మాయా బజార్, శ్రీకృష్ణార్జునయుద్ధం, ప్రమీలార్జునీయం సినిమాలు భారత కథకు సంబంధించినవికావు. జనవ్యవహారంలో ఎలాగో ప్రచారం పొందిన ఈ కథలు తెలుగులో నాటకాలుగా రచింపబడినాయి. తమిళ భారతంలో ప్రమీలార్జునీయం కథ ఉంది. దీనికే అల్లిరాణి కథ అని కూడా పేరుంది. జానపదుల వ్యవహారంలో ప్రచారమవుతూ సినిమాలుగా మారిన కథలివి. మూలభారతంలోను, కవిత్రయ భారతంలోను గల ద్రౌపదీ మాన సంరక్షణ లేక ద్రౌపదీ వస్త్రాపహరణం, శ్రీకృష్ణరాయబారం, కర్ణ, వీరాభిమన్యు, కురుక్షేత్రంమొదలైన కథలు ఆంధ్రదేశమంతటా నాటకాలుగా ప్రదర్శింపబడి ప్రజాదరణ పొందాయి. ఆదిపర్వంలో కుమారుల అస్త్రవిద్యా ప్రదర్శనకు సంబంధించిన, కురుక్షేత్రంలో కౌరవ పాండవులకు జరిగిన యుద్ధాన్ని

వివరించిన సినిమాలు కూడా వచ్చాయి. కురుక్షేత్రం, శ్రీకృష్ణావతారం, వీరాభిమన్యు మొదలైనవి ఈ తరగతికి చెందినవి. మహాభారతంలో వ్యక్తులుగా భీష్ముడికి, కర్ణుడికి, ప్రత్యేకత ఉంది. ప్రజలలో ఈ రెండు పాత్రల మీద సానుభూతి ఉంది. అందుకే భారతానికి సంబంధించిన ప్రతి సినిమాలో ఈ రెండు పాత్రలు తప్పని సరిగా ఉంటాయి. భీష్మ, కర్ణ, దానవీరశూర కర్ణ, ఈ రెండు పాత్రల వైశిష్ట్యాన్ని తెలపడానికి నిర్మించిన సినిమాలు. భారతంలోని 18 పర్వాలలో విరాటపర్వానికి తెలుగునాట విశేషమైన ఆదరణ, ప్రచారం ఉన్నాయి. పాండవుల అజ్ఞాతవాసానికి సంబంధించినది కావడం, ఉత్తరాభిమన్యుల వివాహం రమ్యంగా వర్ణింపబడడం, కీచకుని భీముడు సంహరించడం మొదలైన రసోదంచితమైన విషయాలుండడం దీనికి కారణం. ఇది తిక్కన భారతంలోని మొదటి పర్వం. ఈ పర్వం 'నానా రసాభ్యుదయోల్లాసి'గా ఉంటుందని తిక్కనే ప్రటించాడు. విరాట పర్వ కథను చెప్పించుకొని వింటే వర్షాలు పడతాయని ఆంధ్రదేశంలోని కొన్ని పల్లెప్రాంతాల ప్రజల విశ్వాసం. ఈరకంగా కూడా ఈ పర్వానికి ప్రాచుర్యముంది. ఈ పర్వంలోని కథ ఎన్నో సినిమాలలో చిత్రింపబడింది. అయితే ఈ పర్వం పేరుతో చిత్రింపబడిన ఒకే ఒక సినిమా శ్రీమద్విరాటపర్వం (1979)

ఒక ప్రధాన కథను పరిపుష్టం చేయడానికి కొన్ని చిన్న కథలు అవసరమౌతాయి. రామాయణంలో గుహునికథ, అహల్యకథ, శబరి కథ ఇలాంటివి. భారతంలో కూడా ఇలాంటి కథలుండడానికి అవకాశమెక్కువ. ఆదిపర్వంలోగల కచదేవయానుల కథ, ఏకలవ్యుని కథ, అరణ్య పర్వంలోని సావిత్రీ సత్యవంతుల కథ సినిమాలుగా చిత్రింపబడినాయి. వీటిలో ఏకలవ్య, సావిత్రి కథలతో నిర్మించిన సినిమాలు బాగా ప్రసిద్ధి పొందాయి.

## సూచికలు

1. యది హరిస్మరణే సరసం మనో
   యది విలాస కలాసు కుతూహలమ్
   మధుర కోమల కాంత పదావలీమ్
   శృణు తదా జయదేవ సరస్వతీమ్.

2. లక్ష్మీకాంతం, పింగళి, సాహిత్య శిల్పసమీక్ష, తిరుపతి 1966, పుట 15

3. జనన మరణాదులైన సంసార దురిత
ములకు నగపడ కుండగ దొలగు తెరవు
గను వెలుంగు నీకిచ్చితి ననిన లేచి
నిలిచి సంతోష మెదనిండ నెలవుకొనగ. విరాటపర్వం 1 - 24

4. పోతన భాగవతం - పీఠికలో మొదటి పద్యం

5. "వేద వేద్య పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేత సాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"
వాల్మీకి రామాయణం, బాలకాండ.

6. శ్రీమదాంధ్ర మహాభారతం - ఆది పర్వం 1 - 126

7. రామగోపాలరెడ్డి. ఎన్ - ఆంధ్ర శాసనాలు - సాహిత్యంలో ప్రతిఫలించే దేవదాసీ వ్యవస్థ' శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి పి.హెచ్.డి పొందిన సిద్ధాంత గ్రంథం. అముద్రితం పుట - 128.

8. తెలుగు నాటక వికాసం. పుట - 6

9. వివరాలకు చూడు. సంస్కృత సాహిత్య చరిత్ర పుట - 341

10. అదే పుట - 345

11. తెలుగు నాటక వికాసం పుట - 90

12. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి. పుట - 211

13. ఆదిపర్వం 2 - 27

14. మధురా విజయం 1 - 15

15. నృసింహ పురాణం 3 - 78
"సురుచిర తారకా కుసుమశోభి నభోంగణ భూమిఁగాలమ
న్గరువపు సూత్రధారి జతనంబున దిక్పతికోటి ముందిటం
సరసముగా నటింపగ నిశాపతికెత్తిన క్రొత్తతాఁపుఁబెం
దెర యనవొప్పె సాంధ్య నవదీధితి పశ్చిమదిక్తటంబునన్"

16. తెలుగు నాటక వికాసం పుట - 104
17. T.T.D Inscriptions Vol II No. 10
18. Madras Epigraphical Report 1916/556
19. తెలుగు నాటక వికాసం పుట 212
20. అదే. పుట - 341
21. తెలుగు సినిమాపాట, పుట - 20
22. స్వాతి సచిత్ర మాసపత్రిక 1996 ఏప్రెల్ నెలలో ఇచ్చిన అను
'వందేళ్ల సినిమా చరిత్ర'



## భారతేతి వృత్త సినిమాలు - కథా సంవిధానం

భారత కథలు సినిమాలుగా చిత్రింపబడడానికి ప్రధాన కారణం ఆ కథలపై తెలుగు ప్రజలకు గల మక్కువే. తెలుగు భాషలో వెలసిన కవిత్రయ భారతం వ్యాస భారతంలోని ఏ అంశమూ జారిపోకుండా ప్రతి అంశాన్ని అనువదించిన సంపూర్ణ గ్రంథం. తెలుగు భారతంలో మూలాతి క్రమమైన మార్పులు చాలా తక్కువ. ఉన్న స్వల్ప మార్పులు మూలకథను మెరుగు పెట్టడానికి ఉద్దేశించినవేగాని వ్యాస భారత కథలకు దూరంగా వెళ్లడానికికాదు. దక్షిణ దేశీయ భాషలైన తమిళ కన్నడ మలయాళ భాషలలో కూడా భారతం అనువదింపబడింది. కవిత్రయ భారతంతో పోల్చి చూచినపుడు ఇవి మూలానికి కొంచెం దూరంగానే కనిపిస్తాయి. పైగా వ్యాసభారత కథనంతటినీ అనువదించినట్లు కనపడదు. ఆంధ్రదేశంలో భారత కథకున్న ప్రచారం ఇతర పౌరాణికగాథలకు లేదు. రామాయణ కథన్నా, భాగవతకథలన్నా తెలుగు ప్రజలు ఎక్కువగా ఇష్టపడతారు. అయినా ఎందుకో భారతానికే ప్రచారమెక్కువ. తమిళ దేశంలో కంబరామాయణానికున్న గౌరవం, ప్రచారం భారతానికి లేదు. తమిళ భారత విమర్శకులు దీనికెన్నో కారణాలు చూపిస్తారు. రామాయణ భారతాల మీద తమిళుల అభిప్రాయం ఇలా ఉంది. "ఆర్యుల ప్రధాన గ్రంథమైన భారతంలో స్త్రీలపాత్ర చక్కగా పోషింపబడక నీచముగా చిత్రింపబడినది. తమిళుడు పరస్త్రీనితాకడు. అన్న భార్యను సభకీడ్చి వస్త్రాపహరణము చేయడు. తమిళుడైన రావణుడు సీతాదేవిని నేలతో పెల్లగించుకొని యెత్తుకపోయెనేగాని చేతితో స్పృశింపలేదు. తన్ను పెండ్లాడమని ప్రార్థించెనేగాని బలవంతపెట్టలేదు. ఇట్టి సదాచార సంపన్నుని ఆర్యులు రక్కసుడని నీచముగా వర్ణించిరి. భారతమున ఆర్యుడైన దుర్యోధన మహారాజు అన్నభార్యను నిండు సభకీడ్చి కట్టుబట్ట లొలిపించగా గురువులు ఆచార నిష్ఠాపరులైన భీష్మద్రోణులు కనులప్పగించి చూచుచుండిరి. ఇది రాక్షస ధర్మమా? ఆర్య ధర్మమా"?[1] తమిళులు ఇలాంటి అభిప్రాయాలు కలవారైనా భారత కథలను పూర్తిగా నిరాదరించలేదు. ద్రౌపదీ దేవికి గుడులు కట్టి ఉత్సవాలు చేసినవారు వీరే. ద్రౌపది ఆరాధన వీరి తరువాతనే ఇతర ప్రాంతాలకు వ్యాపించింది.

కల్పించాడో ఆలోచిస్తారు. అందులోని లోటుపాట్లను సహృదయంతో అర్థం చేసుకొంటారు. తెలుగు దేశంలోని పండితులలోనేగాక పామరులలోను ఈ లక్షణముంది. పాత్రల స్వభావాన్ని గుర్తెరిగి అపాత్రలపై సానుభూతి ప్రకటించి కథాంశాలలో ఐక్యం కావడం తెలుగు ప్రజల అలవాటు. ఈ కారణం వల్ల తెలుగుదేశంలో పురాణకథలకు అస్తిత్వముంది. పురాణకథలను పౌరాణికుల ద్వారా హరిదాసుల ద్వారా తెలుగు ప్రజలు వింటూనే ఉన్నారు. భారతకథలు హరిదాసుల చేతులలో వింత వింత కల్పనలకు లోనై తెలుగువారికి నిత్యనూతనంగా వినిపిస్తూనే ఉన్నాయి. భారత కథా సినిమాలను ప్రేక్షకులు సాంకేతిక విలువల కోసమో, తమ అభిమాన నటీ నటుల నటనాకౌశలం దర్శించడానికో లేక దర్శకుని ప్రతిభను పరీక్షించడానికో చూస్తున్నారని, నిజానికి ఈనాటి ప్రేక్షకులకు భారతకథా చిత్రాలపై లేక ఇతర పౌరాణిక చిత్రాలపై అభిరుచి లేదని కొందరు చెపుతారు. ఇది అంగీకార యోగ్యమైన మాటకాదు. ప్రేక్షకులు భారత కథల యెడల గల ప్రేమాభిమానాలతోనే భారతకథా చిత్రాలను చూస్తున్నారు.

**భారత కథలు - స్వభావం :** తెలుగు ప్రజలనంతగా ప్రభావితం చేసిన భారతం ఎలాంటిదో, దాని మహత్వమేమిటో ముందు గుర్తించాలి. ఇది భారత కథ, స్వభావాన్ని అంచనావేయడానికి పనికొస్తుంది.

"భ్రాతి సర్వేషు శాస్త్రేషు రతిః సర్వేషు జంతుషు

తారణం సర్వలోకేషు తేన భారత ముచ్యతే" అని 'భారత' శబ్దానికి అర్థనిర్ణయం చేయబడింది. సర్వశాస్త్రాలలో ప్రతి ఫలించేది, సర్వ ప్రాణులలో స్పందన కల్గించేది. సర్వలోకాలను తరింపజేసేది భారతం. 'భా' అంటే ప్రకాశరూపమైన సత్త్వగుణం, 'ర' అంటే రజోగుణం, 'త' అంటే తమోగుణం. సత్వరజస్తమో గుణాల కలయిక వల్ల సృష్టి ఏర్పడింది. సృష్టిలోని ప్రాణుల మనోధర్మాలను వివరించడంవల్ల దీనికి భారతమని పేరు ఏర్పడిందని పండితుల అభిప్రాయం. మానవ జీవితంలో ఎదురయ్యే ధర్మాధర్మాల సంఘర్షణలో ధర్మమే జయిస్తుందని కథద్వారా నిరూపించడంవల్ల దీనికి 'జయము' అని వ్యాసుడు పేరు పెట్టాడు. నాలుగు వేదాల సారం ఇందులో వుండడం చేత దీనికి పంచమవేదం అని మరొక పేరు. జరిగిన కథను వివరించడం వల్ల ఇది ఇతిహాస లక్షణాన్ని పొందింది. ప్రాచీన విషయాలను వర్ణించడంచేత

పురాణం అయింది. భారతం గొప్ప తనాన్ని వ్యాసుడు బ్రహ్మతో ఇలా చెప్పినట్లు ఆదిపర్వంలో వుంది.

"బ్రహ్మన్! వేద రహస్యంచ యచ్చాన్యత్ స్థాపితం మయా
సాంగోపనిషదాం చైవ వేదానాం విస్తర క్రియా
ఇతిహాస పురాణా నామున్మేషం నిర్మితంచ యత్
భూతం భవ్యం భవిష్యంచ త్రివిధకాల సంజ్ఞితమ్" [2]

వేదవేదాంగాలలో సూత్రప్రాయంగా చెప్పబడిన విషయాలు భారతంలో విస్తరించబడినాయి. భూతకాలికమైన కథలు వర్తమాన భవిష్యత్తులకు అన్వయించి చెప్పబడినాయి. అందువల్ల భారతానికింత ప్రశస్తి ఏర్పడింది.

యుగరీత్యా భారత కథ ద్వాపర యుగానికి సంబంధించినది. శ్రీకృష్ణుని నిర్యాణంతో ద్వాపర యుగం పూర్తయి కలియుగం ప్రారంభమైనట్లు చెప్పబడు తున్నది. శ్రీకృష్ణనిర్యాణం మౌసల పర్వంలో వర్ణితమైంది. భారతంలో మౌసల పర్వం తర్వాత మహాప్రస్థానీక, స్వర్గారోహణ పర్వాలున్నాయి. పరిక్షిత్తుకు రాజ్యాభిషేకం, రాజ్యాన్ని వదలి పాండవులు స్వర్గానికి వెళ్లడం మొదలైన కథా విశేషాలు ఈ పర్వాలలో ఉన్నాయి. ఈ రెండు పర్వాలలోని కథాంశాలు కలియుగానికి సంబంధించినవి. దీనిని బట్టి భారత కథ ద్వాపర, కలియుగాలకు సంబంధించినదిగా తెలుస్తుంది. ఈ దృష్టితోనే వ్యాసుడు అరణ్య పర్వంలో కలియుగ ధర్మాన్ని వివరించాడు. ఎర్రన ఈ భాగాన్ని చాల వివరంగా తెనిగించాడు. భారతంలో ఈ దృష్టి ఉండడంచేత భారత కథ ప్రజా జీవితానికి అతి సన్నిహితమైంది. కలియుగ మానవుల స్వభావం భారత పాత్రలలో కన్పిస్తుంది. భారత పాత్రల స్వభావం నేటి సాంఘిక జీవితంలో ప్రతిఫలిస్తున్నదని చెప్పినా హేతుబద్ధంగానే ఉంటుంది. భారతం పురాణంగా చెప్పిన పండితుడికి తన జీవితం అందులో కనిపిస్తుంది. వినిన శ్రోతలకు భారత కథ తమ జీవిత వ్యాఖ్యానం అనిపిస్తుంది. భారత కథకున్న ఈ లక్షణం దానికి విశ్వజనీనతను చేకూర్చింది. భారత కథ ధర్మరాజు పట్టాభిషేకంతో ముగుస్తుంది. ఇది సౌప్తిక పర్వంలో జరుగుతుంది. వ్యాసుని కథా ప్రణాళిక ప్రకారం కావ్య నాయకుడైన ధర్మరాజుకు కావ్య ఫలితం అందడంతో కథ అయిపోవాలి. కాని అయిపోలేదు. ధర్మరాజు పట్టాభిషేకం తరువాత ఎనిమిది పర్వాల కథ ఉంది. ఈ కథంతా ప్రాపంచిక వాసనలకు దూరం కాలేని మానవులు జీవిత ధ్యేయాన్ని ఎలా వెతుక్కోవాలో చెప్పడానికి

ఉద్దేశింపబడింది. జయించిన పాండవులు కూడా అందరిని పోగొట్టుకొని అశాంతినే పొందారు. ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి మొదలైన వారు మానవ జీవితంలో అతిస్వల్పమైన పొరపాట్లు కలుగజేసే నిరాశామయమైన జీవితానికి ప్రతినిధులుగా కన్పిస్తారు. భారత కథను అప్పటి వరకు ఆడించిన సూత్రధారి కృష్ణుడు కూడా మౌసల పర్వంలో బోయవాడి నిశిత నారాచానికి బలియై ఇహాన్ని వదిలి పరమ పథం చేరుకున్నాడు. శ్రీకృష్ణనిర్యాణం కూడా విధి అనుల్లంఘనీయమనే కర్మ సిద్ధాంతాన్నే వ్యాఖ్యానించింది.

భారతంలో చిత్రితంకాని మానవ స్వభావం కనిపించదు. సుగుణాలకు, దుర్గుణాలకు ప్రతినిధులైన పాత్రలు ఇందులో ఉన్నాయి. దుష్ట చతుష్టయం లాంటి పాత్రలు మోసం, ద్వేషం, కుళ్లు, అసూయ, అనే గుణాలకు ప్రతీకలు. కురురాజు సభలో పెద్దల సమక్షంలో ద్రౌపది పొందిన పరాభవం ఈనాటి సంఘంలో స్త్రీకి ఎదురౌతున్నది. పెద్దలకు తెలియకుండా గర్భవతులైన స్త్రీలు కుంతిలాగా సమస్యల పాలవుతున్నారు. నిస్వార్థంగా జీవితం సాగించిన కర్ణుడు ఎన్నో శాపనార్థాలకు గురియై కుల సంఘర్షణను ఎదుర్కోవలసి వచ్చింది. భారతకాలం నుండి దేశంలో కుల వ్యత్యాసాలు రగులుతూనే ఉన్నాయి. నిస్వార్థజీవి ఏమీ సాధించలేక చివరికి అధోగతి పాలవుతాడనడానికి కర్ణుడు మంచి ఉదాహరణ. జూదం సప్తవ్యసనాల్లో ఒకటి. జూదమాడడం పాపంకూడ. తెలిసికూడా ధర్మరాజు జూదమాడాడు. ఫలితంగా సర్వస్వాన్ని పోగొట్టుకొని పడరాని కష్టాలు పడినాడు. ఆనాటి అక్షక్రీడ రకరకాల రూపాల్లో ఇప్పటికీ ఉంది. జూదం లాంటి ఆటలలో జేబులు ఖాళీచేసుకొని ఇంటికెళ్లి భార్యదగ్గర చీవాట్లుతిని మరుసటి రోజున పూటగడపడానికి కష్టపడే మగవాళ్లు ఎందరో కన్పిస్తారు.

ఇలా జీవితంలోని వివిధ కోణాలను ప్రతి పాదించిన భారతగ్రంథం అందులోని పాత్రలను అర్థంచేసుకొని మంచి చెడులను గ్రహించి మంచిగానే ఎందుకు ప్రవర్తించాలో మానవులకు చెప్పే ప్రయత్నం చేసింది. మంచి ప్రవర్తనను అలవరచుకొని చెడ్డ తలంపులకు లొంగకుండా తన అభ్యుదయంతో పాటు ఇతరుల అభ్యుదయాన్ని కాంక్షిస్తూ బ్రతికినపుడు కలిగే ఆనందం అపరిమితమని భారతం ప్రకటిస్తున్నది. భారతకథను బాగా అర్థంచేసుకొన్న ఒక విమర్శకుని మాటలివి. "మహాభారతం మానవస్వార్థం దాని అంగాలైన అసూయాద్వేషాలు అమితంగా పెరిగి, పంపకం ఒక విషమ సమస్యగామారి,

విలయకారకమైన మహా సంగ్రామంగా పరిణమించిన కురుపాండవ కుటుంబగాథ. మహా భారత కథకు వాస్తవికత ఓ పెద్దబలం. అద్భుతమైన ఓ అలంకారం. ఈ కథను ఆధారం చేసుకొని వ్యాసమహర్షి మానవ స్వభావంలోని శిఖరాలను, లోయలను మలుపులను మనోహరంగా చిత్రించాడు. మానవాళికి మహోన్నత సందేశాన్ని అందించాడు"[3]

మానవ జీవితాన్ని ఇంత నిశితంగా చిత్రించిన కథ మరొకటి లేదు. రామాయణ కథలోని ఆదర్శం భారతకథలో అంతగా కనిపించదు. రామాయణం కాలం నాటి మానవత్వపు విలువలు భారత కాలంలో తమ స్వభావాన్ని మార్చుకొని కనిపిస్తాయి. భారత పాత్రల స్వభావంలోని వైవిధ్యం, జటిలత్వం రామాయణ పాత్రలలో తక్కువ. దీనికి కారణం కాలగమనాన్ననుసరించి మానవ స్వభావంలో, మానవ జీవితంలో అపరి హార్యమైన మార్పులు కలగడం. భారతకథ మనకథ. అంటే ఈనాటి మానవుల కథ. భారత కథా చిత్రాలు మనకథను మనం స్థిమితంగా కూర్చొని నెమరు వేసుకున్నట్లు ఉంటాయి కనుకనే ఎన్ని భారతకథా చిత్రాలు వచ్చినా తెలుగు ప్రేక్షకులు విసుగు లేకుండా చూస్తారు. అందు వల్లనే ఇప్పటివరకు భారత కథకు సంబంధించిన ముప్పై అంశాలమీద సినిమాలు వచ్చాయి. ఈ ముప్పై సినిమాలలో కథ ననుసరించి పునరుక్తులవలె ఒక సినిమాలోని కథాంశాలు మరొక సినిమాలో కనిపిస్తాయి. ఇది అపరిహార్యం.

**భారతకథ - సినిమాలు :** ఇప్పటి వరకు భారత కథల మీద చిత్రింపబడిన సినిమాలను నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు.

1. **భారత వీరుల శౌర్య పరాక్రమాలకు సంబంధించినవి :** నర్తనశాల, శ్రీకృష్ణార్జున యుద్ధం, ప్రమీలార్జునీయం, వీరాభిమన్యు ఇలాంటి చిత్రాలు. ఈ చిత్రాలలో వీరుల పరాక్రమాలతో పాటు వారి వివాహ వృత్తాంతాలు కూడా ఉన్నాయి. శ్రీకృష్ణార్జున యుద్ధంలో సుభద్రార్జునుల వివాహం, ప్రమిలార్జునీయంలో ప్రమీలార్జునుల వివాహం, వీరాభిమన్యులో ఉత్తరాభిమన్యుల వివాహం చిత్రింపబడినాయి.

2. **కొందరు వీరుల వ్యక్తిగత జీవితాలను చిత్రించినవి :** భీష్మ, కర్ణ,

కథాంశాలన్నీ చూపబడినాయి.

3. **శ్రీకృష్ణుడికి పాండవులకు గల బంధుత్వాన్ని చిత్రించినవి :** శ్రీకృష్ణ పాండవీయం, శ్రీకృష్ణావతారం మొదలైనవి ఇలాంటివి. యాదవ పాండవ వంశాలకు బంధుత్వం కుంతి, సుభద్రలవల్ల ఏర్పడింది. ఈ సినిమాలలో ఈ అంశాలను విపులంగా చూపడం జరిగింది.

4. **భారత కథాంతర్భాగాలుగా ఉంటూ ప్రధాన కథ కెలాంటి సంబంధం లేనివి :** సతీసావిత్రి, ఏకలవ్య ఇలాంటి చిత్రాలు. సావిత్రికథ అరణ్య పర్వంలోను, ఏకలవ్యుడి కథ ఆదిపర్వంలోను ఉన్నాయి. ఈ ఇరువురి కథలు ప్రధాన కథాంశాన్ని పోషిస్తాయి. ఏకలవ్యుడి కథలో కౌరవ పాండవ కుమారుల విద్యవిషయాలు, ద్రోణుని గురుత్వం ప్రస్తావించ బడినాయి.

కథా ప్రాధాన్యాన్ని బట్టి భారతకథా చిత్రాలను ఈ రకంగా విభజించడానికి వీలవుతుందేగాని కథలు ప్రతి పాదించే అంతరార్థాలను దృష్టిలో పెట్టుకొంటే భారత కథలపై వచ్చిన సినిమాలను విభజించడానికి వీలుగాదు. ప్రతికథలో శ్రీకృష్ణుని అవతార ప్రయోజనం నిరూపించబడింది. 'కాలమూలంబు సర్వంబు' అన్న సిద్ధాంతానికి భారత కథ వ్యాఖ్యాన ప్రాయంగా కన్పిస్తుంది.

"యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదా ఒత్మానం సృజామ్యహమ్
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"[4]

అనే గీతోక్తులు శ్రీకృష్ణావతార ప్రయోజనాన్ని వివరిస్తాయి. భారత కథలకు శ్రీకృష్ణుడు అంతరాత్మ. భారత పాత్రలన్నీ కర్మాను సారం ప్రవర్తిస్తాయి. శ్రీకృష్ణుడు సాక్షీ భూతుడుగా ఉంటాడు. కర్మననుసరించి ఫలితముంటుందని భారత కథద్వారా నిరూపితమవుతుంది. భారత పాత్రలలో కొందరికి మాత్రం శ్రీకృష్ణుడు అవతార పురుషుడుగా కనిపిస్తాడు. కృష్ణార్జునులు నరనారాయణులన్న

విషయం అర్జునునికి తెలియదు. కృష్ణునికి తెలుసు. అయినా కృష్ణుడు సాధారణ వ్యక్తిగానే ప్రవర్తిస్తుంటాడు. "సామాన్యుల కోసం భగవంతుడు అందరూ వ్యవహరించినట్లే ప్రవర్తించడం, అడుగడుగునా మహిమ చూపక పోవడం ప్రసిద్ధమే. అవసరాన్ని బట్టి భగవంతుడు ప్రవర్తిస్తాడనేది అవతారతత్త్వం"[5] ఈదృష్టిలో చూస్తే భారతంలోని కథలన్నీ కృష్ణుని చుట్టూ తిరిగినట్లనిపిస్తుంది. అందువల్ల భారత కథా చిత్రాలన్నిటిలో కృష్ణుడు కనిపిస్తాడు. భారతంలో నరనారాయణులతత్వం కొన్ని సందర్భాలలో ప్రస్తావించబడింది. ఈ అంశాన్ని నన్నయ భారతంలో కూడా ప్రస్తావించాడు.' కృష్ణార్జునోత్తమ నానాగుణ కీర్త నార్థ ఫల'మే భారతేతిహాస ప్రయోజనమని నన్నయ భావించాడు.[6] ఉత్తములైన కృష్ణార్జునుల గుణ కీర్తనం అనంత ఫల దాయకం. అందుకే భారత కథలో లాగ ప్రతి సినిమాలో శ్రీకృష్ణార్జునుల జంటగా చూపించడం జరిగింది. తెలుగు ప్రేక్షకులకు ఇందులోని అంతరార్థం తెలియక పోయినప్పటికి శ్రీకృష్ణార్జునులు జంటగానే ఉంటారని తెలుసు. శ్రీకృష్ణుడికి సంబంధించిన సినిమాలో అర్జునుడు తప్పని సరిగా ఉంటాడని కూడా తెలుసు.

భారత కథా చిత్రాలు ముప్పై వచ్చాయి. ఈ ముప్పైలో సమాన కథాంశాలున్నవి ఎక్కువగా ఉండడం వల్ల ప్రతి సినిమా కథను పరిశీలించ వలసిన అవసరం లేదు. కథా ప్రాధాన్యాన్ని బట్టి కొన్ని సినిమా కథలను పరిశీలిస్తే సరిపోతుంది. ఒకే కథ రెండు మూడు సార్లు సినిమాగా రూపొంది ఉండవచ్చు. అలాంటి సినిమాలలో కాలక్రమాన్ననుసరించి చివర తీయబడిన సినిమాను కథా దృష్టితో పరిశీలించడం అవసరం. కౌరవ సభలో ద్రౌపదిని పరాభవించిన ఘటాన్ని ఆధారం చేసుకొని 1936 లో ద్రౌపదీ మాన సంరక్షణ, ద్రౌపదీ వస్త్రాపహరణం అనే రెండు సినిమాలున్నాయి. ఆ తరువాత వచ్చిన కొన్ని సినిమాలలో కూడా ఈ ఘట్టం చిత్రింప బడింది. 1965 లో పాండవ వనవాసం పేరుతో వచ్చిన గొప్ప చిత్రంలో ద్రౌపది వస్త్రాపహరణమే ప్రధాన ఘట్టం. ఈ చిత్రంలో తెలుగు సినీరంగానికి చెందిన ప్రముఖ నటీ నటులంతా నటించారు. బభ్రువాహన, ప్రమీలార్జునీయం వంటి సినిమాలు కవిత్రయ భారత కథతో ఎక్కువ సంబంధం లేనివి. అందువల్ల ఈ సినిమాల కథలు పరిశీలనార్హాలు. జానపదులలో ప్రచారం పొందిన కథలలోని అనేకాంశాలు

**మాయాబజార్ :** విజయావారు ఈ చిత్రాన్ని 1957 లో నిర్మించారు. ఈ చిత్ర దర్శకుడు కె.వి.రెడ్డి. పింగళి నాగేంద్రరావు పాటలు రాశాడు. సంగీత దర్శకత్వం నెరిపినవారు ఘంటసాల వేంకటేశ్వరరావు, సాలూరు రాజేశ్వరరావు గార్లు. ఈ కథను 1936 లో 'మాయాబజార్ అనే శశిరేఖాపరిణయం' అనే పేరుతో సినిమాగా తీశారు. ఈ చిత్రంలో లక్ష్మణ స్వామి, శాంతకుమారి ప్రధాన పాత్ర ధారులు. ఘటోత్కచుడుగా రామిరెడ్డి నటించారు. ఈ చిత్రంలో శశిరేఖగా శాంతకుమారి గొప్పగా నటించారని పేరుంది. ఆ తరువాత వచ్చిన విజయా వారిచిత్రం ఈ సినిమా కథనే అనుసరించినా అందులోని లోటుపాట్లను సవరించు కొని అప్పటికి బాగా వృద్ధి పొందిన సాంకేతిక సహాయాన్ని వాడుకోవడం వల్ల బాగా రాణించింది. నటీ నటుల నటనాకౌశలం, పింగళివారి సాహిత్యం, ఘంటసాల సంగీతం ఈ చిత్రానికి ప్రాణం పోశాయి.

'మాయాబజార్' ఇప్పుడొస్తున్న చౌకబారు చిత్రాల వంటిదికాదు. అదొక దృశ్యకావ్యం. ప్రేక్షకులను మైమరపించి, వారిని కథాకాలానికి తీసుకొని వెళ్లి ద్వారకలోను, హస్తినాపురంలోను విహరింపజేసిన గొప్ప చిత్రరాజమిది. కావ్యంలోవలె, నాటకంలోవలె ఈ చిత్రంలో నాంది, ప్రస్తావన, భరతవాక్యం, ఫలశ్రుతి ఉన్నాయి. 'వర్ధిల్లవమ్మా! వర్ధిల్లవమ్మా!! చిన్నారి శశిరేఖ వర్ధిల్లవమ్మా!!!' అనే పాటతో చిత్రం ప్రారంభమవుతుంది. పాండవుల అరణ్యావాసకాలమిది. సుభద్రాభిమన్యులు ద్వారకలోనే ఉంటారు. శశిరేఖాభిమన్యులకు చిన్ననాటి నుండి చెలిమి. రేవతీ బలరాములు శశిరేఖను అభిమన్యునికే ఇచ్చి పెళ్లి చేస్తామని సుభద్రకు మాట ఇచ్చి ఉంటారు. ఆకారణంవల్ల శశిరేఖాభిమన్యులను కలసి ఆడుకోవడానికి వీలుకలిగిస్తారు. చిన్ననాటి ఆటలో బావమరదుల సంబంధం బాగా కనిపిస్తుంది. అభిమన్యుడు ధనుర్విద్యలో ప్రవీణుడనడానికి ఒకమ్మాయి తలపై పండుపెట్టి తలకు దెబ్బ తగలకుండా అభిమన్యునిచేత బాణంతో కొట్టిస్తారు. తరువాత చెలికత్తెలు శశిరేఖకు జోస్యం చెపుతారు. "అల్లిబిల్లీ అమ్మాయికి చల చల్లని జోస్యం చెపుతాము చక చక్కని జోస్యము చెపుతాము" అంటూ 'నూతన విద్యల ప్రవీణుడే బల్ చక్కని చతురుడే నీబావ' అంటారు. ఈ సన్నివేశం శశిరేఖాభిమన్యులను ఇంకా దగ్గరయ్యేటట్లు చేస్తుంది.

పాండవులు రాజసూయయాగం చేస్తారు. యాదవులంతా యాగానికి వెళ్లివస్తారు. ద్వారకలో సాత్యకి పాండవుల వైభవాన్ని మయసభ గొప్పతనాన్ని

వర్ణిస్తాడు. ఈ సందర్భంలో 'ప్రియదర్శిని' అనే పెటికను అక్కడపెట్టి దానిమూత తెరచి చూచినవారికి వారి మనస్తత్వానికి అనుగుణమైన, వారికిష్టమైన దృశ్యం కనిపిస్తుందని కృష్ణుడు చెపుతాడు. రేవతి తెరచి చూస్తుంది. ఆమెకు మణులు, బంగారం కనిపిస్తాయి. శశిరేఖ తెరచి చూస్తుంది. ఆమెకు 'నీవేనా ననుతలచినది' అంటూ అభిమన్యుడు కనిపిస్తాడు. దుర్యోధనుడు శకుని సలహాననుసరించి బలరాముని హస్తినాపురానికి ఆహ్వానించి సకల మర్యాదలతో సంతృప్తి కలిగేటట్లు చేస్తాడు. సంతృప్తి పడిన బలరాముడు దుర్యోధనుని మెచ్చుకొని ఏమైనా కోరుకోమంటాడు. అప్పటికే శకుని ఆలోచించిన పథకం ప్రకారం పాండవులపై లేనిపోనివి కల్పించి చెప్పి బలరామునికి పాండవులపై కోపం కలిగిస్తాడు. బలరామునితో వియ్యమందాలని ఉందని, తన కుమారుడైన లక్ష్మణ కుమారునికి శశిరేఖనిచ్చి వివాహం జరిపించమని కోరుతాడు. బలరాముడు అంగీకరిస్తాడు. అప్పటి నుండి లక్ష్మణ కుమారునికి శకుని పురి ఎక్కించి అభిమన్యుని కోరుకుంటున్న శశిరేఖను ఎలాగైనా పెండ్లాడాలని అతనిలో పట్టుదల పెంచుతాడు. అంతకు ముందు 'అనాగరిక యాదవ కన్యను నేను వరింతునా'? అని మొండికి పడిన లక్ష్మణకుమారుడు శశిరేఖను తానే పెండ్లాడతానని అభిమన్యుని వరించడానికి కన్యలు దొరకకుండా చేస్తానని బీరాలు పలుకుతాడు.

బలరాముడు ద్వారకకు వెళ్లిన తరువాత ఆయన చెప్పిన మాటలతో అతఃపుర వాతావరణం మారిపోయింది. తన కుమార్తెను లక్ష్మణ కుమారునికి ఇస్తానని దుర్యోధనునికి మాట ఇచ్చి వచ్చినట్లుగా చెప్పగానే సుభద్ర ఎంతో బాధపడుతుంది. శశిరేఖ తనకోడలని చిన్ననాటి నుండి అనుకొంటున్న విషయం జ్ఞాపకం చేస్తుంది. అయినా ధనం, దర్పం, వినయం, విధేయతగల సుయోధనునితోనే సంబంధం కలుపుకోడానికి నిశ్చయించుకున్నానని బలరాముడు చెప్పగానే రేవతి కూడా అందుకు సమ్మతిస్తుంది. ఆ సమయంలో శ్రీకృష్ణుడు కూడా చేయగలిగింది లేక సుభద్రను ఓదార్చి ఎలాగైనా శశిరేఖాభిమన్యుల వివాహం జరుగుతుందని చెపుతాడు. ఈ విషయం తెలిసిన శశిరేఖ తాను లక్ష్మణకుమారుని చేసుకోనంటుంది. అభిమన్యుడు మండిపడి లక్ష్మణకుమారుడు శశిరేఖనెలా చేసుకొంటాడో చూస్తానని బెదిరిస్తాడు. వేడెక్కిన ఈ వాతావరణాన్ని చల్లబరచడానికి కృష్ణుడు సుభద్రాభిమన్యులను ఘటోత్కచుని ఆశ్రమంలో వదలిరమ్మని దారకుని పంపిస్తాడు.

దారకుడు వీళ్లిద్దరిని రథంలో తీసుకొని ఘటోత్కచుని ఆశ్రమమున్న ద్వైతవనంలో ప్రవేశిస్తాడు. అప్పటికే ఘటోత్కచుడు తన తండ్రి భీమసేనునికి, ఆయనసోదరులకు అరణ్యావాసం కల్పించిన పాండవులను చంపడానికి సేనను సిద్ధం చేస్తూవుంటాడు. ఆ సమయంలో సుభద్రాభిమన్యుల రథసవ్వడిని విని శత్రువులుగా భావించి వారిని వారి రథాన్ని నాశనం చేసి రమ్మని కుడ్యాసురుని పంపిస్తాడు. కుడ్యాసురుడు తన మాయతో రథం చుట్టూ మంటలను సృష్టిస్తాడు. అభిమన్యుడు తన బాణంతో వర్షం తెప్పించి ఆ మంటలను ఆర్పుతాడు. తరువాత కుడ్యాసురుడు రథం సాగడానికి వీలుగాకుండా దారిని గోడతో బంధిస్తాడు. అర్జునుడు బాణంతో గోడను కూల్చగా కుడ్యాసురుడు వెళ్లి ఘటోత్కచునితో మొరపెట్టుకొంటాడు. ఘటోత్కచుడే స్వయంగా వచ్చి మాయా యుద్ధంచేసి అభిమన్యుని మూర్ఛిల్లజేస్తాడు. ఆవిపత్కర పరిస్థితిలో సుభద్ర ధనస్సు అందుకొని 'నేను వీరుడైన అర్జునుని భార్యనే అయితే అసురమాయను ఈ బాణం ఛేదించుగాక' అనుకొంటూ బాణం వేయబోగా ఘటోత్కచుడు ఆమెను తన పినతండ్రి అర్జునుని ఇల్లాలు సుభద్రగా గుర్తించి దగ్గరకు వచ్చి మన్నించ మంటాడు. అభిమన్యుని సోదరుడుగా ఆదరించి ఇద్దరిని తమ ఆశ్రమానికి తీసుకొని వెళ్లి హిడంబికి పరిచయం చేస్తాడు. శశిరేఖను ఆమె తల్లిదండ్రులు దుర్యోధన పుత్రుడైన లక్ష్మణ కుమారునికిచ్చి వివాహం చేయ సంకల్పించారని అభిమన్యుడు చెప్పగా విని ఘటోత్కచుడు కౌరవులను నాశనంచేసి శశిరేఖాభిమన్యుల వివాహం చేస్తానంటాడు. కౌరవులను చంపుతామని భీమసేనాదులు ప్రతిజ్ఞ చేశారని వారికోసమైనా కౌరవులను చంపకుండా ఉంచాలని హిడంబి చెపుతుంది. మాయతో ద్వారకచేరి శశిరేఖను తీసుకొని వచ్చి ఆశ్రమంలో శశిరేఖాభిమన్యులకు వివాహం చేస్తానని, తాను మాయా శశిరేఖగా మారి లక్ష్మణకుమారుని పెండ్లి కుమార్తెగా కౌరవులను ఆటపట్టిస్తానని ఘటోత్కచుడు చెపుతాడు. హిడంబి ద్వారకలో శ్రీకృష్ణుడున్నాడని ఏపనిచేసినా ఆయనతో సంప్రదించి ఆయన సలహామేరకు చేయమని సలహాయిస్తుంది. ఘటోత్కచుడు ద్వారకానగరానికి వెళతాడు.

ఆనాటి రాత్రి ఘటోత్కచుడు శ్రీకృష్ణుని కలుసుకొని ఆయన ఆశీర్వాదంతో అంతఃపురంలో తనగదిలో నిద్రిస్తున్న శశిరేఖను మంచంతో సహా ఎత్తుకొని గగన మార్గంలో ఆశ్రమంచేరతాడు. అక్కడ శశిరేఖ మేలుకొంటుంది. నివ్వెరపోతున్న శశిరేఖకు సుభద్ర అసలు విషయం చెపుతుంది.

అక్కడే ఉన్న అభిమన్యుడు శశిరేఖను చూచి సంతోష పడతాడు. ద్వారకానగరంలో బలరాముని ఇంట పెళ్లి ప్రయత్నాలు ప్రారంభమవుతాయి. శశిరేఖస్థానంలో ఘటోత్కచుడు మాయా శశిరేఖగా మారి చెలికత్తెలను ఆశ్చర్యపరుస్తూ ఉంటాడు. దుర్యోధనాదులు సపరివారంగా పెండ్లికి తరలి వస్తారు. ఈ సందర్భంలో ఘటోత్కచుని అనుచరుడు, గురువు అయిన చిన్నమయ్య తన సహాయకులతో అక్కడికి చేరుకొని విడిది మందిరాన్ని మాయతో నిర్మిస్తాడు. ఈ విడిది మందిరంలోనే కౌరవులు విడిదిచేస్తారు. ఈ విడిది మందిరంలో చిన్నమయ్య రకరకాల వస్తువులతో నిండిన బజారును సృష్టిస్తాడు. వంటశాల, వంట పాత్రలు, దుస్తులు, రకరకాల కత్తులు కటారులు, చెప్పులు, చాపలు, మంచాలు, పరుపులు వివిధ రకాల భోజన పదార్థాలు- ఒకటేమిటి సమస్తం అమర్చుతాడు. ఇదే మాయాబజార్. ఈ మాయాబజార్‌లో కౌరవులు పడిన తిప్పలు అన్ని ఇన్నికావు. కౌరవుల పక్షాన వచ్చిన పురోహితులను చిన్నమయ్య ఆట పట్టించిన విధానం కడుపుబ్బనవ్విస్తుంది. లక్ష్మణ కుమారుడు పెండ్లికుమారుడై శశిరేఖను చూడాలంటాడు. రేవతీ బలరాములు, మిగిలిన యాదవులంతా విడిది మంటపానికి చేరుకొని మగ పెండ్లి వారికి మర్యాదలు చేయడంలో నిమగ్నమవుతారు. ఆవిడిది గృహంలో శశిరేఖగా ఉన్న ఘటోత్కచుడు ప్రవర్తించిన తీరు కౌరవులకు, ముఖ్యంగా శకునికి సందేహం కలిగిస్తుంది. శకుని 'శశిరేఖ కనుకట్టు నేర్చిందా లేక నాకన్ను చెదిరిందా' అంటాడు. పెండ్లికి వచ్చిన వారందరికీ చిన్నమయ్య అక్కడ సృష్టింపబడిన వస్తువులను కానుకలుగా ఇప్పిస్తాడు. దీన్ని చూచి దుర్యోధనాదులు యాదవుల ఆతిథ్యం ఎంతో బాగుందని మెచ్చుకొంటారు. లక్ష్మణ కుమారుడు శశిరేఖను కలుసుకొని ఆమె అందానికి ఆకర్షితుడై 'సుందరి నీవంటి దివ్య స్వరూపము ఎందెందు వెతికినా లేదుగద - నీముద్దు మురిపాలింక నావేగద' అంటూ ఆడుతూ పాడుతూ మాయా శశిరేఖతో గడుపుతూ పెండ్లి ముహూర్తాన్ని నిరీక్షిస్తుంటాడు.

ఘటోత్కచుని ఆశ్రమంలో శశిరేఖాభిమన్యుల వివాహానికి ఏర్పాట్లు జరుగుతాయి. శ్రీకృష్ణుడు రుక్మిణ్యాదులతో అక్కడికి చేరుకుంటాడు. ఇంతలో ముహూర్తం సమీపించడంతో లక్ష్మణ కుమార మాయా శశిరేఖలు వివాహ మండపం చేరుతారు. అక్కడ జరిగిన పెండ్లి తంతు హాస్య స్ఫోరకంగా ఉంటుంది. కంకణధారణ, సన్నెకల్లుతొక్కించడం, జీలకర్ర బెల్లం పెట్టించడం మాంగల్యాధారణ ఇత్యాది సందర్భాలలో శశిరేఖ చేసిన చేష్టలు లక్ష్మణ

కుమారునికి చెమట పట్టిస్తాయి. మాంగల్యం కట్టడానికి సమీపించినపుడు ఘటోత్కచుడు పులిగా కనిపిస్తాడు. ఇలా లక్ష్మణ కుమారునికే కనిపిస్తుంది. మిగిలిన వారికెవరికి కనిపించదు. దీనితో లక్ష్మణ కుమారుడు మూర్ఛపోతాడు. ఇందులో ఏదో మోసముందని శకుని దుర్యోధనాదులు బలరాముని నిందిస్తారు. శశిరేఖ ఘటోత్కచుడుగా మారిపోతుంది. ఘటోత్కచుడు కౌరవుల దుష్టపన్నాగాన్ని బలరామునికి వివరించి చెపుతాడు. బలరాముడు కోపపడతాడు. చివరకు శకుని సత్య పీఠం మీద ఎక్కి తామెందుకు ఈ వివాహం జరగాలని కాంక్షించినది చెపుతాడు. 'పాండవుల రాజ్యం కాజేశాం. పాండవుల పక్షం వహించే యాదవులను మా పక్కకు తిప్పుకోవాలంటే శశిరేఖను కౌరవుల కోడలుగా చేసుకొంటే సరిపోతుంది. అందుకే బలరాముని హస్తినకు ఆహ్వానించి సన్మానించాం. బలరాముడు సన్మానానికి ఉబ్బితబ్బిబై తన కుమార్తెను మామనమడికి ఇస్తానన్నాడు. అని శకుని చెప్పగానే బలరాముడు ఉగ్రుడవుతాడు. నిజమైన శశిరేఖను తన ఆశ్రమానికి చేర్పించానని అక్కడ శశిరేఖాభిమన్యుల వివాహం జరుగుతున్నదని చెపుతాడు. అక్కడ ఉన్న కౌరవులను తన మాయాశక్తితో ఘటోత్కచుడు గుడ్డ మూటలో బంధించి ఆ మూటను హస్తినాపురంలో పడేటట్లు చేస్తాడు.

తరువాత అందరూ హిడంబి నివాసానికి వెళ్లి అక్కడ జరిగే శశిరేఖాభిమన్యుల వివాహం తిలకిస్తారు. కథ సుఖాంత మవుతుంది. ఈ చిత్రంలో పాండవుల ప్రస్తావన ఎన్నోసార్లు వచ్చినప్పటికి వాళ్లు కనిపించరు. పాండవులనుగాని వారి బంధువులనుగాని, వారి బంధవుల బంధవులనుగాని ఇబ్బందుల పాలుజేస్తే మీకిలాంటి శాస్తి జరుగుతుందని, ఇది ఘటోత్కచుని మాటని కౌరవులను గుడ్డ మూటలో బంధించినపుడు ఘటోత్కచుడన్న మాటలు ఈ చిత్రానికి నాటకంలోని భరత వాక్య ప్రయోజనాన్ని నెరవేరుస్తాయి. చిత్రం చివర ఘటోత్కచుడు శ్రీకృష్ణుని స్తుతిస్తాడు. ఈ కథ విన్న వారికి, రాసిన వారికి చదివిన వారికి సుఖ సంపదలు కలుగుతాయని కుడా ఘటోత్కచుడు శ్రీకృష్ణుని స్తుతిలో పేర్కొంటాడు. ఇది చిత్రాని ఫలశ్రుతి.

**నర్తనశాల :** రాజ్యం పిక్చర్స్‌వారు 1963లో నిర్మించిన ఈ చిత్రానికి మాటలు సముద్రాల సమకూర్చగా కమలాకర కామేశ్వరరావు దర్శకత్వం

ఈ కథనే మళ్లీ కీర్తిశేషులు ఎన్.టి.రామారావుగారు 1979లో 'శ్రీమద్విరాటపర్వం' పేరుతో సినిమాతీశారు. 'నర్తనశాల' అనేది బృహన్నల ఉత్తరతో పాటు ఇతర రాచ కన్యకామణులకు నాట్యం నేర్పేచోటు. ఇక్కడే భీముడు కీచకుని చంపాడు. ఈ సినిమాలో కీచకునికథ అతి ప్రధానమైంది. అందుకే ఈ సినిమాకు 'నర్తనశాల' అనిపేరుంచారు. ఇందులో కీచకుడుగా నటించిన కీర్తిశేషులు యస్.వి. రంగారావు గారికి ఈ సినిమాను జకార్తాలో అంతర్జాతీయ చిత్రోత్సవంలో ప్రదర్శించినపుడు ఉత్తమ నటుడు అవార్డు లభించింది. ఇలాంటి అవార్డు పొందిన ఏకైక తెలుగు నటుడు, నిజమైన నట సార్వభౌముడు రంగారావుగారే.

అర్జునుడు అమరావతికి వెళ్లి ఇంద్రుని అర్ధ సింహాసన మధిష్ఠించడంతో చిత్రం ప్రారంభమవుతుంది. అర్జునుని గౌరవం కోసం ఇంద్రసభలో ఊర్వశి 'ఓనరవరా, కురువరా' అని పాడుతూ నృత్యం చేస్తుంది. అర్జునుని అందానికి ముగ్ధురాలై ఆరాత్రి అతని మందిరానికి వెళ్లి తన వలపును పండించమంటుంది. ఇంద్రుని ప్రియురాలు కావడంవల్ల ఆమె తనకు తల్లితో సమానమంటాడు అర్జునుడు. వలపు సెగలకు బలైన ఊర్వశి విచక్షణను కోల్పోయి పేడివి కమ్మని అర్జునుని శపిస్తుంది. అంతలో దేవేంద్రుడు అక్కడికి వచ్చి జరిగిన విషయం తెలుసుకొని ఊర్వశి శాపం అర్జునునికి అజ్ఞాత వాసకాలంలో పనికొస్తుందని ఒక సంవత్సరకాలం తరువాత మళ్లీ మామూలు రూపు వస్తుందని అనుగ్రహిస్తాడు. అరణ్యావాస కాలపరిమితి దాటడంతో పాండవులు ఒక సంవత్సరం అజ్ఞాత వాసకాలం విరటుని నగరంలో గడపాలని నిర్ణయించు కొంటారు. తమ ఆయుధాలను మూటగట్టి ఒక శమీ వృక్షంలో దాచిపెడతారు. మారువేషాలు ధరించి ఒక్కొక్కరొక్కక్క సమయంలో వేర్వేరుగా వచ్చి ధర్మరాజు కంకుభట్టుగా, భీముడు వంటవాడైన వలలుడిగా, అర్జునుడు బృహన్నలగా, నకులుడు అశ్వశిక్షకుడుగా, సహదేవుడు గోరక్షకుడుగా ద్రౌపది అంతఃపురంలో రాణి సుధేష్ణకు సైరంధ్రిగా విరటుని కొలువులో కుదురు కొంటారు.

కౌరవులు పాండవుల అజ్ఞాతవాసాన్ని బహిర్గత పరచడానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తారు. జీమూత మల్లుని పాండవుల నన్వేషించమని పంపిస్తారు. జీమూత మల్లుని చంపగలవాడు భీముడొక్కడేనని వారికి తెలుసు. దుశ్శాసనుడు యతివేషంలో పాండవుల నన్వేషిస్తూ ద్వారకకు వస్తాడు. కృష్ణుడు

మారువేషంలోని దుశ్శాసనుని గుర్తించి పాండవులు అంత సులభంగా బయట పడరని, అజ్ఞాత వాసం తప్పని సరిగా పూర్తిచేసుకుంటారని చెపుతాడు. అతనిని దుశ్శాసనుడుగా తెలిసికొని అక్కడే ఉన్న అభిమన్యుడు ప్రచండ కోపంతో దుశ్శాసనుని మీదికి లంఘిస్తాడు. శ్రీకృష్ణుడతనిని శాంత పరుస్తాడు. దేశాలన్నీ గాలించి తమ తండ్రుల జాడ తెలుసుకొంటానని అభిమన్యుడు బయలుదేరుతాడు. విరటుని రాజ్యంలో ఒకచోట రాజకుమార్తె ఉత్తరను చూచి ఆమెను ఆపదనుండి రక్షిస్తాడు. పరస్పర విలోకనాలతో ఇద్దరు దగ్గరవుతారు. ఎవరో పరదేశి ఉద్యానవనంలో ప్రవేశించాడని చెలికత్తెలద్వారా విన్న ఉత్తరుడు అభిమన్యుని బంధించాలని వచ్చి చేతగాక బెంబేలు పడతాడు. తనచేతిలో ఖడ్గం లేక పోవడంచేత శత్రువు బతికి పోయాడని బీరాలు పలుకుతాడు.

విరటుడు కొలువుతీరి ఉంటాడు. కంకుభట్టు రాజును తన ప్రసంగంతో సంతోషపెడుతుంటాడు. అంతలో ఇద్దరు స్త్రీలు ఒక బిడ్డను తెచ్చి నాబిడ్డంటే నాబిడ్డని వాదులాడుకొంటూ రాజును తగవు తీర్చమంటాడు. రాజుకు ఏమీ తోచక కంకుభట్టును పరిష్కరించమంటాడు. కంకుభట్టు ఆబిడ్డను రెండు ముక్కలుగా ఖండించి చెరొకముక్క ఇవ్వమని తీర్పు చెపుతాడు. నిజమైన తల్లి ఆతీర్పువిని ఏడుస్తూ తన బిడ్డను చంపవద్దని, ఆరెండవ స్త్రీకే ఇవ్వమని ఎక్కడున్నా తనబిడ్డ సుఖంగా ఉంటే చాలునని అంటుంది. బిడ్డకు నిజమైన తల్లి ఆమేనని తేలిపోతుంది. ఇంతలో ఉత్తరుడు ప్రవేశించి జీమూత మల్లుడనే వాడువచ్చి తనను మల్ల యుద్ధంలో ఓడించేవాళ్లు నగరంలో ఉన్నారా అని సవాలు చేస్తున్నాడని అతనిని ఓడించగల వీరుడు లేకపోవడం సిగ్గుచేటని అతడు సులభంగా గండపెండేరాన్ని కొట్టుకొని పోతాడని విచారిస్తాడు. కంకుభట్టు సూచన మేరకు రాజు వలలుని ఆపనికి పురమాయిస్తాడు. జీమూతమల్లుని వలలుడు మల్లయుద్ధంలో చంపుతాడు. ఈ విషయం తెలుసుకొన్న కౌరవులు పాండవులు విరటుని రాజ్యంలో ఉన్నారని విరటుని యుద్ధానికాహ్వానించి చీకాకుపరిస్తే అతనికి సహాయంగా పాండవులు బయటికి వస్తారని, ఆ నెపంతో మళ్లీ అజ్ఞాత వాసం చేయవలసి ఉంటుందని ఆలోచిస్తుంటారు.

విరటుని బావమరిది కీచకుడు నగరానికి వస్తాడు. అతనికి స్వాగత సత్కారాలు ఏర్పాటవుతాయి. అక్క సుధేష్ణను చూడడానికి కీచకుడు అంతః

పురానికి వెళ్లి అక్కడుండిన సైరంధ్రిని చూస్తాడు. ఆమె అందానికి దాసుడై ఆమెను కోరుకొంటాడు. ఆమెను తన మందిరానికి పంపమని అక్కను అడుగుతాడు. సుధేష్ణ సైరంధ్రి సామాన్యురాలు కాదని, ఆమెకు గంధర్వులైదుగురు భర్తలున్నారని, వారామెను అనుక్షణం కాపాడుతుంటారని, ఆమె జోలికి వెళ్లడం మంచిది కాదని హితం చెపుతుంది. పరస్త్రీ వ్యామోహం తలకెక్కిన కీచకునికి ఆమె మాటలు రుచించవు. ఆమెను పంపకపోతే విరాటనగరాన్ని ధ్వంసం చేస్తానని బెదిరిస్తాడు. సుధేష్ణ భయపడి సైరంధ్రిని బలవంతంగా పంపిస్తుంది. కీచకుడు సైరంధ్రి పట్ల లైంగికాభినయం ప్రదర్శిస్తూ తనకోరిక తీర్చమంటాడు. ఆమె తన భర్తలైన గంధర్వులను గుర్తుచేస్తుంది. అతడు వాళ్లందరినీ నుగ్గుచేస్తానంటాడు. బలాత్కరింపబోగా ఆమె విరటుని కొలువులోకి పరుగెత్తుకొని వస్తుంది. కీచకుడు వెంట వస్తాడు. అక్కడివాళ్లెవరూ అతనిని అడ్డగించరు. విరటుని ప్రార్థన మీద కీచకుడు అప్పటికి సైరంధ్రిని వదలి వెళతాడు.

ఉత్తరాభిమన్యులు అప్పుడప్పుడూ ఉద్యానవనంలో కలుసుకుంటూ ఉంటారు. అభిమన్యుడు ఆమెను తొందర పెడుతుంటే తనను ఆలోచించుకోనిమ్మంటుంది. అంతలో ఈ విషయం తెలిసి బృహన్నల అక్కడికి వస్తాడు. విషయం గ్రహించి అభిమన్యుని వివరాలడిగి తన కుమారుని గుర్తిస్తాడు. అంతఃపుర కన్యల నిలా చాటుగా కలుసుకోకూడదని, పెద్దలతో సంప్రదించడం మంచిదని అభిమన్యునికి హితం చెపుతాడు. అభిమన్యుడు వెళ్లి పోతాడు. ఇదంతా గమనించిన ఉత్తరుడు కూడా ఆవీరకుమారుని అభిమన్యకుమారుడుగా గుర్తించి అతనికే తన చెల్లెలనిచ్చి వివాహం చేయాలను కొంటాడు. కాని కీచకుడు ఉత్తరను దుర్యోధనుని పుత్రుడైన లక్ష్మణ కుమారుని కివ్వాలని నిర్ణయిస్తాడు. ఈ విషయం మీద అంతఃపురంలో వాదోపవాదాలు జరుగుతాయి.

సైరంధ్రి కీచకుని వలన తనకెలాగూ భంగపాటు తప్పదని తెలుసుకొని భీమార్జునులతో చెప్పుకొని విలపిస్తుంది. తన దశకు ధర్మజుడే కారణమని నిందిస్తుంది. ధర్మజుడు ధర్మం మూర్తీభవించిన వాడని అతని నిందించరాదని అర్జునుడు సర్ది చెపుతాడు. మళ్లీ సైరంధ్రి కీచకుని మందిరానికెళ్లి అతనిని కవ్వించి ఆశపెట్టి రాత్రికి నర్తనశాలకు రమ్మని చెపితే కీచకుడు తప్పక వస్తాడని సైరంధ్రివేషంలో భీముడు వెళ్లి వానిని తుదముట్టిస్తాడని అర్జునుడు

ఉపాయం ఆలోచిస్తాడు. సైరంధ్రి ఈ ఉపాయాన్ని అమలు చేస్తుంది. మన్మథ పారవశ్యంలో యుక్తాయుక్త జ్ఞాన శూన్యుడైన కీచకుడు నర్తనశాలకు వస్తాడు. అప్పటికే అక్కడికి ఆడవేషంతో చేరుకొన్న భీముడు కీచకుని చంపుతాడు. ద్రౌపది పరాభవాగ్ని చల్లారుతుంది. ఎప్పటిలాగే ఆరాత్రి గడిచి తెల్లవారుతుంది. కీచకుని మరణం నగరంలో తెలుస్తుంది. కీచకుని సోదరులైన ఉపకీచకులు తప్ప మిగిలిన వారందరూ సంతోషిస్తారు. సైరంధ్రిని పరాభవించినందుకు ఆమె గంధర్వ భర్తలు కీచకుని చంపినారని వార్త వ్యాపిస్తుంది. తమ అన్న మరణానికి కారణమైన సైరంధ్రిని కీచకుని శవంతో పాటు దహనం చేయాలని ఉపకీచకులు ఆమెను పట్టి శ్మశానానికి తెస్తారు. దహనంచేసే సమయానికి భీముడు వచ్చి అందరిని చితకబాది ఆమెను రక్షిస్తాడు.

కీచకవధ దుర్యోధనాదులకు తెలుస్తుంది. కీచకుని వధించినవాడు తప్పక భీముడై ఉంటాడని భావిస్తారు. పాండవుల అజ్ఞాతవాసాన్ని చెడగొట్టడానికి ఇదే తగిన సమయమనుకొంటారు. సుశర్మను దక్షిణగోగ్రహణానికి పురికొల్పుతారు. సుశర్మ విరటుని గోవులను మళ్లించుకొని పోవడానికి వస్తాడు. నగరంలోని వీరులంతా ఉత్తర గోగ్రహణానికి సిద్ధపడతారు. వారిని ఎదిరించడానికి వీరు లెవరూ లేరని తానే వారిని ఎదుర్కొంటానని తనకు రథసారధి కావాలని ఉత్తరుడు ఆలోచిస్తుంటాడు. బృహన్నల రథసారధిగా వెళతాడు. రణభూమిలో కౌరవవీరులను చూచి ఉత్తరుడు తత్తరపడి రథాన్ని ఇంటికి పోనియ్యమంటాడు. బృహన్నల రథాన్ని పాండవుల ఆయుధాల మూటను దాచిన చెట్టుదగ్గరికి తోలుకొని పోతాడు. ఉత్తరుని చెట్టెక్కి మూటవిప్పి అందులోని అర్జునుని గాండీవం తన కివ్వమంటాడు. భయపడుతూనే ఉత్తరుడలా చేస్తాడు. గాండీవం చేతికి తీసుకోగానే బృహన్నల అర్జునుడుగా మారిపోతాడు. అప్పటికి అజ్ఞాతవాస గడువు తీరిపోతుంది. ఉత్తరుడు సారథిగా పార్థుడు రథమెక్కి రణభూమికి వస్తాడు. వచ్చినవాడు అర్జునుడేనని పాండవులు మళ్లీ అజ్ఞాతవాసం చెయ్యాలని కౌరవులు సంతోషపడతారు. భీష్ముడు అజ్ఞాతవాసం అయిపోయిందని చెప్పగానే నిరాశపడతారు. అర్జునుడు కౌరవవీరులను తన బాణంతో స్పృహ పోయేటట్లు చేస్తాడు. ఉత్తరుడు కౌరవవీరుల తలపాగాలలోని కుచ్చులను ఉత్తరకోసం కోసుకొని తెస్తాడు.

ఈవార్త ద్వారకకు తెలుస్తుంది. శ్రీకృష్ణాదులు అభిమన్యాదులతోపాటు విరటుని నగరానికి వస్తారు. విరటుడు పాండవులను ద్రౌపదిని గుర్తుపట్టి

వారిని సేవకులుగా చేసుకొన్నందుకు క్షమించమంటాడు. ఉత్తరాభిమన్యుల వివాహం జరిపిస్తే అందరూ సంతోషపడతారని కృష్ణుడు చెపుతాడు. ఉత్తరాభిమన్యుల వివాహంతో కథముగుస్తుంది.

**శ్రీకృష్ణార్జున యుద్ధం :** జయంతీ పిక్చర్స్‌వారు 1963లో నిర్మించిన ఈ చిత్రానికి మాటలు పాటలు పింగళి నాగేంద్రరావు రాశారు. దర్శకుడు కె.వి.రెడ్డి. గయుని మూలంగా కృష్ణార్జునుల మధ్య జరిగిన ఈ యుద్ధంలో యాదవ పాండవ వంశాలకు చెందిన వ్యక్తులెందరో కనిపిస్తారు. యదుసింహ పాండవసింహుల మధ్యపోరు జరుగకూడదని వాంఛించి తదనుగుణంగా ప్రయత్నించి విఫలమవుతారు. ఈ కథ భారతంలోగాని భాగవతంలోగాని లేదు. ఆంధ్ర దేశంలో నాటకంగా ప్రచారం పొందిన 'గయోపాఖ్యానం' ఆధారంగా నిర్మింపబడిన చిత్రమిది.

మరుత్తరాట్చరిత్రలోను, చిత్రభారతంలోను గయోపాఖ్యాన కథను పోలిన కథలున్నాయి. ఈ కథను పద్యకావ్యాలుగా ఐదారుగురు రాశారు. 'కృష్ణార్జున సంవాదం' అనే పేరుతో ద్విపద కావ్యంగా రాసిన నాదెండ్లగోపమంత్రి (1520) వీరిలో ప్రథముడు. నాదెండ్ల గోపన తిమ్మరుసు మంత్రికి మేనల్లుడు. కృష్ణార్జున సంవాదంలో 1513 ద్విపద పంక్తులున్నాయి. ఇది సంవాదరూపంలోని గయోపాఖ్యానకథ. ఈకథకు మంచిజనాదరణ, విస్తృత వ్యాప్తికలిగాయి. "కృష్ణార్జున సంవాద మందు 'తేకువ గయ్యుని బుత్తెమ్మను నట్లుగాకున్న మదుబిందు కలహమౌననుము' అని సుభద్రచేత కృష్ణుడు అర్జునునికి రాయబారం పంపినట్లు కల్పించబడింది."[7]

తురువాత ఈ కథనే గ్రహించి రామయామాత్యుడు రెండశ్వాసాల చిన్నకావ్యాన్ని, వేల్లింటి సుబ్బయార్యుడు ఐదశ్వాసాల పెద్దకావ్యాన్ని రచించారు. ఈ రెండూ చంపూకావ్యాలు. వెలిచేరు వెంకటరామ ప్రధాని ఇంకొక పద్యకావ్యాన్ని, కస్తూరిరంగకవి 'కృష్ణార్జున సంవాదం' అనే పేరుతో మరొక ద్విపద కావ్యాన్ని రచించారు. వీళ్లేగాక ఓబయామాత్యుడు, పోచిరాజు అనేవాళ్లు ఈ కథను కావ్యంగా, దేనువకొండ తిమ్మయ్య జంగంకథగా రచించారట. సాధుపల్లి చంద్రశేఖర కవి ఈ కథను కన్నడంలో కావ్యంగా రచించినట్లు తెలుస్తున్నది.[8] ఈ కథను 1885కు ముందే కొండుభొట్లవారు నాటకీకరించారు. ఈ నాటకం గుంటూరు హిందూ నాటక సమాజం వారిచే రాజమండ్రిలో ప్రదర్శింప బడింది. ఆ తరువాతనే చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు

208 పద్యాలున్నాయి. పద్యనాటకాలకు మంచి ఆదరణ ఉండడం వల్ల ఆకాలంలో పద్యనాటకాలు వచ్చాయి. గయోపాఖ్యాన కథకు ఇంతటి ప్రఖ్యాతి ఉండడం చేతనే ఆంధ్రదేశంలో అనేకమార్లు ద్విపద కావ్యంగా, చంపూకావ్యంగా నాటకంగా రచింపబడింది. ఈ కథ 'కృష్ణార్జున యుద్ధం' అనే పేరుతో ఎన్.సి.కేల్కర్‌గారిచేత కన్నడంలో కూడా నాటకీకరించబడింది. ఈకథనే జయంతీ పిక్చర్స్‌వారు సినిమాగా తీశారు. సినిమా కోసం చేసుకొన్న చిన్న మార్పులు తప్పిస్తే మిగిలిన కథంతా చిలకమర్తివారి గయోపాఖ్యాన నాటకంలోని కథే.

ఈ సినిమాలో పారిజాత వృత్తాంతం, సుభద్ర వివాహం, ఖాండవ దహనం, గయునితప్పిదం, కృష్ణార్జునుల యుద్ధం అనే అంశాలున్నాయి. నారదుడు 'దేవదేవ నారాయణ పరంధామ పరమాత్మ' అంటూ ద్వారకలో కృష్ణుడి అవతారంలో ఉన్న శ్రీమన్నారాయణున్ని స్తుతిస్తూ ఆకాశం నుండి భూమికి దిగుతూ కనిపించడంతో కథ ప్రారంభమౌతుంది. ఆకాశంలోనే నారదునికి విమానంలో బ్రహ్మలోకం వెళుతున్న గయుడు కన్పిస్తాడు. బ్రహ్మవరం కోసం వెళుతున్నానని, బ్రతికినంతకాలం శాశ్వత కీర్తి కలిగే వరం కోరుకుంటానని చెప్పగా నారదుడు గయుని దీవిస్తాడు. తరువాత నారదుడు ద్వారకచేరి శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి మందిరంలో ఉన్నపుడు అక్కడికి వస్తాడు. అమరావతి నుండి తెచ్చిన పారిజాత కుసుమాన్ని శ్రీకృష్ణుడికోసం తెచ్చానంటూ ఆయనకు సమర్పిస్తాడు. ఇలాంటి దివ్య పుష్పాన్ని ఏ పురుషుడైనా తనకు నచ్చిన ప్రియురాలికే సమర్పిస్తాడని సూచిస్తాడు. కృష్ణుడు ఆ పుష్పాన్ని రుక్మిణి కొప్పులో పెడతాడు. ఈవార్తను చెలికత్తెద్వారా విన్న సత్య కృష్ణుని మీద అలిగి ముసుగుదన్ని పడుకొంటుంది. కృష్ణుడు వచ్చి 'అలిగితివా సఖీప్రియా కలత మానవా! ప్రియ మారగ నీదాసుని ఏలజాలవా' అంటూ సాంత్వన పరుస్తాడు. అలక పోగొట్టడానికి పాదాలు పట్టుకోబోగా ఆమెపాదాలు శ్రీకృష్ణుని శిరస్సు మీది కిరీటాన్ని తోసేస్తాయి. తప్పిదం జరిగిపోయిందని, మన్నించమని సత్య కృష్ణుని ప్రార్థించడంతో ఆమెలోని కోపం, అలక పోతాయి. ఈ ఘట్టం సత్యాకృష్ణుల ప్రణయ జీవితాన్ని వ్యక్త పరుస్తుంది.

సుభద్ర వివాహ విషయం ప్రస్తావనకు వస్తుంది. బలరాముడు ఆమెను సుయోధనుడికిచ్చి చెయ్యాలని నిర్ణయిస్తాడు. ఆ సమయంలో నారదుడు కూడా అక్కడ ఉంటాడు. శ్రీకృష్ణుడు మౌనంగా ఉండడం గమనించి నారదుడు శ్రీకృష్ణులవారెందుకో చెల్లి వివాహ విషయంలో మౌనంగా ఉన్నారని సాభిప్రాయంగా అంటాడు. దానికి బలరాముడు 'మా గోపాల కృష్ణుడు నా మాటకెప్పుడూ మౌనం వహిస్తాడు' అని చెపుతూ కృష్ణునికి కూడా సుభద్రా సుయోధనుల వివాహం అంగీకారమని అనుకొంటాడు. సుభద్ర మనసు అర్జునుని మీదనే ఉండడం వల్ల ఈ విషయం తెలియడంతో ఆమె బాధపడుతుంది. అలా జరగదని అర్జునునితోనే ఆమె వివాహం జరుగుతుందని చెప్పి శ్రీకృష్ణుడు సుభద్రను ఓదార్చుతాడు. నారదుడు ద్వారక నుండి వెళ్లి తీర్థయాత్రలు చేస్తున్న అర్జునుని కలసి విషయం చెపుతాడు. అక్కడక్కడా తిరుగుతూ వుంటే సుభద్ర దక్కదని, యతివేషంలో ద్వారకకు వెళ్లి ప్రయత్నం చేసుకోమని అర్జునునికి సలహా కూడా ఇస్తాడు. అర్జునుడు యతి వేషంలో వెళ్లి రైవతకాద్రిలో విడిది చేస్తాడు. శిష్యుడు వెళ్లి బలరామాదులకు చెప్పగా శ్రీకృష్ణబలరాములు వచ్చి యతి దర్శనం చేస్తారు. శ్రీకృష్ణుడికిదంతా ముందే తెలుసు. బలరాముడు సుభద్రను యతిసేవకు నియమిస్తాడు. కృష్ణుని సహాయంతో సుభద్రార్జునుల వివాహం జరుగుతుంది. రుక్మిణి మందిరంలో జరిగిన ఈ వివాహం బలరామాదులకు తెలియదు. తెలిసిన తరువాత బలరాముడు కోపపడతాడు. కృష్ణుడు సర్ది చెపుతాడు. సుభద్రార్జునులే కృష్ణుడికి బుద్ధి చెపుతారని బలరాముడంటాడు. ఈ మాట తరువాత ఎప్పుడో అర్జునుడు కృష్ణునిపై ప్రకటించే యుద్ధాన్ని జ్ఞప్తికి తెస్తుంది. సారెతో సుభద్రార్జునులు ఇంద్రప్రస్థానికి వెళతారు.

గయుడు బ్రహ్మను దర్శిస్తాడు. తెలిసి చేసినా తెలియక చేసినా తన పనులు, తన చరిత్ర త్రిలోక వాసులకు తెలియాలని, తద్వారా శాశ్వత కీర్తికలగాలని అలాంటి వరం ప్రసాదించమని గయుడు బ్రహ్మను కోరగా బ్రహ్మ 'తథాస్తు' అంటాడు. వరం పొందిన సంతోషంతో గయుడు తన పురానికి వెళుతూ వుంటాడు. విమానంలో సంగీత నృత్య కార్యక్రమాలలో మునిగి ఉంటాడు. ఇంద్ర ప్రస్థం నుండి శ్రీకృష్ణుడు తన వారితో ద్వారకకు వెళుతూ సూర్యోదయ కాలం సమీపించడంవల్ల అక్కడ ఆగి దగ్గరలోగల నదిలో మొలలోతు నీళ్లలో నిలబడి సూర్యభగవానునికి అర్ఘ్యమిస్తూ ఉంటాడు.

ఉమ్మివేయగా అది నేరుగా వచ్చి శ్రీకృష్ణుని దోసిట పడుతుంది. సూర్యున్ని పూజిస్తున్న సమయాన ఈ అకృత్యం చేసిన వాడెవరని కృష్ణుడు సూర్యునే అడుగుతాడు. గయ నామధేయ గంధర్వుడు బ్రహ్మవర ప్రసాద గర్వంతో ఆకాసాన వెళుతూ ఈ పని చేశాడని కర్మసాక్షి చెపుతాడు. అలాంటి పాపిని ఎక్కడ దాక్కున్నా తన సుదర్శనంతో సంహరిస్తానని కృష్ణుడు శపథం చేస్తాడు. తన నగరానికి వెళ్లిన తర్వాత గయుడికీ విషయం తెలుస్తుంది. గయుడు ప్రాణ భీతితో ఎక్కడ దాక్కుంటే ప్రాణం నిలుస్తుందని ఆలోచిస్తుండగా అక్కడికి నారదుడు వస్తాడు. ఈ ముప్పు తప్పింపగలవాడు అర్జునుడొక్కడేనని అతనిని శరణు పొందమని సలహా ఇస్తాడు. గయుడు సుభద్రార్జునులు విహరిస్తున్న చోటికి వెళ్లి అర్జునుని పాదాల మీదపడి శరణు పొందుతాడు. కాపాడుతానని మాట ఇచ్చిన తర్వాత అర్జునునికి అసలు విషయం తెలుస్తుంది. మాటను వెనక్కు తీసుకోలేక, శ్రీకృష్ణునితో రాగల శత్రుత్వానికి తట్టుకోలేక అర్జునుడు బాధ పడుతుంటాడు.

గయునికి అర్జునుడు అభయమిచ్చిన విషయం ద్వారకలో తెలుస్తుంది. నీవు అతనికెంతో సహాయం చేసినా అర్జునుడు నీ శత్రువును కాపాడడం నీకు వ్యతిరేకంగా మారడమేనని, అర్జునుడిలా చేస్తాడని తాను ముందే ఊహించానని బలరాముడు శ్రీకృష్ణునితో అంటాడు. శ్రీకృష్ణుడు గయుని తనకప్పగించమని పాండవులను కోరడానికి అక్రూరుని పంపుతాడు. అక్రూరుని మాటలు వినిన పాండవులు అర్జునుడిచ్చిన మాటకు తామంతా కట్టుబడతామని గయుని విడవడం సాధ్యం కాదని చెపుతారు. సుభద్ర తాను కృష్ణునితో మాట్లాడి సమస్యను పరిష్కరిస్తానని ద్వారకకు వెళుతుంది. ఆమె మాటలను శ్రీకృష్ణబలరాములు అంగీకరించరు. వాళ్లంత పంతంగా ఉన్నప్పుడు తన భర్త పరువు తనకు ముఖ్యమేనంటూ ఆమె తిరిగి ఇంద్ర ప్రస్థానికి వెళుతుంది. శ్రీకృష్ణార్జునుల మధ్య యుద్ధం ప్రకటింపబడుతుంది. యాదవ వీరులు, పాండవవీరులు యుద్ధరంగానికి వస్తారు. ఈ యుద్ధం కేవలం కృష్ణార్జునుల మధ్యనే జరగాలని ఇతరులిందులో జోక్యం చేసుకోరాదని కృష్ణుడు చెపుతాడు.

వెళ్లి శంకరుని ప్రార్థిస్తాడు. శివుడు యుద్ధరంగంలో ప్రత్యక్షమై కృష్ణార్జునులను యుద్ధవిరమణ చేయమని కోరతాడు. కృష్ణార్జునులిద్దరూ నరనారాయణులని వారి మధ్య కలహం లోక కల్లోలానికి దారితీస్తుందని చెపుతాడు. కృష్ణార్జునులు శంకరుని మాటను గౌరవించి యుద్ధాన్ని ఆపుతారు. గయుడు బతికి బయటపడతాడు. కథ సుఖాంత మవుతుంది.

బభ్రువాహన : ఈ చిత్రానికి 'అర్జున బభ్రువాహన యుద్ధం' అనికూడా మరొక పేరు. 1964లో సి. జగన్మోహనరావు నిర్మించిన ఈ చిత్రానికి సముద్రాల కథ - మాటలు - పాటలు కూర్చారు. సముద్రాలే దర్శకుడు కూడా. నన్నయ భారతం ఆదిపర్వంలోని ఎనిమిదవ ఆశ్వాసంలో అర్జునుడు 'ఉలూపి' అనే నాగకన్యను, చిత్రాంగద అనే మణిపుర రాజైన చిత్రవాహనుని కుమార్తెను పెండ్లాడిన కథలున్నాయి. ఈ కథలు వ్యాసభారతంలో కూడా ఉన్నాయి. నన్నయ సంగ్రహంగానే ఈ కథలు రాశాడు. తిక్కన తెనిగించిన అశ్వమేధపర్వ చతుర్థాశ్వాసంలో అర్జున బభ్రువాహనుల యుద్ధం వర్ణింపబడింది. బభ్రువాహనుని బాణహతి చేత మరణించిన అర్జునుని ఉలూపి సంజీవన మణిచేత బ్రతికిస్తుంది. ఈ కథాంశాలు పిల్లల మర్రి పినవీరభద్రుని జైమిని భారతంలో ఇంకా విపులంగా వర్ణితమైనాయి.[9] ఈ కథలన్నీ ఈ సినిమాకు ఆధారం. ఈ కథలతోపాటు కొన్ని జానపదాంశాలు కూడా జోడింపబడినాయి.

వ్యాసభారతం పైలుడు, సుమంతుడు, వైశంపాయనుడు, జైమిని అనే వ్యాసుని శిష్యులద్వారా ప్రచారంలోకి తేబడింది. ఈ శిష్యులు వ్యాస భారతాన్ని చెపుతూ మధ్య మధ్యలో కొన్ని వాళ్లకు తోచిన అంశాలు చేర్చారు. అందువల్ల భారత కథలో వాళ్లు ప్రచారం చేసిన ప్రాంతాల ననుసరించి భేదాలేర్పడినాయి. కవిత్రయ భారతం వైశంపాయనుడు జనమేజయునికి చెప్పినట్లుంది. పినవీరభద్రుని జైమిని భారతం జైమిని ప్రచారం చేసిన భారతం. అందువల్ల కవిత్రయ భారతంలో లేని కథలు జైమిని భారతంలో ఉన్నాయి.

బభ్రువాహన సినిమా అర్జునుడు తీర్థయాత్రకు బయలుదేరి గంగానదీ ప్రాంతంలో ఉండడంతో ప్రారంభమవుతుంది. అర్జునుని అందాన్ని, పరాక్రమాన్ని అప్పటికే విని ఉండిన ఉలూపి అనే నాగకన్య అక్కడికి వచ్చి నిద్రపోతున్న అర్జునుని నాగలోకం తీసుకొని పోతుంది. తనను ప్రేమించమంటుంది. బ్రహ్మచర్య దీక్షలో తీర్థయాత్ర చేస్తున్నానంటాడు

అర్జునుడు. ఎన్నో తీర్థాలను సేవించిన పుణ్యం ప్రాణం నిలపడం వల్ల సిద్ధిస్తుందని తనకోరికను తీర్చకపోతే ప్రాణం విడుస్తానని అంటుంది ఉలూపి. దీనితో అర్జునుడు ఆమెను వివాహమాడి ఒక రాత్రి మాత్రమే ఆమెతో గడిపి మరల కలుసుకుంటానని చెప్పి తన పరివారాన్ని వెతుక్కుంటూ వెళతాడు. అలావెళ్లి పరివారం కనిపించక పోగా కళింగ దేశాంతర్గతమైన మణిపురం చేరుకుంటాడు. అక్కడ చిత్రవాహనుని కుమార్తె చిత్రాంగదను చూస్తాడు. ఆమెను ప్రేమిస్తాడు. పుట్టిన బిడ్డను ఆరాజ్యానికి వారసుడుగా ఇవ్వడానికి సమ్మతించి ఆమెను వివాహమాడతాడు. కొన్నాళ్లక్కడ ఉంటాడు. చిత్రాంగదకు బభ్రువాహనుడనే కుమారుడు జన్మిస్తాడు.

తరువాత అర్జునుడు ద్వారకకు వెళతాడు. యతివేషంలో రైవతకాద్రి మీద విడిదిచేస్తాడు. సుభద్రను పెళ్లాడడానికి కృష్ణుడు ఆలోచించిన పథకమిది. బలరాముడు సుభద్రను యతికి సపర్యలు చేయమని పంపుతాడు. కృష్ణుని సహాయంతో సుభద్రను పెళ్లాడి ఇంద్రప్రస్థం చేరుకుంటాడు. దీనితో తీర్థయాత్ర పూర్తవుతుంది. కురుక్షేత్ర యుద్ధం జరిగి కౌరవులు మరణిస్తారు. ధర్మరాజు పట్టాభిషిక్తుడవుతాడు. ఈ రెండంశాలను సినిమాలో సంక్షిప్తపరచి చూపిస్తారు. అర్జునుని నిశిత నారాచలకు బలియైన భీష్ముని చూచి గంగ దుఃఖిస్తుంది. ఇలా చేసిన అర్జునునికి పుణ్యగతి కలగదని శపిస్తుంది. ఈ శాపం విషయం అర్జునుని భార్యయైన ఉలూపికి తెలుస్తుంది. ఎలాగైనా ఈ శాపాన్ని తొలగించి అర్జునునికి సద్గతి కలిగించాలనుకుంటుంది. గంగను ప్రార్థిస్తుంది. గంగ ప్రత్యక్షమై రక్తబంధువుల చేతిలో అర్జునుడు మరణించి మరల బ్రతికితే శాపం తొలగిపోతుందని చెపుతుంది.

వ్యాసప్రేరితులైన పాండవులు అశ్వమేధయాగం చేస్తారు. అశ్వం వెంట అర్జునుడు రక్షకుడుగా వస్తాడు. అశ్వం మణిపురం ప్రాంతంలో సంచరిస్తూ ఉంటుంది. బభ్రువాహనుడు అశ్వాన్ని బంధిస్తాడు. చిన్నప్పటి నుండి తండ్రిని గురించి విన్నాడేగాని చూడలేదు. అతని తండ్రియైన అర్జునుడు భార్యాపుత్రుల బంధం వదలి రాజ్యవిస్తరణ కాంక్షతో ఉన్నాడని తాతయైన చిత్రవాహనుడు చెపుతాడు. దీనితో బభ్రువాహనునికి అర్జునునిపై సహజంగానే కోపం వస్తుంది. ఈ పరిస్థితి గమనించిన ఉలూపి మణిపురం వచ్చి బభ్రువాహనుని తండ్రిని ఎదిరించమని ప్రేరేపిస్తుంది. బభ్రువాహనుడు గుర్రాన్ని వదలనని చేవ ఉంటే విడిపించుకోమని సవాలు చేస్తాడు. అర్జునుడు

బభ్రువాహనునికి ఒక బాణమిచ్చి ఉంటుంది. బభ్రువాహనుడు ఆ బాణం ప్రయోగించగానే తద్బాణ హతిచే అర్జునుడు మరణిస్తాడు. భర్త మరణానికి చిత్రాంగద శోకించి పుత్రుని, ఉలూపిని నిందిస్తుంది. ఉలూపి అర్జునునికి గంగ ఇచ్చిన శాపవృత్తాంతం వివరిస్తుంది. బభ్రువాహనుని నాగలోకం వెళ్లి సంజీవనమణిని తెమ్మంటుంది. అతడు నాగలోకం వెళ్లి అక్కడి నాగవీరులతో పోరాడి మణిని సాధించి తెస్తాడు. అతడు మణి తెచ్చేటప్పటికి అర్జునుని శిరం మాయమవుతుంది. ఆ సమయానికి కృష్ణుడు వచ్చి శిరస్సును రప్పిస్తాడు. శిరస్సు మొండానికి అతుక్కుంటుంది. సంజీవమణి స్పర్శతో అర్జునుడు పునర్జీవితుడవుతాడు. శ్రీకృష్ణుడు బభ్రువాహనుని పరాక్రమాన్ని మెచ్చుకొని అలాంటి పుత్రుని పొందిన అర్జునుని అభినందిస్తాడు. దీనితో కథ సుఖాంతమవుతుంది.

కర్ణ : పద్మినీ పిక్చర్స్‌వారు 1964లో నిర్మించిన ఈ చిత్రానికి 'మహాభారత కథ' అనిమరొక పేరుంది. ఈ చిత్రానికి నిర్మాత - దర్శకుడు బి.ఆర్. పంతులు. కర్ణుని కథను చిత్రించిన సినిమాలు 1964 నాటికి కొన్ని ఉన్నాయి. ఆ సినిమాలలో కర్ణుని జీవితంలోని ముఖ్య సంఘటనలే కనిపిస్తాయి. కర్ణుని జీవితాన్ని పూర్తిగా చూపిన చిత్రం 'కర్ణ'.

కుంతి సూర్యుని వలన తనకు పుట్టిన బిడ్డను పెట్టెలో పెట్టి ఆపెట్టెను నదిలో వదలడంతో కథ ప్రారంభమవుతుంది. మందసంలో కొన్ని నగలను ఒక విలువైన చీరను పెడుతుంది కుంతి. ఈ రహస్యం కుంతి తన చెలికత్తెకు చెప్పుకుంటుంది. నదిలో దొరికిన బిడ్డను తీసుకొని సూత దంపతులు నామకరణం చేయించడానికి పురోహితుని వద్దకు వెళతారు. పురోహితుడు ముచ్చటకోసం తాకితే ఆబిడ్డ తన శిరోభూషణం పురోహితునికి దానం చేస్తున్నట్లుగా అతని చేతి మీదికి తోస్తాడు. పురోహితుడు ఆశ్చర్యపడి ఈ బిడ్డ దాన ధర్మాలు చేసి ప్రఖ్యాతుడవుతాంటాడు. సహజ కవచ కుండలాలతో పుట్టిన ఆబిడ్డకు 'కర్ణుడు' అని పేరు పెడతాడు. కురుకుమారుల అస్త్ర విద్యా ప్రదర్శన జరుగుతుంది. అర్జునుని లోకోత్తర విలుకాడని అందరూ శ్లాఘిస్తుంటే కర్ణుడు వచ్చి తన విద్యను ప్రదర్శించే అవకాశమివ్వమంటాడు. అతడు సూత కుమారుడు కాబట్టి అవకాశం లేదంటారు. కులప్రస్తావన కర్ణుని జీవితంలో మొదటి సారిగా దెబ్బకొడుతుంది. తల్లిదండ్రులులేని ఒక కుర్రవాడు

తనను గురువులు బడికి రానివ్వలేదని ఏడుస్తూ కర్ణుని దగ్గరకు వస్తాడు. తల్లి దండ్రులు లేక పోవడం విద్య నేర్చుకోడానికి అనర్హతగా కర్ణునికి కనిపిస్తుంది. ఇది అతనిని ఇంకా ఎక్కువగా కుంగదీస్తుంది. ఇంతలో దుర్యోధనుడు కర్ణుని అంగరాజును చేసి గౌరవిస్తాడు. తాను జీవించినంత కాలం దుర్యోధనునికి సేవ చేస్తానని కర్ణుడు ప్రతిజ్ఞ చేస్తాడు.

కవచ కుండలాలను హరించడానికి ఇంద్రుడు వస్తాడు. కర్ణుడు తన కవచ కుండలాలను ఇంద్రునికి దానం చేస్తాడు. ఇది చూచిన దుర్యోధనుని భార్య భానుమతి అతనిని దానకర్ణుడంటుంది. చంద్రకేతు మహారాజు కుమార్తె శుభాంగి. ఈమె రథంలో వస్తుండగా గుర్రాలు దౌడుతీస్తాయి. పరుగున వెళ్లి రథాన్ని ఆపి కర్ణుడామెను రక్షిస్తాడు. ఇద్దరూ పరస్పరాకర్షితులౌతారు. ఆమె తన చిరునామాను సాంకేతికమైన చేతి గుర్తులతో చెపుతుంది. కొన్నాళ్ల తరువాత దుర్యోధనుడు లేని సమయంలో కర్ణుడు భానుమతితో జూదమాడు తుంటాడు. ఇంతలో దుర్యోధనుడు రాగా ఆమెవెంటనే లేచి పోబోతుంది. దుర్యోధనుని రాకను గమనించని కర్ణుడు ఆమె కటి వస్త్రాన్నిలాగి కూర్చోమంటాడు. దానితో ఒడ్డాణం తెగి ముత్యాలన్నీ కింద పడతాయి. దుర్యోధనుని చూచి కర్ణుడు సందేహపడతాడు. కాని దుర్యోధనుడు అనుమానం లేకుండా మళ్లీ ఆడమని ప్రోత్సహిస్తాడు. కర్ణుడు శుభాంగిని ప్రేమించడం ఆమె గుర్తులు చెప్పడం భానుమతీ దుర్యోధనులు తెలుసుకొంటారు. శుభాంగి చూపిన గుర్తులను భానుమతి వివరిస్తుంది. భానుమతి దుర్యోధనులే చంద్రకేతు మహారాజు దగ్గరకు వెళ్లి వివాహ విషయం మాట్లాడి శుభాంగీ కర్ణులకు వివాహం జరిపిస్తారు.

కర్ణుడు సూతపుత్రుడని చంద్రకేతువు తెలుసుకొంటాడు. కర్ణుని నిలదీస్తాడు. కుమార్తెను పంపనంటాడు. కులం ముఖ్యమంటాడు. నీకులం నాకంటి మంటలో కాలిపోవాలంటాడు కర్ణుడు. శుభాంగి అభిప్రాయం కూడా అదేనని తెలుస్తుంది. కర్ణుడు మామగారి ఇంటి నుండి వెళ్లిపోతాడు. శుభాంగి కర్ణుని వెంట వచ్చి తాను మాట్లాడిన మాటలు తనవి కావని మంగళ అనే చెలికత్తె మాటలని తనను మన్నించి ఏలుకొమ్మని ప్రార్థిస్తుంది. కులసమస్య తనను భాదిస్తున్నదంటాడు కర్ణుడు. కులం పట్టించుకోవలసినంత గొప్ప విషయం కాదని గాలికి, నేలకు కులమేమిటో ఎవరికి తెలుసునని చెప్పి త్వరలోనే కర్ణుడు గొప్పవాడైపోతాడని ఆమె భర్తను ఆశ్వాసిస్తుంది. శుభాంగి

గర్భవతి అవుతుంది. శుభాంగి తల్లి కుమార్తెను కాన్పుకు తీసుకొని రమ్మని పరిచారికుని పంపుతుంది. కర్ణుడు పంపడు. భానుమతి వచ్చి పంపమంటుంది. శుభాంగి తండ్రి ఇంటికి వెళితే తండ్రి ఆమెను అవమానించి తరిమేస్తాడు. శుభాంగి తిరిగివస్తుంది. భానుమతే ఆమెకు శ్రీమంతం చేస్తుంది. శుభాంగికి కొడుకు పుడతాడు. అతని పేరు వృషషేణుడు.

కురుక్షేత్ర యుద్ధం జరుగుతుందనుకుంటారు. దుర్యోధనుడు మొదట కర్ణునే యుద్ధానికి నాయకత్వం వహించమంటాడు. అందరూ ఒప్పుకోరు. చివరకు భీష్ముడు కౌరవ సేనాపతిగా నియమింపబడతాడు. కౌరవవీరుల పరాక్రమాలను గురించి చెపుతూ భీష్ముడు కర్ణుని అర్థరథుడంటాడు. ఈమాటకు కర్ణుడు మండిపడతాడు. తనతో యుద్ధంచేసి గెలవమని భీష్ముని సవాలు చేస్తాడు. భీష్ముడు చనిపోయే దాకా యుద్ధ భూమికి వెళ్లనని ప్రతిజ్ఞ చేస్తాడు. కుంతి కర్ణుని దగ్గరకు వచ్చి తల్లిగా పరిచయం చేసుకొంటుంది. కర్ణుని తన బిడ్డని నలుగురిలో చెప్పలేక పోయినందుకు భాదపడుతుంది. పాండవుల పక్షం రమ్మంటుంది. భానుమతితో చదరంగ మాడడం, ఆమె ఒడ్డాణం తెగడం, దుర్యోధనుడు అనుమానపడకపోవడం మొదలైన విషయాలు చెప్పి తాను దుర్యోధనునికి కృతజ్ఞుడనని, అతనిని వీడి రాలేనని అంటాడు. ఆమె రెండు వరాలివ్వమంటుంది. ఆవరాల ప్రకారం అర్జునుని తప్ప మిగిలిన పాండవులను చంపనంటాడు. తనకు గల నాగాస్త్రాన్ని అర్జునునిపై ఒకేసారి ప్రయోగిస్తానంటాడు.

దుర్యోధనుడు సహదేవుని కలిసి కురుక్షేత్ర యుద్ధానికి ముహూర్తం నిర్ణయించమంటాడు. అమావాస్యనాడు యుద్ధం ప్రారంభిస్తే విజయం కలుగుతుందంటాడు సహదేవుడు. చతుర్దశిరోజే అమావాస్య అని చెప్పి కృష్ణుడు తర్పణక్రియలు నిర్వర్తిస్తాడు. ఈ విడ్డూరమేమిటంటూ సూర్యచంద్రులక్కడికి వస్తారు. మీరిద్దరూ కలసి వచ్చిన రోజే అమావాస్య కదా అంటాడు కృష్ణుడు. ఈ సూక్ష్మం కౌరవులకు తెలియదు. దీనితో ముహూర్తం మారిపోతుంది. యుద్ధం జరుగుతుంది. భీష్ముడు శరతల్పగతుడవుతాడు. కర్ణుడు యుద్ధభూమికి వస్తాడు. వెంట అతని కుమారుడు వృషషేణుడు కూడా యుద్ధంచేయడానికి వస్తాడు. అర్జునుడు వృషషేణుని సంహరిస్తాడు. తన కుమారుని చంపిన అర్జునుని చంపడానికి కర్ణుడు తీవ్ర ప్రతాపంతో యుద్ధభూమికి వస్తాడు. నాగాస్త్రాన్ని ప్రయోగించినపుడు కృష్ణుడు

మళ్లీ ప్రయోగించమని శల్యుడు చెప్పగా కర్ణుడు ఒకసారి వాడిన అస్త్రాన్ని మళ్లీ వాడనంటాడు. రథచక్రం భూమిలో కుంగిపోతుంది. కర్ణుడు రథం దిగి చక్రాన్ని ఎత్తుకొనే ప్రయత్నం చేస్తుండగా కృష్ణ ప్రేరితుడైన అర్జునుడు కర్ణునిపై బాణాలు వేసి చంపుతాడు. కర్ణుడు మృత్యుదేవత ఒడిలో ఉంటాడు. కృష్ణుడు బ్రాహ్మణ వేషంలో వచ్చి అప్పటి వరకు అతడు చేసిన దానాల ఫలితాన్ని తనకివ్వమని కర్ణుని యాచిస్తాడు. తన ధాన ఫలాన్ని కర్ణుడు కృష్ణునికి సమర్పిస్తాడు. ధర్మదేవత యుద్ధభూమికి వచ్చి కర్ణుని వల్ల ధర్మం నిలుస్తుందని నమ్మినానని, అతడు చనిపోయాడని ఏడుస్తుంది. కృష్ణుడు ధర్మస్థాపన కోసం కర్ణుని చంపవలసి వచ్చిందని ఆమెను ఓదార్చుతాడు. కథ విషాదాంతమవుతుంది. ఈ సినిమాలో కర్ణుని మహావీరుడుగా, దానవీరుడుగా, ధర్మవీరుడుగా చిత్రించడానికి మూలకథలో లేని కొన్ని సంఘటనలు కల్పించబడినాయి.

పాండవ వనవాసం : ఈ చిత్రాన్ని మాధవీ ప్రొడక్షన్స్‌వారు 1965లో నిర్మించారు. కవిత్రయ భారతంలోని ఆది సభారణ్య పర్వాలలో గల కథ ఈ సినిమాకు మూలం. సినిమా కోసం కొన్ని మార్పులు చేర్పులు చేయబడినాయి. పాండవులు చేసిన రాజసూయయాగ పరిసమాప్తితో చిత్రం ప్రారంభమవుతుంది. శశిఅభిమన్యులు చిన్న పిల్లలుగా ద్వారకలో కనిపిస్తారు. పాండవుల రాజ్య వైభవాన్ని, వాళ్ల సిరిసంపదలను చూచి కన్ను కుట్టిన కౌరవులు పాండవులను అవమాన పరచాలనుకుంటారు. శకుని తనవద్దగల పాచికలతో జూదంలో వారిని గెలిచి వారి సంపదను గ్రహించవచ్చునని దుర్యోధనునికి చెపుతాడు. దుర్యోధనాదులు నమ్మలేనట్లు చూస్తారు. శకుని పాచికలు ఆకాశంలో ఎగరవేసి వాటి ప్రభావం చూపిస్తాడు. ధర్మరాజుకు జూదప్రీతి ఉందని, ఆతనిని జూదమాడడానికి ఆహ్వానించమని శకుని సూచిస్తాడు. ధర్మరాజు సోదరులతో కలసి హస్తినాపురానికి వస్తాడు. పాండవులు జూదంలో ఓడిపోతారు. ద్రౌపదిని కూడా ధర్మజుడు జూదంలో పణంగాపెట్టి ఓడిపోతాడు. పాండవుల సంపదంతా కౌరవుల వశమవుతుంది. పాండవులు కట్టుగుడ్డలతో మిగులుతారు. విదురుడు దుర్యోధనుని మందలిస్తాడు. ద్రౌపదిని సభలోకి ఈడ్చుకొని వచ్చి దుశ్శాసనుడు ఆమె కట్టువస్త్రం ఊడబెరుకుతాడు. ఆసమయంలో ఆమె గౌరవాన్ని శ్రీకృష్ణుడు కాపాడుతాడు. వికర్ణుడు సభలో

స్త్రీని పరాభవించడం అన్యాయమంటాడు. అతని మాటలను సుయోధనాదులు లెక్కపెట్టరు. సభలోని భీష్మాది కురువీరులు, ద్రోణాది గురువులు చూస్తుంటారేగాని అక్కడ జరిగిన దురాగతాన్ని ఆపరు.

ధృతరాష్ట్రుడు ద్రౌపదిని దగ్గరకు పిలిచి పశ్చాత్తాపం నటిస్తాడు. రెండు వరాలు కోరుకోమంటాడు. ద్రౌపది తన భర్తలకు స్వేచ్ఛను, పాండవులు పోగొట్టుకున్న రాజ్యాన్ని ప్రసాదించమంటుంది. ధృతరాష్ట్రుడు అంగీకరిస్తాడు. అంతలో శకుని మళ్లీ ఒక ఆట ఆడమని దానితో దశ తిరుగవచ్చునని ధర్మజుని ఉద్రేక పరుస్తాడు. మళ్లీ ఆడడానికి ధర్మజుడు సిద్ధపడ్డాడు. ఆటకు పందెంగా ఓడినవారు 12 సంవత్సరాలు అరణ్యావాసం ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చేయాలని, అజ్ఞాతవాసంలో పట్టుబడితే మరలా 12 సంవత్సరాలు అరణ్యావాసం ఒక సంవత్సరం అజ్ఞాతవాసం ఉంటుందని ఇరుపక్షాల వారు ఒప్పుకుంటారు. ఈసారి కూడా ధర్మరాజు ఓడిపోతాడు. పాండవులు పాంచాలితో కలిసి అరణ్యానికి వెళతారు. వీరితో నగరంలోని బ్రాహ్మణులంతా అడవికి వెళతారు. దుర్యోధనుడు 'బ్రహ్మాండం' అనే ఒక గూఢచారిని నియమించి పాండవుల సమాచారం ఎప్పటికప్పుడు చెప్పమంటాడు. సూర్యదేవుడు ప్రసాదించిన అక్షయ పాత్రతో అక్కడున్న వాళ్లందరికి భోజనం పెడుతూ పాండవులు సుఖంగా ఉన్నారని అందరి భోజనాలు అయిపోయి అక్షయపాత్రను శుభ్రంచేసి పెడితే తరువాత ఆ పూటకు అది పదార్థాలను ప్రసాదించదని తెలుస్తుంది. శకుని సలహామీద దుర్యోధనుడు దుర్వాసుని మెప్పించి ఆయనను పాండవుల మీదికి ఉసిగొలిపే ప్రయత్నం చేస్తాడు. పాండవులు అక్షయపాత్ర ఉందన్న గర్వంతో విర్రవీగుతున్నారని చెపుతాడు. దుర్వాసుడు తన శిష్యులతో ఒకనాటి మధ్యాహ్నం అందరి భోజనాలు అయి పాత్రను ద్రౌపది శుభ్రంచేసిన తరువాత అక్కడికి వెళ్లి తనకు తన శిష్యులకు భోజనం అర్థిస్తాడు. ద్రౌపదికేమి చేయాలో తోచక కృష్ణుని ప్రార్థిస్తుంది. ఆయన వచ్చి అక్షయ పాత్రలో ఒక మెతుకును సృష్టించుకొని దాని నారగిస్తాడు. దీనితో దుర్వాసునికి అతని శిష్యులకు షడ్రసోపేతమైన భోజనం తిని కడుపు ఉబ్బినట్లు భ్రమ కలుగుతుంది. దుర్యోధనుని మాట విని వచ్చినందుకు ఇలా జరిగిందని దుర్వాసుడు దుర్యోధనుని నిందిస్తాడు.

పాండవులీ రకంగా గందమాదన పర్వతప్రాంతంలో గడుపుతుంటారు. భీముడు ద్రౌపదిని తీసుకొని వెళ్లి ఆటవిక సౌందర్యం చూపుతాడు. అంతలో ఒక దివ్య కుసుమ గంధం గాలిలో వచ్చి వారిని తాకుతుంది. ఆసువాసన

భీముడు. దారిలో హనుమంతుని కలుసుకొంటాడు. హనుమంతుడు భీముని బలాన్ని పరీక్షిస్తాడు. తరువాత ఇద్దరూ వాయుతనయులమేనని తెలుసుకొంటారు. హనుమంతుడు ఆసువాసనగల పుష్పం సౌగంధిక పుష్పమని, అది యక్షుల స్వాధీనంలో ఉందని చెపుతాడు. భీముడు అక్కడికి వెళ్లి యక్షులతో పోరాడి ఆపుష్పాన్ని తెచ్చి ద్రౌపదికిస్తాడు. శశిరేఖను లక్ష్మణ కుమారునికివ్వడానికి నిర్ణయమవుతుంది. లక్ష్మణకుమారుడు బ్రహ్మాండంతో కలసి ద్వారకకు వస్తాడు. అక్కడ మాయాశశిరేఖ అతనిని ముప్పుతిప్పలు పెడుతుంది.

పాండవులు ద్వైతవనంలో ఉన్నపుడు దుర్యోధనుడు తన భార్య భానుమతితో సోదర పరివేష్టితుడై వస్తాడు. అక్కడే అడవిలో నివాసం ఏర్పరచుకొని తమవైభవం చూపించి వనవాసం చేస్తున్న పాండవులను గేలి చేయాలని, ద్రౌపదిని పరిహసించాలని అనుకుంటాడు. అడవిలో ఘోషయాత్రచేస్తూ కౌరవులు చిత్రసేనుడనే గంధర్వుని చేతికి చిక్కుతారు. దుర్యోధనుడు కూడా బంధింపబడతాడు. భానుమతి వచ్చి ద్రౌపదితో మొరపెట్టుకొంటుంది. ధర్మరాజు భీమార్జునులను వెళ్లి కౌరవులను విడిపించమంటాడు. వాళ్లు విడిపించి తెస్తారు. భీముడు దుర్యోధనుని కట్లు విప్పి ఇకనైనా బుద్ధిగా ఉండమంటాడు. దుర్యోధనుడు దీనిని పాండవులు తనకు చేసిన పరాభవంగా భావించి ప్రాయోపవేశంతో మరణ ప్రయత్నం చేస్తాడు. కర్ణుడు, శకుని పాండవులు దుర్యోధనుని సేవకులని, గంధర్వుల నుండి విడిపించడం వారిబాధ్యతేనని చెప్పి దుర్యోధనుని సాంత్వన పరుస్తారు.

బలరాముడు శశిరేఖను లక్ష్మణ కుమారునికిచ్చి వివాహం చేయనున్నాడని పాండవులకు తెలుస్తుంది. ఎలాగైనా శశిరేఖ అభిమన్యుని ఇల్లాలే కావాలని భీముడు భావిస్తాడు. పాండవులందరూ దీనికి సమ్మతిస్తారు. భీముడు తన కుమారుడైన ఘటోత్కచుని తలచుకొంటాడు. ఘటోత్కచుడు ప్రత్యక్షమౌతాడు. ద్వారకకు వెళ్లి అక్కడ జరిగే వివాహాన్ని చెడగొట్టి శశిరేఖని తీసుకొని రమ్మని ఘటోత్కచుని పంపుతారు. ఘటోత్కచుడు కృష్ణుని సహకారంతో శశిరేఖను తీసుకొని వస్తాడు. అతని ఆశ్రమంలోనే శశిరేఖాభిమన్యుల వివాహం జరుగుతుంది కథ సుఖాంత మవుతుంది.

**ప్రమీలార్జునీయం :** ఎస్.ఆర్ మూవీస్‌వారు 1965లో నిర్మించిన ఈ చిత్రానికి పింగళి నాగేంద్రరావు కథ - మాటలు - పాటలను సమకూర్చారు.

ఈసినిమాకు ఇతివృత్తం. ఈ కథ కవిత్రయ భారతంలో లేదు. పిల్లలమర్రి పినవీర భద్రకవి రచించిన జైమిని భారతంలో ఈ కథ ఉంది.[10] ధర్మరాజు అశ్వమేధం చేసినపుడు అశ్వంవెంట అర్జునుడు వెళతాడు. బభ్రువాహనుడు అశ్వాన్ని బంధిస్తాడు. ఈకథ కవిత్రయ భారతంలోని అశ్వమేథపర్వంలోఉంది. కాని అందులో ప్రమీల కథలేదు. జైమిని ప్రచారం చేసిన భారతంలో ఈ కథ ఉంది. అల్లిరాణి అని పేరుగల ఒక పాండ్యరాజకన్య అర్జునుని వివాహమాడింది. ఈ వివాహవృత్తాంతం పుగళేంది అనే తమిళ కవి ఒక కావ్యంగా రాశాడు[11] అల్లిరాణి కథే ప్రమీలకథ అని చెప్పడం ఉంది. అల్లిరాణి కథను జంగంకథగా కూడా వింటుంటాం. 'ప్రమీలార్జునీయ' మనే సినిమాలో శ్రీకృష్ణార్జునులు ప్రధాన భారత పాత్రలుగా కనిపిస్తారు. మిగిలిన పాత్రలలో కొన్ని జైమిని భారత కథలో ఉన్నాయి. మిగిలినవన్నీ కల్పితాయి. సినిమావాళ్లు ఏమూలకథను గ్రహించారో తెలియదు. సినిమాలో ప్రదర్శితమైన కథను పరిశీలిస్తే సినిమా కోసం అనేక మార్పులు చేసినట్లు తెలుస్తుంది. 1936లో నిర్మించిన ప్రమీలార్జునీయం సినిమాకు 1965 నాటి సినిమాకు కథలో చాలామార్పులు కనిపిస్తాయి. 1965 నాటి సినిమా స్త్రీ శక్తిని నిరూపించడానికి ఉద్దేశింపబడినట్లు అర్థమవుతుంది. స్త్రీలు పురుషున కెందునాతీసిపోరని, పురుషులే స్త్రీలను దోపిడీ చేస్తున్నారని ఈ చిత్రంద్వారా వెల్లడవుతుంది.

ప్రమీల స్త్రీ సామ్రాజ్యానికి రాణి. స్త్రీల ఔనత్యానికి పురుష అహంకారాన్ని తిప్పి కొట్టడానికి ప్రతిన పూనుతుంది. ఆమె స్త్రీసైన్యాన్ని తిలకిస్తుండగా నారదుడు వస్తాడు. ప్రమీల బాణం వేసి పాతాళగంగను పైకి రప్పించి నారదుని పాదాలు కడుగుతుంది. తన ఉద్యోగినులైన మహామాయ రణచండి మొదలైన వారిని పరిచయం చేస్తుంది. స్త్రీల రాజ్యం చాల బాగున్నదని నారదుడు ప్రశంసిస్తాడు. ఎప్పటికైనా ప్రపంచమంతా స్త్రీల వశం కావాలని, స్త్రీల ఆధిఖ్యత ప్రతిష్టింపబడాలని ప్రమీల చెపుతుంది. శౌర్య పరాక్రమాలలో ప్రమీలను మించిన వాళ్లెవరైనా ఉన్నారా అంటే నారదుడు అర్జునుడున్నాడని చెపుతాడు. శ్రీకృష్ణుని సహాయం లేకపోతే అతడు ఏమీచేయలేడంటుంది ప్రమీల. తరువాత నారదుడు ద్వారకకు వెళ్లి కృష్ణునితో ప్రమీల స్త్రీ శక్తిని గురించి ఆమె ఆలోచనలను గురించి వివరిస్తాడు. స్త్రీ సృష్టిలో ఒక్కతే

మనలేదని పురుష శక్తితోడైతేనే స్త్రీ జీవితం సంపూర్ణ మౌతుందని ప్రమీల జీవితంలో కూడా ఆమార్పు తప్పక వస్తుందని కృష్ణుడంటాడు.

ధర్మరాజు అశ్వమేధయాగం చేస్తాడు. యాగాశ్వ రక్షణకు ఎవర్ని పంపాలా అని ధర్మరాజు సందేహిస్తుంటాడు. అర్జునుడు ముందుకు వచ్చి అప్పటివరకు తాను సాధించిన విజయాలను పేర్కొని తానే అశ్వం వెంట వెళతానంటాడు. స్త్రీ బాలవృద్ధులకు కష్టనష్టాలు కలుగకుండా చూడమని ధర్మరాజు సలహా ఇస్తాడు. ఘటోత్కచుని కుమారుడైన వృక్షాసురుడు గుర్రాన్ని నిలుపుతాడు. గుర్రం పాండవులదని, దానివెంట అర్జునుడు వచ్చాడని తెలుసుకొని గుర్రాన్ని వదులుతాడు. అక్కడికి సమీపంలోని ఏకాంత గంగలో మునిగితే విజయం కలుగుతుందని అర్జునునికి చెపుతాడు. అర్జునుడు ఆ కొలనును సమీపిస్తుండగా ఒక స్త్రీ అక్కడ పరుగెత్తుతున్న లేడిపై బాణం వేస్తుంది. లేడికి తగలకుండా అర్జునుడు ఆబాణాన్ని తన బాణంతో విరిచేస్తాడు. ఆమె ముందుకొస్తుంది. ఇద్దరు పరస్పరాకర్షితులవుతారు. అప్పటి నుండి ప్రమీల మనసులో స్త్రీ సహజమైన ఆలోచనలు కలుగుతాయి. అయినా తనరాజ్య కట్టుబాట్లననుసరించి ఆభావాలను మనసులో దాచుకొంటుంది.

నారదుని ప్రేరణతో గుర్రం స్త్రీ సామ్రాజ్యంలో ప్రవేశిస్తుంది. స్త్రీ సైనికులు ఆగుర్రాన్ని బంధించి ప్రమీలకు చెపుతారు. గుర్రమెవరిదైనా యుద్ధంలో తనను జయించి తీసుకొని వెళ్లవలసిందేనంటుంది. ఘటోత్కచుని కుమారుడు ప్రమీల దగ్గరకు రాయబారానికి వచ్చి కురుక్షేత్రంలో అర్జునుడు చూపిన పరాక్రమాన్ని వర్ణించి గుర్రాన్ని వదలమంటాడు. అర్జునుడు కృష్ణుని సహాయంతో విజయాలు సాధించాడని అవి విజయాలుగా తానొప్పుకోనని ప్రమీల అంటుంది. ఈ విషయం తెలిసిన అర్జునుడు కృష్ణుడు లేకున్నా తాను ప్రమీలను జయించగలనని అనుకుంటాడు. తనకిన్నాళ్లు చోదకశక్తిగా సహాయంచేసిన కృష్ణునిపై కొంత చులకన భావం ఏర్పడుతుంది. తన సహచరుల సలహా ననుసరించి మునివేషంలో అర్జునుడు ప్రమీల నగరుకు వస్తాడు. నిజమైన తాపసేనని ఆమె అతనిని పూజించి గౌరవిస్తుంది. అర్జునుని సైన్యాన్ని ప్రమీల సైన్యం బంధిస్తుంది. స్త్రీ సైన్యం మాయతో తమ సైన్యాన్ని బంధించిందని, స్త్రీ సైన్యాన్ని ప్రేమతో బంధిస్తే పరిష్కారం సులభమౌతుందని భావిస్తారు అర్జునుని సలహాదారులు. మునిగా ప్రమీలకు ఒక మంత్రం చెప్పి ఆమంత్రానికి అర్థం చెప్పటం ఒక వీరపురుషునికే సాధ్యమని ప్రమీలకు

చెప్పించి ఆవీరపురుషుని వేషంలో అర్జునుడు ఆమె అంతః పురంలో ప్రవేశిస్తాడు. ఆమె అతనిని వేట సందర్భంలో తన బాణాన్ని విరగగొట్టిన వాడుగా గుర్తిస్తుంది. మరల మునివేషం ధరించి ప్రమీలకు ప్రేమను గురించి వివరిస్తూ క్రమంగా ఆమెలో శృంగారభావాలు కలిగిస్తాడు. అతడర్జునుడని ఆమెకు తెలియదు. ప్రేమ తమ రాజ్య విధులకు విరుద్ధమంటుంది. అర్జునుని జయిస్తే పురుషులందరినీ జయించినట్లేనంటుంది.

నారదుడు స్త్రీ సామ్రాజ్యానికి వస్తాడు. అర్జునుని పరిస్థితిని విచారిస్తాడు. స్త్రీలతో యుద్ధం చేయకూడదని ధర్మరాజు చెప్పడంవల్ల ఏమిచేయాలో తోచడం లేందటాడు అర్జునుడు. స్త్రీసైన్యం అతనిని అర్జునుడుగా తెలుసుకొని పాతాళగృహంలో బంధిస్తుంది. ఈ విషయాలన్నీ కృష్ణునికి తెలుస్తాయి. ప్రమీలవేషంలో వచ్చి అర్జునుని ప్రేమించినట్లు నటిస్తాడు. మరల కృష్ణుడుగామారి ప్రమీల అసాధ్యురాలని ఆమెను ప్రేమించడం కష్టమని చెపుతాడు. ఎలాగైనా ఆమెను భార్యగా పొందాలని దానికి సహాయం చేయమని అర్జునుడు కృష్ణుని కోరతాడు. ప్రమీల వేషంలో కృష్ణుడు అర్జునునితో ఉద్యానవనంలో, అంతఃపురంలో గడుపుతున్న విషయం అందరికీ తెలుస్తుంది. స్త్రీరాజ్యాన్ని రక్షించవలసిన తమరాణే మగవారి మాయలో పడిందని, తాము కూడా తమకు నచ్చిన పురుషులను ఎంపిక చేసుకోవాలని స్త్రీ సైన్యంలోని వారంతా భావిస్తారు. అర్జునుని సైన్యంలోని పురుషులలో ఎవరికి తగిన వారిని వారు ఎన్నుకొంటారు. ఇవేమీ తెలియని నిజమైన ప్రమీల ఈ మార్పుకు నివ్వెర పోతుంది. అర్జునునితో యుద్ధం ప్రకటిస్తుంది.

స్త్రీతో యుద్ధం చేయరాదన్న నియమంతో ఇన్నాళ్లు ప్రమీలను ప్రేమతో లొంగదీసుకోవాలనుకున్న అర్జునునకు విపత్కర పరిస్థితి ఎదురౌతుంది. ఈ యుద్ధంలో పురుషశక్తి జయిస్తుందో స్త్రీశక్తి జయిస్తుందో చూడాలన్న కుతూహలంతో నారదుడు అర్జునుని యుద్ధానికి పురికొల్పుతాడు. యుద్ధం జరుగుతుంది. దానివల్ల ఉత్పాతా లెదురౌతాయి. యుద్ధ భూమిలో దేవి ప్రత్యక్షమై స్త్రీ పురుషుల కలయిక వల్లనే సృష్టి కొనసాగుతుందని, స్త్రీ శక్తి పురుషశక్తి వేరు వేరుగా మనలేవని, స్త్రీ సామ్రాజ్యాన్ని స్థాపించడమే సృష్టికి విరుద్ధమని చెపుతుంది. అర్జునుని వివాహమాడి స్త్రీపుం శక్తుల సమ్మేళనంతో అభివృద్ధి సాధించమని ప్రమీలను కోరుతుంది. దేవి ఆనతిని పాటించి ప్రమీల అర్జునుని వివాహమాడుతుంది. కథ సుఖాంతమవుతుంది.

స్త్రీలు పురుషులకు బానిసలు కాదని, వారు అన్ని విధాలా మగవారితో సమానమని చాటడానికి ఈ సినిమా ఉపయోగపడుతుంది. అయితే సృష్టి స్త్రీపురుషుల కలయిక వల్లనే కొనగాగడంవల్ల స్త్రీ పురుషులలో ఎవరికి ఎవరూ అధికులు కాదని, ఎవరి ప్రాధాన్యత వారికుంటుందని కూడా ఈ సినిమా నిరూపిస్తుంది. తాను చేసిన పనులన్నీ తన పరాక్రమంతోనేనని నమ్మిన అర్జునుని ఊహ సరికాదని కృష్ణుని సహాయంతోనే అర్జునుడు విజయాలు సాధించాడని కూడా ఈ కథ తెలుపుతుంది. ప్రమీలను వివాహం చేసుకోవాలన్న సందర్భంలో కూడా అర్జునునికి కృష్ణుని సహాయం అవసరమొస్తుంది.

**వీరాభిమన్యు** : రాజ్యలక్ష్మీ పిక్చర్స్‌వారు 1965లో నిర్మించిన ఈ చిత్రానికి సముద్రాల రచన చేయగా దర్శకత్వం వహించినవాడు మధుసూదనరావు. శ్రీకృష్ణుడు నిర్వికారంగా నడుస్తూ రావడంతో కథ ప్రారంభమవుతుంది. నేపథ్యంలో భగవద్గీత శ్లోకాలు వినిపిస్తాయి. రాబోయే భారతకథకు కృష్ణుడు నిష్పక్షపాతంగా ఫలితాన్నిస్తాడనే భావం ఈ సన్నివేశం ద్వారా కలుగుతుంది. అలా నడుస్తూ కృష్ణుడు సుభద్ర మందిరంలోకి వస్తాడు. ఆ సమయంలో పద్మవ్యూహాన్ని గురించి అర్జునుడు సుభద్రకు వివరిస్తూ ఉంటాడు. అంతలోనే సుభద్ర నిద్రలోకి జారుకోడం వల్ల ఆమె గర్భస్థ శిశువు అర్జునుడు చెప్పిన విషయాలను వింటూ ఊకొడుతూ ఉంటాడు. అప్పటికి పద్మ వ్యూహంలోకి ఎలా వెళ్లాలో చెప్పడం అయిపోయి ఉంటుంది. పద్మవ్యూహం నుండి బయటకు వచ్చే మార్గాన్ని గురించి అర్జునుడు చెప్పబోతుండగా అప్పుడే కృష్ణుడు వచ్చి అర్జునుని ప్రయత్నాన్ని విరమింపజేస్తాడు. ఆగర్భస్థ శిశువు అభిమన్యుడు. కృష్ణుడిలా అర్జునుని ఆపడం వల్ల అభిమన్యునికి పద్మవ్యూహంలోకి ప్రవేశించడమే తెలిసింది. బయటకు రావడం తెలియదు. దీనికి కారణం జీవుల కర్మపరిపాకాన్ననుసరించి ఫలితాన్నిచ్చే శ్రీకృష్ణుడు.

పాండవుల వనవాసకాలమది. అడవిలో ఉన్న అర్జునుని గురించి సుభద్ర విచారిస్తుంది. వనవాసకాలం తొందరలోనే పూర్తవుతుందని కృష్ణుడామెను ఓదార్చుతాడు. అభిమన్యుడు యుక్తవయస్కుడవుతాడు. చిన్నతనం నుండి అభిమన్యుడికి లక్ష్మణకుమారుడికి ఉప్పులో నిప్పుగా ఉంటుంది. లక్ష్మణకుమారుని తరుముకొంటూ అభిమన్యుడు రథంలో వెళతాడు. మధ్యలో ఉత్తరను చూస్తాడు. 'రంభా ఊర్వశి తలదన్నే రమణీలలామ ఎవరీమె' అనుకుంటాడు. 'ఇంద్రుని చంద్రుని అందాలు ఈతని సొమ్మేకాబోలు.

అనుకొంటుంది. ఒకరిని గురించి ఒకరు తెలుసుకొంటారు. తరువాత అభిమన్యుడు ఘటోత్కచుని కలుసుకొంటాడు. ఉత్తరను దక్కించుకోడానికి ఘటోత్కచుని సాయం కోరతాడు. సోదరుని సహాయంతో అభిమన్యుడు చెలికత్తె వేషం ధరించి ఉత్తర దగ్గరకు వెళ్లి సరదాలు తీర్చుకొంటాడు. అభిమన్యు ఘటోత్కచులిద్దరూ విరటుని నగరానికి వెళ్లి ఉత్తరను తెచ్చే ప్రయత్నంలో బందీలుగా చెరలో పడతారు. చెరలోనే ఉత్తారాభిమన్యులను చిన్న బొమ్మలుగా చేసి సీసాలో పెట్టి అక్కడే వారికొక నవ్యలోకాన్ని సృష్టిస్తాడు ఘటోత్కచుడు. వాళ్లు అక్కడ ఆనందంగా విహరిస్తారు. తరువాత ఘటోత్కచుడు వంటశాలకు వెళ్లి అక్కడ వండి ఉంచిన పదార్థాలను తిని గిన్నెలను వలలుని రూపంలో వంటశాలలో నిద్రిస్తుండిన భీముని మీద వేస్తాడు. భీముడు మేల్కొని ఘటోత్కచుని బాగా కొట్టి సింహద్వారానికి ఆవల పారవేస్తాడు. ఇతడు తన కొడుకని భీమునికి తెలియదు. అలా కింద పడిపోయిన ఘటోత్కచుని సైనికులు బంధించి కట్టెలను పేర్చి కాల్చిచంపే ప్రయత్నం చేస్తారు. ఘటోత్కచుడు పెద్ద పర్వతంలాగా సైనికులంతా చిన్న శలభాల్లాగ కనిపిస్తారు. కట్టెలు మండుతున్న సమయంలో అభిమన్యుడు వచ్చి మంటలలో చిక్కుకున్న ఘటోత్కచుని కాపాడుతాడు.

దుష్ట చతుష్టయ ప్రేరితుడైన సుశర్మ దక్షిణ గోగ్రహణం నిర్వహిస్తాడు. ఈ సందర్భంలో అభిమన్యుడు వచ్చి యుద్ధంచేసి విరటుని గోవులను రక్షిస్తాడు. తమ గోవులను కాపాడిన ఆవీరుని విరాటరాజు గౌరవించి అభిమన్యుడుగా గుర్తిస్తాడు. తన చెల్లెలు ఉత్తరను ఈ వీరునికే ఇచ్చి పెండ్లి చేయాలని ఉత్తరుడు చెపుతాడు. పాండవుల అజ్ఞాతవాసం ముగుస్తుంది. శ్రీకృష్ణుడు కౌరవ సభకు రాయబారిగా వెళ్లి భాగపరిష్కారానికి ప్రయత్నిస్తా నంటాడు. కౌరవసభలో కృష్ణుడు చెప్పవలసిన మాటలను పాండవులు ఎవరికి తోచినట్లు వాళ్లుచెపుతారు. ద్రౌపది 'రాజరాజు పీనుగును కన్నార' చూడాలంటుంది. ధర్మరాజు ఐదుగురు పాండవులకు ఐదూళ్లు ఇచ్చినా సంధిచేసుకొని రమ్మంటాడు. దీనికి అభిమన్యుడు అంగీకరించడు. శ్రీకృష్ణరాయబారం జరుగుతుంది. కృష్ణుడు చెప్పిన హితం కౌరవులకు నచ్చదు. దుష్టచతుష్టయం కృష్ణుని అవమానిస్తారు. సభామధ్యం నుండి గొయ్యి తవ్వి కృష్ణుని అందులో పడేటట్లు ఏర్పాటు చేస్తారు. కూర్చున్న ఆసనంతో పాటు

కృష్ణుడు పాతాళంలో పడిపోతాడు. సభామధ్యంలో నేలను పెళ్లిగించుకొని శ్రీకృష్ణుడు విరాట్ రూపంలో పైకి వస్తాడు. ఆవిరాట్ పురుషుని తేజస్సును చూడలేక అందరూ కండ్లు మూసుకుంటారు. కృష్ణుడు తనను చూడడానికి ధృతరాష్ట్రునికి దివ్య దృష్టిని ప్రసాదిస్తాడు. తాను కాల పురుషుడనని దుర్మార్గులను సంహరించి భూభారం తగ్గించడమే తన అవతార ప్రయోజనమని దుర్మార్గులైన కౌరవులను తానిప్పుడే సంహరించగలనని, వారి మరణం పాండవుల ద్వారా జరగడం విధి నిర్ణయమని సభలో కృష్ణుడు గంభీరంగా చెపుతాడు. రాయబారం విఫలమవుతుంది.

కురుక్షేత్రయుద్ధం నిర్ణయమవుతుంది. ఇరు పక్షాలు సైన్యాలను సమీకరించుకొంటాయి. యుద్ధ భవితవ్యమెలా వుంటుందోనని అంతఃపుర స్త్రీలు గగ్గోలు పడతారు. సుభద్ర యుద్ధాన్ని తప్పించమని కృష్ణుని అడుగుతుంది. యుద్ధం అనివార్యమని, దుర్మార్గులు నశించక తప్పదని అయినా సుభద్ర సంతతివారే రాజ్యపాలకులవుతారని కృష్ణుడామెను ఓదార్చుతాడు. భీష్ముడు కౌరవ పక్షానికి సర్వసైన్యాధిపతిగా నిర్ణయింపబడి పదిరోజులు భయంకరంగా యుద్ధంచేసి అర్జునునిచేత క్షతగాత్రుడై అంపశయ్యాగతుడవుతాడు. తరువాత ద్రోణుడు సేనాధిపతి అవుతాడు. అతడు సేనాధిపతిగా ఉండిన అయిదురోజులు రకరకాల యుద్ధవ్యూహాలను పన్ని పాండవుల సేననలను నేలమట్టం చేస్తాడు. ధర్మరాజును ప్రాణాలతో పట్టి తెమ్మని, ధర్మరాజుతో జూదమాడి మళ్లీ అరణ్యావాసం పంపుతానని దుర్యోధనుడు ద్రోణుని కోరుకుకొంటాడు. ప్రయత్నిస్తానంటాడు ద్రోణుడు. ఆరోజు ద్రోణుడు పద్మవ్యూహం పన్నుతాడు. ప్రవేశ ద్వారం వద్ద సైంధవుడు కాపలా వుంటాడు. అర్జునుని తప్ప మిగిలిన పాండవులను ఒక్కరోజు ఎదిరించగలశక్తి అతనికి శివుని అనుగ్రహం వల్ల కలుగుతుంది. సంశప్తకులతో యుద్ధం వల్ల ఆరోజు అర్జునుడు ఉండడు. అర్జునుడు లేని సమయం కనిపెట్టి ద్రోణుడీ వ్యూహం పన్నుతాడు.

పద్మ వ్యూహాన్ని భేదించడం అసాధ్యమని ధర్మరాజుకుతెలుసు. పద్మవ్యూహంలో ప్రవేశించగల వీరుడు తన పక్షంలో ఎవరున్నారా అని ఆలోచిస్తున్న సమయంలో అభిమన్యుడు వచ్చి తాను ప్రవేశించి కురుసైన్యాన్ని నాశనం చేస్తానంటాడు. మరొక మార్గంలేక ధర్మజుడు సరే నంటాడు. భీమ నకుల సహదేవులు అభిమన్యునికి సహాయంగా పోతామంటారు. ఆనాటి రాత్రి అభిమన్యుని సమరోత్సాహానికి అవధిలేదు. మక్కువకు ప్రతిబంధకము

లంటూ తనభార్య ఉత్తర శరీరంపైగల నగలన్నిటినీ తీసివేస్తాడు. ముక్కర, గాజులు, అందెలు అన్నీ తొలగించి ఆమెను విధవరాలుగా మారుస్తాడు. మరునాటి యుద్ధంలో తన మరణం తరువాత ఆమె కిలాంటి స్థితి కలుగుతుందని ముందే ఊహించినట్లుందిది. యుద్ధంలో పద్మవ్యూహంలో ప్రవేశించిన అభిమన్యుని ఏకాకిని చేసి కౌరవ వీరులంతా దొమ్మీగా అతని మీదికురికి అక్రమంగా చంపేస్తారు. సైంధవుడు దారి కడ్డు నిలవడంతో భీమాదులు లోనికి వెళ్లలేకపోతారు. సాయంకాలం అయిపోతుంది. సంశప్తకులతో యుద్ధం ముగించుకొని కృష్ణార్జునులు వస్తారు. అర్జునునికి అభిమన్యుని మరణం తెలుస్తుంది. తన కుమారుని మరణానికి కారణమైన వాని శిరస్సును సూర్యాస్తమయంలోపల ఖండిచకపోతే తాను అగ్ని ప్రవేశం చేస్తానని శపథంచేస్తాడు. ఇది తెలిసి కౌరవులు సైంధవుని దాచిపెడతారు. దీనిని గమనించిన కృష్ణుడు తన చక్రాన్ని సూర్యబింబానికి అడ్డుగా నిలిపి సూర్యాస్తమయం అయినట్లు భ్రమ కల్పిస్తాడు. సూర్యాస్తమయం అయిందని ఇక అర్జునుడు చితిలో పడతాడని, యుద్ధం సమాప్తమై తమకే జయం కలుగుతుందని సంతోషపడి కౌరవులు సైంధవునితో కలసి బయటకు వస్తారు. తన చక్రాన్ని అడ్డుతొలగించి సూర్యాస్తసమయం కాలేదని, తన బిడ్డను చంపిన సైంధవుడు ఎదురుగా నిలబడి ఉన్నాడని, అతనిని చంపి ప్రతిజ్ఞను నెరవేర్చుకొమ్మని కృష్ణుడు చెప్పగా అర్జునుడు సైంధవుని తలను ఖండిస్తాడు.

అభిమన్యునితో సమానమైన ఘటోత్కచుని మరణంకూడా విచిత్రంగా సంభవిస్తుంది. యుద్ధభూమిలో అగ్నివర్షం కురిపిస్తున్న ఘటోత్కచుని వధించడానికి దుర్యోధనుడు బకుని కుమారుడైన అలంబసుడనే రాక్షసుని పంపిస్తాడు. ఈ రాక్షసుడు ఘటోత్కచుని చేతిలో శలభంలా మాడిపోతాడు. ఆ సమయంలో కర్ణుని చేతిలోని నాగాస్త్రాన్ని ప్రయోగించి ఘటోత్కచుని చంపమంటాడు దుర్యోధనుడు. నాగాస్త్రం అర్జునునికోసం అట్టిపెట్టుకొన్నానని కర్ణుడు చెప్పినా వినక ముందు ఘటోత్కచుని బారినుండి సేనను రక్షించమని దుర్యోధనుడు పట్టుబట్టడంతో కర్ణుడు నాగాస్త్రాన్ని ప్రయోగించి ఘటోత్కచుని సంహరిస్తాడు.

వీరాధివీరుడైన పుత్రుని పోగొట్టుకొన్న తరువాత తనకేమీ మిగలలేదని,

అప్సరసల సేవలు పొందుతున్న అభిమన్యుని దగ్గరకు వెళ్లి పలకరించమని కృష్ణుడు పంపిస్తాడు. అర్జునుడు వెళ్లి పలకరించగా అర్జునుడెవరో తనకు తెలియదంటాడు అభిమన్యుడు. దీనితో అర్జునునిలో కమ్ముకున్న చీకటి తెరలు క్రమంగా తొలిగి పోతాయి. కృష్ణుడు అతనిని చేరదీసి సృష్టి క్రమాన్ని వివరిస్తాడు. సృష్టికి ఆదిమధ్యాంతలయుడు తానేనని తనలోనే సమస్త చరాచర ప్రకృతి ఉందని చెపుతూ సృష్టితో నిండిన తన విరాట్ స్వరూపాన్ని అర్జుననకు చూపిస్తాడు. భగవంతుని స్వరూపం చూచిన అర్జునుని మనస్సులోని ప్రాపంచిక వాసనలు తొలగి కర్తవోన్ముఖుడవుతాడు. తనను తిలకించి యధార్థ జ్ఞానాన్ని పొందుతున్న బద్ధజీవులను ముక్త జీవులు కమ్మని ప్రబోధిస్తూ శ్రీకృష్ణుడు ఆశీర్వదించడంతో కథ సమాప్తమవుతుంది.

**కురుక్షేత్రం :** మాధవీ పద్మాలయా కంబైన్స్‌వారు 1977లో నిర్మించిన ఈ చిత్రానికి కథను జూనియర్ సముద్రాల సమకూర్చగా సంభాషణలను త్రిపురనేని మహారథి రచించారు. ఈ చిత్రంలో పాండవ మధ్యముడైన అర్జునునికి ఎక్కువ ప్రాధాన్యత ఉంది. కథంతా అర్జునుని చుట్టూనే తిరుగుతుంది. అందుకే అర్జునుని సోయగాన్ని వర్ణించే 'ఎగుభుజంబులవాడు' అనే పద్యంతో కథప్రారంభమౌతుంది. సుభద్ర అర్జునుని అందాన్ని నెమరువేసుకొనే సన్నివేశమిది. హస్తినాపురంలో కౌరవ పాండవ కుమారులలో ఎవరిని యువరాజుగా నియమించాలి అనే ప్రశ్న పుడుతుంది. కొందరు దుర్యోధనుని పేరును సూచిస్తే అర్జునుడు వయస్సులో ధర్మరాజే పెద్దవాడు కాబట్టి ఆయననే యువరాజును చేయాలని చూచిస్తాడు. అప్పటి నుండి దుర్యోధనునికి పాండవులపై కక్ష మరింత పెరుగుతుంది. అక్కడ నుండి కథ అతివేగంగా ముందుకు జరుగుతుంది. పాండవుల ఇంద్రప్రస్థనివాసం, రాజసూయం ఇత్యాది ఘట్టాలన్నీ సూచింపబడతాయి. అర్జునుడు తీర్థయాత్రలకు వెళ్తాడు. ఈ సందర్భంలో యతివేషంలో ద్వారకకు వెళతాడు. బలరామకృష్ణులు సుభద్రను యతిసేవలో నియమిస్తారు. యతివేషంలోని అర్జునునికి కన్యగా ఉండిన సుభద్రకు మధ్య మధుర సన్నివేశాలెన్నో జరుగుతాయి. కృష్ణుని సహాయంతో సుభద్రార్జునుల వివాహం జరుగుతుంది. కృష్ణుడే బలరాముని వేషంలో వచ్చి అలా యతివేషంలో వచ్చి మోసంగా సుభద్రను పెండ్లాడినందుకు

ఇంద్రప్రస్థంలో ద్రౌపది అర్జునుని చిత్రపటం పట్టుకొని నన్నుమరిచావా అంటుండగా సుభద్రార్జునులు కనిపిస్తారు. సుభద్రను అర్జునుని భార్యగా తెలిసి ద్రౌపది ఈర్ష్యపడుతుంది. ఈర్ష్యను దిగమింగుకొని ఆరాత్రి సుభద్రను అలంకరించి అర్జునుని గదికి పంపుతుంది. కౌరవ పాండవుల మధ్య భేదం ఎక్కువవుతుంది. పాండవుల నెలాగైనా పరిమార్చాలని కౌరవులు ప్రయత్నిస్తుంటారు. ఖాండవ దహనం జరుగుతుంది. అశ్వసేనుడనే నాగరాజు ఒక అస్త్రంగా మారి తనను ప్రయోగిస్తే అర్జునుని పరిమార్చుతానని కర్ణుని దగ్గరకు వస్తాడు. ఖాండవ దహనంలో తన తల్లిని అర్జునుడు చంపినందుకు పగ తీర్చుకుంటానంటాడు. కర్ణుడు సరేనని ఆ అస్త్రాన్ని గ్రహిస్తాడు. చిన్న పిల్లలుగా ఉన్నపుడే ఘటోత్కచుడు, అభిమన్యుడు కలుసుకుంటారు. తమ సంబంధాలు తెలుసుకొంటారు. కృష్ణుడు జరాసంధుని సంహరించడానికి భీమునితో పాటు అర్జునుని కూడా తీసుకెళతాడు. జరాసంధవధ జరుగుతుంది.

ధర్మరాజు రాజసూయయాగం చేస్తాడు. సుయోధనాది కౌరవులంతా వస్తారు. సుయోధనునికి మయసభ విడిదిగా ఇస్తారు. మయసభలోని శిల్పనర్తకీజనం దుష్టచతుష్టయానికి స్వాగతం చెపుతారు. మయసభలో సుయోధనుని పరాభవం, ద్రౌపది చెలికత్తెల పరిహాసం మొదలైన ఘట్టాలు జరుగుతాయి. లక్ష్మణ కుమారుని మనస్సు ఉత్తర మీద పడిందంటాడు శకుని. ఉత్తరను తరుముకొంటూ లక్ష్మణ కుమారుడు వెళతాడు. కౌరవ సభలో ద్యూతం జరుగుతుంది. జూదంలో ధర్మరాజు రాజ్యంతో పాటు తమ్ములను పాంచాలిని కూడా ఓడిపోతాడు. 12 సంవత్సరాల అరణ్యవాసం ఒక సంవత్సరం అజ్ఞాతవాసం ప్రాప్తిస్తాయి. అంతకుముందే ద్రౌపదిని సభలో అవమానిస్తారు కౌరవులు. దుశ్శాసనుడు ఆమె చీరవిప్పే పయత్నంచేస్తాడు. ఆసందర్భంలో అర్జునుడు కూడా దుశ్శాసనుని చంపుతానని ప్రతిజ్ఞచేస్తాడు. కృష్ణుడామెను ఆకష్టంనుండి కాపాడుతాడు. పాండవులకు రాజ్యభాగం ఇవ్వనంటాడు దుర్యోధనుడు. శ్రీకృష్ణుడు పాండవుల పక్షాన కౌరవ సభకు రాయబారిగా వెళతాడు. ఇరుపక్షాల మధ్య సంధి కుదిరించడానికి ప్రయత్నిస్తాడు. భీష్ముడు కూడా సుయోధనుని సంధికి ఒప్పించమని కర్ణుని కోరతాడు. కర్ణుడాపనికి అంగీకరించడు. సంధి విఫలమవుతుంది. ఆ పక్షం వాళ్లైనా ఈపక్షం వాళ్లైనా యుద్ధంజేసి జయించి రాజ్యాన్ని పాలించుకోవచ్చునని సుయోధనుడు తెగించి చెపుతాడు. కురుక్షేత్ర యుద్ధం నిర్ణయమవుతుంది.

కురుక్షేత్ర యుద్ధంలో మొదటి పదిరోజులు భీష్ముడు సేనాధిపతిగా యుద్ధంచేస్తాడు. పదవరోజు అర్జుననేగాక కృష్ణుని కూడా తన బాణాలతో నొప్పిస్తాడు భీష్ముడు. కోపంతో కృష్ణుడు రథందిగి తానే భీష్ముని చంపుతానని చేత చక్రం ధరిస్తాడు. రౌద్రాకారంతో కనిపించిన కృష్ణుని పరమాత్మగా భావించి భీష్ముడు స్తుతిస్తాడు. చివరకు అర్జునుని నారాచాలకు బలియై శరతల్పగతుడవుతాడు. అర్జునుడు తన బాణంతో పాతాళగంను పైకి పొంగించి భీష్ముని దప్పితీర్చుతాడు. ద్రోణుడు పద్మవ్యూహం పన్నుతాడు. ఆసమయంలో సంశప్తకులతో యుద్ధంచేయడానికి అర్జునుడు వెళతాడు. పద్మవ్యూహంలో చొరగల పాండవ వీరులెవరా అని ధర్మరాజు ఆలోచిస్తున్న సమయంలో అభిమన్యుడు వెళతానంటాడు. పద్మవ్యూహం ప్రవేశ ద్వారం వద్ద సైంధవుడు కాపలా ఉండడం వల్ల మిగిలిన పాండవులెవరూ లోనికి పోలేకపోతారు. లోపలికి వెళ్లిన అభిమన్యుని ఒంటరివాణ్ణిచేసి కౌరవులంతా చుట్టూచేరి అక్రమంగా వధిస్తారు. అర్జునుడు వచ్చి తన కుమారుని మరణానికి కారణమైన వాని తలను సూర్యాస్తమయంలోగా ఖండిస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. సూర్యాస్తమయం కాకుండా తన చక్రంతో సూర్యబింబం కనబడకుండా చేస్తానని సూర్యాస్తమయం అయిపోయిందని సైంధవుడు బయటికి వస్తాడని, అప్పుడు అర్జునుడు సైంధవుని శిరస్సును ఖండించవచ్చునని కృష్ణుడు అర్జునునికి ఉపాయం చెపుతాడు. ఆ ఉపాయం ప్రకారం సైంధవుని తల తెగిపోతుంది.

ఆ రాత్రి పులిమీద పుట్రలాగా ఘటోత్కచుడు కౌరవసేనను వికలం చేస్తాడు. దుర్యోధనుడు బకుని కుమారుడైన అలంబసుడనే రాక్షసుని ఘటోత్కచుని మీదికి పంపుతాడు. ఆరాక్షసుడు ఘటోత్కచుని చేతిలో దారుణంగా మరణిస్తాడు. కర్ణుని నాగాస్త్రంతో ఘటోత్కచుడు విగత జీవుడవుతాడు. తన వారంతా మరణించారని, తనకేమాత్రం విజయకాంక్ష లేదని మరలా శోకమానుసుడైన అర్జునుని కర్తవ్యోన్ముఖుని చేయడం కోసం శ్రీకృష్ణుడు మరలా కర్తవ్యబోధ చేయడంతో కథ సమాప్తమవుతుంది.

**ఏకవల్య :** కౌముదీ పిక్చర్స్‌వారు 1982లో నిర్మించిన ఈ చిత్రానికి కథా సంవిధానం మాటలు కొండవీటి వెంకటకవి సమకూర్చగా పాటలు - పద్యాలు మల్లెమాల రాశారు. నిర్మాత ఎం.ఎస్.రెడ్డికాగా దర్శకత్వం వహించినవారు విజయారెడ్డి. భారతాదిపర్వంలోగల ఏకలవ్యుని కథ చాల

చిన్నది. ఏకలవ్యుడను ఒక ఎఱుకలవాడు విద్యకోసం ద్రోణుని దగ్గరకు వెళ్ళి నిషాదుడనే నెపంతో తిరస్కృతుడై పట్టువదలక ద్రోణుని బొమ్మను మట్టితో చేసి గురువుగా భావించి అతివినయంగా అస్త్రవిద్యారహస్యాలన్ని నేర్చుకొంటాడు. ఈ విషయం తెలిసిన పాండవులు అతని విలువిద్యాకౌశలానికి మత్సరగ్రస్థులవుతారు. అర్జునుని ప్రేరణతో ద్రోణుడు ఏకలవ్యుని దగ్గరకు వెళ్ళి గురుదక్షిణగా అతని కుడిచేతి బొటనవేలు ఖండించి ఇమ్మని అడుగుతాడు. ఏకలవ్యుడు అలాగేచేసి గురుదక్షిణ చెల్లిస్తాడు. దీనివల్ల ఏకలవ్యుడు విలువిద్య కలిమికి హీనుడుకాగా అర్జునునికి విలువిద్యలో పోటీలేకుండా పోతుంది. భారతంలో కనిపించే ఈ కథ వివరాలింతే.[12]

ఈ చిన్న కథను పెంచి అనేక కల్పనలు చేసి సినిమా కథగా రూపొందించారు. శివలింగం ముందు ఏకలవ్యుని ప్రభాత నృత్యంతో సినిమా ప్రారంభమవుతుంది. ఈ నృత్యం అతని దినచర్యలో ఒక భాగం. దీనితోనే అతని రోజు మొదలవుతుంది. ఏకలవ్యుడు వీరుడు. గౌరి అనే ఒక యువతికి బావ. గూడెంవాళ్లకు నిజాయితీ పరుడు. కన్నప్పలాగా ఇతడు కూడా శివభక్తుడు. అడవిలో దొంగతనాలు అరికట్టడం, తల్లులు లేని మృగాల పిల్లలను పోషించడం ఇతడు చేసే పనులు. ద్రోణుని భార్య ధనుర్వేదశాస్త్రం తాటాకు పుస్తకాన్ని తీసుకొని కొడుకు అశ్వత్థామతో హస్తినకు వెళుతూ మార్గమధ్యంలో అడవిలో దొంగల బారిన పడుతుంది. ఏకలవ్యుడు రక్షిస్తాడు. ఆమెతో హస్తిన వరకు వెళ్ళి దిగబెడతాడు. విషయం తెలుసుకున్న ద్రోణుడు ఏకలవ్యుని ఆశీర్వదిస్తాడు.

ద్రోణుడు కౌరవ పాండవ కుమారులకు శస్త్రాస్త్ర విద్యలు నేర్పడానికి కొలువులో కుదురుతాడు. దుర్యోధనుడు కర్ణుని తీసుకొని వచ్చి అతనికి కూడా ధనుర్విద్యనేర్పమంటాడు. ఏకలవ్యుని తల్లి అతనికి గౌరితో పెళ్ళి చేయాలని భర్త సమాధి దగ్గరకెళ్ళి అనుమతి కోరుతుంది. ఏకలవ్యుడు జగదేక ధనుర్ధరుడైన తరువాతనే పెళ్ళిచేయమని భర్త అన్నట్లు ఆమెకు తోస్తుంది. ఈ విషయం కొడుకుకు చెపుతుంది. ఏలవ్యుడు ద్రోణుని దగ్గర విద్య నేర్చుకోడానికి హస్తినకు వెళతాడు. అక్కడ కురు పాండవ కుమారుల అస్త్ర విద్యా ప్రదర్శన జరుగుతూ ఉంటుంది. కర్ణుడు ఛేదించిన లక్ష్యాన్ని అర్జునుడు ఛేదించలేక పోతాడు. అస్త్ర విద్యా ప్రదర్శనలో కలత పడిన ఒక ఏనుగు అక్కడున్న జనాన్ని చెల్లాచెదరు చేస్తుంది. ఏకలవ్యుడు దానిని బంధించి ద్రోణుని దృష్టిలో పడతాడు. తన భార్యను దొంగల బారినుండి కాపాడిన వీరుడని తెలుస్తుంది. తనకు విలువిద్య నేర్పమని ఏకలవ్యుడు గురువును

అర్థించగా గురువు సమ్మతిస్తాడు. దీనికి అర్జునుడు ఒప్పుకోడు. అర్జునుని పట్టుదల కారణంగా గురువు ఏకలవ్యునికి విద్యనేర్పే అవకాశం లేకుండాపోతుంది. నాగరికత నేర్చుకోవాలని వస్తే కుల మాత్సర్యం కలిగిస్తున్నావని, విద్యలు అగ్రకులాల వారికే సొంతంకావని, అలా అనుకుంటే పతనం తప్పదని అర్జునుని హెచ్చరించి తిరిగి గూడెం చేరుకుంటాడు ఏకలవ్యుడు. ఆ నాగరికతలో ఇమడలేక వచ్చానని మరదలుతో చెపుతాడు. ఆమె పట్టుదలతో ఎలాగైనా విలువిద్య సాధించమని ప్రోత్సహిస్తుంది.

ఏకలవ్యుడు ద్రోణుని బొమ్మను మట్టితో చేసి ప్రతిష్ఠించి ప్రదక్షిణచేసి గురువుగా భావించి పట్టుదలతో విలువిద్య నేర్చుకొనే ప్రయత్నం చేస్తాడు. శివుడు సత్యలోకం వెళ్లి ఏకలవ్యునికి విలువిద్య ప్రసాదించమని సరస్వతిని కోరతాడు. ఆమె కటాక్షిస్తుంది. సంవత్సరం లోపల కొడుకు విలువిద్యా విశారదుడై రావాలని అలా రాకపోతే తాను అగ్గిలో ప్రవేశిస్తానని ప్రతిజ్ఞచేసిన ఏకలవ్యుని తల్లి సంవత్సరంలోని చివరిరోజు అగ్గిలో ప్రవేశించబోతుంది. అంతలోనే ఏకలవ్యుడు వచ్చి ఆమెను కాపాడుతాడు. కౌరవులు పాండవులు వేటకు వస్తారు. వారివేట కుక్కను ఏకలవ్యుడు శబ్దభేదితో చంపుతాడు. గడ్డిమేసే మృగాలను వేటాడకూడదంటాడు. అర్జునుడు అధిక్షేపిస్తాడు. తనగురువైన ద్రోణుని ఆశీర్వాదంతో మీ పొగరణుస్తానంటూ ఏకలవ్యుడు తన బాణంతో ప్రభంజనాన్ని సృష్టించి పాండవులందరిని ఆగాలిలో కొట్టుకొని పోయేటట్లు చేస్తాడు. వాళ్లంతా హస్తినకు వెళ్లి ఏకలవ్యుని విలువిద్యను ఎలాగైనా అతని నుండి దూరం చేయాలని ప్రయత్నిస్తుంటారు.

ఏకలవ్యునికి వివాహం జరుగుతంది. హస్తినలో అర్జునుని మనస్సు వేడెక్కిపోతుంది. గురువుగారి నెలాగైనా ప్రసన్నంచేసుకొని ఆయన ద్వారా ఏకలవ్యుని విలువిద్యను నాశనం చేయాలని ప్రయత్నిస్తాడు. ద్రుపదుని బంధించి తెచ్చి గురుదక్షిణ చెల్లిస్తాడు అర్జునుడు. గురువు తృప్తిపడతాడు. ఆసమయంలో మెల్లగా అర్జునుడు ఏకలవ్యుని విషయం చెప్పి అతనివల్ల తాను జగదేకధనుర్ధరుడు కాలేక పోతున్నానంటాడు. అర్జునుని జగదేక ధనుర్ధరుడుగా చేస్తానంటాడు గురువు. అదిసాధ్యం కావాలంటే గురు దక్షిణగా ఏకలవ్యుని కుడిచేతి బొటనవేలును కోరాలని ద్రోణునికి చెపుతాడు అర్జునుడు. ద్రోణుడు ఏకవ్యుని గూడెం వెళతాడు. గురువుగారికి ఎన్నో సపర్యలు చేస్తాడు ఏకలవ్యుడు. ద్రోణుడు తన భర్త తలమీద చేయిపెట్టి దగ్ధంచేసినట్లు ఏకలవ్యుని

భార్య ఆరాత్రి కలగంటుంది. గురువు ఏమి అడిగినా ఇవ్వవద్దని హితం చెపుతుంది భర్తకు. మరుసటి రోజు అదే జరిగింది.

ఒకనాడు అర్జునుడు వచ్చి తన శిష్యకోటిలో ప్రథముడుగా కావాలన్నప్పుడు తథాస్తు అన్నానని, కాని ఆస్థానాన్ని ఇప్పుడు ఏకలవ్యుడు ఆక్రమించాడని దానివల్ల తన మాటకు భంగం ఏర్పడిందని ద్రోణుడు ఏకలవ్యుని ముందు బాధపడతాడు. అందుకు తానేమిచేయాలో చెప్పమంటాడు ఏకలవ్యుడు. ద్రోణుడు తనకు గురుదక్షణగా ఏకలవ్యుని కుడిచేతి బొటనవేలుకోసి ఇవ్వమంటాడు. తక్షణం ఏకలవ్యుడాపని చేస్తాడు. అతనికి బొటనవేలు లేకపోవడం వల్ల విలువిద్య దూరమవుతుంది. గురువైన ద్రోణుని పక్షపాతబుద్ధి బయట పడుతుంది. అస్త్ర విద్యాదేవత ప్రత్యక్షమై స్వార్థబుద్ధితో ద్రోణుడు చేసిన ఈ పనివల్ల అతడు భారతయుద్ధంలో అస్త్రసన్యాసం చేసి మరణిస్తాడని శపిస్తుంది. గురుశిష్యుల సంబంధానికి ఏకలవ్యుని శిష్యభక్తి ప్రతీకగా నిలిచి పోతుందని చెపుతూ ద్రోణుడు ఆచోటును వీడి వెళ్లిపోతాడు. తనకు బొటనవేలు లేక పోయినా భిల్లవీరులకు విలువిద్యనేర్పి వాళ్లను గొప్ప వీరులుగా తీర్చి తన తండ్రి ఆశయాన్ని నెరవేర్చుతానని ఏకలవ్యుడు తల్లికి చెపుతాడు. కథ సుఖాంతమో లేక దుఃఖాంతమో తెలియకుండా ముగుస్తుంది.

**మరికొన్ని భారత కథా చిత్రాలు :** 1936లో లక్ష్మి ఫిలింస్‌వారు 'ద్రౌపదీ మాన సంరక్షణ' అనే సినిమా తీశారు. ఈ సినిమాలో బళ్లారి రాఘవ దుర్యోధనుడుగా నటించాడు. ద్రౌపదీ వస్త్రాపహరణ నాటకం ఈ సినిమాకు మూలం. అదే సంవత్సరంలో సరస్వతీ టాకీస్‌వారు 'ద్రౌపదీ వస్త్రాపహరణం' అనే పేరుతో మరొక సినిమా తీశారు. ఈ చిత్రంలో కృష్ణుడుగా సి.యస్.ఆర్ ఆంజనేయులు, ద్రౌపదిగా కన్నాంబ నటించారు. ఈ చిత్రం బాగా విజయవంతమైంది.[13] 1943లో ప్రతిభావారు నిర్మించిన సంగీత భరిత పౌరాణిక చిత్రం 'గరుడ గర్వభంగం'. గరుడుని కథ నన్నయ భారతం ఆదిపర్వం ద్వితీయాశ్వాసంలో ఉంది. ఈ సినిమాకథ భారత కథకాదు. శ్రీరాముడికి హనుమంతుడంటే ఎక్కువ ఇష్టమా అనే విషయం ఈ సినిమాకు ఇతివృత్తం. 1938లో నిర్మితమైన 'కచదేవయాని'కి నన్నయ భారతం ఆదిపర్వం తృతీయాశ్వాసంలోని కథ ఆధారం. ఇలా 1950కి ముందు భారత కథలెన్నో సినిమాలుగా వచ్చాయి. వీటన్నిటికి అప్పటికి ప్రచారంలో ఉండిన పౌరాణిక నాటకాలే ప్రేరణ.

## సూచికలు


1. తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీలనం. పుట - 47
2. వ్యాస భారతం - ఆదిపర్వం. 1-62, 63
3. డా|| అప్పజోడు వెంకటసుబ్బయ్యగారి 'మహాభారతంలో మానవుడు' వ్యాసం, 1996. సహస్రావధాన సంచిక.
4. నాల్గవ అధ్యాయం - 7, 8 శ్లోకాలు
5. దశావతార తత్త్వవిశ్లేషణ పుట 59
6. అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయమై<br>సుమహద్వర్గ చతుష్క పుష్ప వితతిన్ శోభిల్లి కృష్ణార్జునో<br>త్తమ నానాగుణ కీర్త నార్ధ ఫలమై ద్వైపాయనోద్యానజా<br>త మహా భారత పారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై.<br>ఆదిపర్వం 1-66
7. తెలుగు సాహిత్య సమీక్ష. రెండవ సంపుటం. పుట - 240
8. ఈ వివరాలు 'తెలుగు నాటక వికాసం' నుండి గ్రహింపబడినాయి. పుట - 248
9. జైమిని భారతం - సప్తమాశ్వాసం
10. జైమిని భారతం - పంచమాశ్వాసం
11. తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీలనము. పుట - 31
12. ఆదిపర్వంలో పంచమాశ్వాసంలో 231 నుండి 244 వరకుగల గద్యపద్యాలు
13. ఈ వివరాలు కె.ఎన్.టి శాస్త్రిగారి 'అలనాటి చలన చిత్రం' అనే గ్రంథం నుండి గ్రహింపబడినాయి.




# భారతేతి వృత్త సినిమాలు - జానపదాంశాలు

భారత దేశంలో రెండురకాల సంస్కృతులున్నాయి. ఒకటి - జానపద సంస్కృతి. రెండు - పాశ్చాత్య సంస్కృతి. ఇప్పటి వారికి పాశ్చాత్య సంస్కృతి అంటే ఏమిటో, ఎలా ఉంటుందో తెలుసు. ఇదే భారతీయ సంస్కృతి అని వాళ్లు భ్రమిస్తున్నారు కూడా. వాళ్లకు సంస్కృతితో అవసరంలేదు. వారిదొక బండబ్రతుకు. జానపద సంస్కృతి వీళ్లకు బాగా తెలియదు. ఇప్పుడు శిష్టులనబడే వాళ్లున్నారు. వీళ్లంతా అక్షర జ్ఞానమున్నవాళ్లు. శిష్టత అనేది భాషాసాహిత్యాలకు సంబంధించినమాట. జానపదాలంటే పల్లెప్రాంతాలు. జానపద సాహిత్యమంటే పల్లె ప్రాంతాల్లో పురుడు పోసుకున్న సాహిత్యం. జానపద సాహిత్య పరిశోధకులు దీనికి అజ్ఞాత కర్తృత్వం, మౌఖికప్రచారం. జనప్రియత్వం లక్షణాలుగా ఉంటాయని చెప్పారు. జ్ఞాత కర్తృత్వం, గ్రంథస్థ ప్రచారం ఉంటే శిష్టసాహిత్యమైపోతుంది. జనప్రియత్వమన్నది రెండిటా సమానం. జనప్రియత్వం లేని సాహిత్యం ఎంతో కాలం నిలవదు. ఇక భాషా సాహిత్యాల దృష్టితో పరిశీలిస్తే వ్యాకరణ విరుద్ధంకాని భాష, ఆలంకారిక శైలి ఉంటే శిష్టసాహిత్యమవుతుంది. స్థూలంగా జానపద శిష్టసాహిత్యాలకు గల భేదమిది.

లక్షణాలకు ఒదిగేభాష అలంకార ప్రయోగం జానపదాలలోని అట్టడుగు ప్రజలు పాడుకొనే జానపదగీతాలలో కూడా ఉంటాయి. ఈ లక్షణాలు శిష్టసాహిత్యంలో తప్పనిసరి కాబట్టి 'జానపదీయత' రచననుబట్టి, ఇతివృత్తానిబట్టి ఉండనవసరంలేదని స్పష్టపడుతుంది. జానపదీయత రచయితల మనస్సును బట్టి ఉంటుంది. జానపద స్పృహ కొందరిలో ఎక్కువగా ఉండవచ్చు. కొందరిలో తక్కువగా ఉండవచ్చు. ఎక్కువగా ఉన్నవారు సహజత్వానికి దగ్గరగాను, తక్కువగా ఉన్నవారు కొంచెం దూరంగాను ఉంటారని అనుకోవాలి. సహజత్వమంటే జాతిని నడిపే విశ్వాసాల, ఆచారవ్యవహారాల సమాహారం. ఇది సంస్కృతికి సంబంధించిన విషయం. భారతీయ సంస్కృతి రక్తగతంగా ఉన్న ఎవరు రాసినా ఆరాతలో తప్పనిసరిగా ఆసంస్కృతి లక్షణాలుంటాయి. పర సంస్కృతికి ఎంత పరవశుడైన రచయిత అయినా సరే తన మాతృసంస్కృతి నుండి దూరంగా పోలేడు. అందుకే భారతీయ సంస్కృతి ఇంకా బతికి

ఉంది. ఎప్పటికీ సజీవంగానే ఉంటుంది. తెలుగులో శిష్టసాహిత్యం నన్నయ భారతం నుండి వచ్చిందని ఒక స్థూలాభిప్రాయముంది. నన్నయ భారతాన్ని బాగా పరిశీలిస్తే ప్రాచీన కాలం నుండి ఉన్న విశ్వాసాలు శిష్టీకరణ పొందినట్లు కనిపిస్తుంది. భారతంలోని 'దేవరన్యాయం' దీనికి మంచి ఉదాహరణ. భారత కాలం నాటికి లేదా వ్యాసుని కాలం నాటికి దేశంలో బాగా వ్యాప్తిలో ఉండిన దేవరన్యాయం భారతంలో గ్రంథస్థమైంది. ఆ తరువాత ఈ పద్ధతి వ్యాప్తిలో లేకపోవడానికి కారణం సాంఘిక వ్యవస్థలో వచ్చిన మార్పులు. జానపద శిష్టరచనలలో మార్పును గుర్తించడం కష్టం. జానపద లక్షణాలు శిష్టుల రచనలలోను శిష్టలక్షణాలు జానపద రచనలలోను ఉంటాయి.

భారతీయ సంస్కృతి జానపద సంస్కృతే. భారతదేశంలో జనపదా లెక్కువ. ప్రాచీన కాలం నుండి ప్రజల ఆలోచనలు, ఆచార వ్యవహారాలు ఒక సంస్కృతి చట్రంలో ఇమిడి తరతరాలకు సంక్రమిస్తున్నాయి. 'కొత్తొక వింత - పాతొకరోత' అన్నసామెత ఈనాటిది. భారతీయ సంస్కృతిలో కొత్త పాతలు లేవు. జానపద సంస్కృతిలో వ్యవసాయం, పశుపోషణ ప్రధానంగా కనిపిస్తాయి. ఈ రెండు వృత్తులకు సంబంధించిన అనేక విషయాలు సాహిత్యంలో నిబంధింప బడినపుడు శిష్టుల విషయాలుగా అనిపిస్తున్నాయి. అంతేగాని ఆ వృత్తులు, ఆ వృత్తులతో ముడిపడిన జనజీవనం ఇప్పటికీ ఉంది. ఆధునిక సాంకేతిక ప్రగతి కారణంగా వృత్తులలో కొత్త మార్పులు చోటు చేసుకోవచ్చు. కాని ఆ వృత్తులలోని సహజత్వం ఎప్పటికీ అలాగే ఉంటుంది. శిష్టరచయిత విద్యాగంధంలేని పామరులతో కలసిపోయి వారి ఆటపాటలను, వారి జీవితవిధానాలను వారి జీవితాలలోని వింత వింత సంఘటనలను గ్రంథస్థం చేస్తున్నాడు. ఇలాచేయడానికి ఆ శిష్ట రచయితలోని జానపదీయతే కారణం. జానపద సాహిత్యాన్ని అభిమానించడం అంటే గతాన్ని గుర్తించడమని అర్థం. అలాగే భవిష్యజ్జీవనాన్ని నిర్దేశించడమని కూడా అర్థం.

**పురాణ సాహిత్యం - జానపదీయత :** శిష్టత్వానికి జానపదత్వానికి పెద్ద తేడా లేదు. ఉన్నదల్లా మనస్సులోనే. ఈ రెంటి మధ్య తేడాను గుర్తించడం కూడా మంచిది కాదేమో. ఈ విషయాన్ని ఆనంద కుమారస్వామి మాటల్లో చూద్దాం. "The attempt to distinguish aristoacratic from popu-

lar motifs in traditional literature is fallacious all motifs in traditional art is a folk art in the sense that it is the art of the unanimous people (Jana)"[1] జానపద-సాహిత్యం అజ్ఞాత కర్తృకం. ఆరకంగా చూస్తే అపౌరుషేయాలైన వేదాలను జానపద సాహిత్యంగా పరిగణించవలసి ఉంటుంది. తరువాత కాలంలో ఎప్పుడో ఇవి గ్రంథస్థమైనా జానపదీయత పోలేదు. పుట్టలను గుట్టలను ఆరాధించడం, మేఘానికి మెరుపుకు రూపం కల్పించడం, బలుల సమర్పణద్వారా పరాన్ని సాధించడం మొదలైన విషయాలన్నీ జానపద సంస్కృతిలో భాగాలు. వీటిని వివరించేది జానపదసాహిత్యం. ఆ తరువాత వచ్చిన పురాణ సాహిత్యంలో ఈ లక్షణాలున్నాయి. రైవతకాద్రిని యాదవులు పూజించినట్లు హరివంశ పురాణం చెపుతుంది. యజ్ఞయాగాదులను వర్ణించని పురాణంలేదు. అశ్వమేధ రాజసూయాది యాగాల ప్రస్తావన ప్రబంధ సాహిత్యంలో కూడా ఉంది. ఇలా చూస్తూ పోతే ఎన్నో జానపదాంశాలు పురాణ, కావ్య సాహిత్యంలో ఉన్నట్లు తెలుస్తుంది. దీనికి కారణం జానపద సంస్కృతి సజీవ జన సంస్కృతిగా తరతరాల వారికి వారసత్వంగా సంక్రమించడమే.

పురాణ సాహిత్యం మనకెన్నో విషయాలను చూపుతుంది. కొన్ని విషయాలు హేతుబద్ధంగా ఉంటాయి. కొన్ని విషయాలు హేతువుకు లొంగకుండా ఉంటాయి. దృగ్దీక్షతో సంతానవతులు కావడం, కన్యాత్వం చెడకుండా మాతృత్వం పొందడం, ఒకచోట ఉండి మరొక చోట ప్రత్యక్షం కావడం. మానవులుగా ఉంటూనే స్వర్గం వెళ్ళిరావడం. మానవులైన రాజులు యుద్ధాల్లో దేవతలకు సహాయం చేయడం మొదలైన అద్భుత విషయాలన్నీ పురాణాల్లో మనకు కనిపిస్తాయి. ఈ విషయాలలోని సాధ్యా సాధ్యాలు ఈ సందర్భంలో అనవసర చర్చ. ఇలాంటి అద్భుత విషయ విన్యాసాలన్నీ జానపద రీతులని తెలుసుకోవడం ఇక్కడ అవసరం. భారత దేశంలో ఇతర ప్రక్రియా సాహిత్యం కంటే పురాణ ప్రక్రియా సాహిత్యం అన్ని విధాలా ఎంతో విస్తృతమైంది. దీని ప్రభావం కావ్య సాహిత్యం మీద అంతా ఇంతాకాదు. ఒకవేళ పురాణాలలో పైన చూపిన అద్భుత విన్యాసాలన్నీ కల్పనలుగా గ్రహిస్తే ఇవన్నీ జానపదుల జీవితాలను క్రమబద్ధం చేయడానికి ఉద్దేశించినవిగా అర్థమవుతుంది.

భారతం నుండి వచ్చిందని ఒక స్థూలాభిప్రాయముంది. నన్నయ భారతాన్ని బాగా పరిశీలిస్తే ప్రాచీన కాలం నుండి ఉన్న విశ్వాసాలు శిష్టీకరణ పొందినట్లు కనిపిస్తుంది. భారతంలోని 'దేవరన్యాయం' దీనికి మంచి ఉదాహరణ. భారత కాలం నాటికి లేదా వ్యాసుని కాలం నాటికి దేశంలో బాగా వ్యాప్తిలో ఉండిన దేవరన్యాయం భారతంలో గ్రంథస్థమైంది. ఆ తరువాత ఈ పద్ధతి వ్యాప్తిలో లేకపోవడానికి కారణం సాంఘిక వ్యవస్థలో వచ్చిన మార్పులు. జానపద శిష్టరచనలలో మార్పును గుర్తించడం కష్టం. జానపద లక్షణాలు శిష్టుల రచనలలోను శిష్టలక్షణాలు జానపద రచనలలోను ఉంటాయి.

భారతీయ సంస్కృతి జానపద సంస్కృతే. భారతదేశంలో జనపదా లెక్కువ. ప్రాచీన కాలం నుండి ప్రజల ఆలోచనలు, ఆచార వ్యవహారాలు ఒక సంస్కృతి చట్రంలో ఇమిడి తరతరాలకు సంక్రమిస్తున్నాయి. 'కొత్తొక వింత - పాతొకరోత' అన్నసామెత ఈనాటిది. భారతీయ సంస్కృతిలో కొత్త పాతలు లేవు. జానపద సంస్కృతిలో వ్యవసాయం, పశుపోషణ ప్రధానంగా కనిపిస్తాయి. ఈ రెండు వృత్తులకు సంబంధించిన అనేక విషయాలు సాహిత్యంలో నిబంధింప బడినపుడు శిష్టుల విషయాలుగా అనిపిస్తున్నాయి. అంతేగాని ఆ వృత్తులు, ఆ వృత్తులతో ముడిపడిన జనజీవనం ఇప్పటికీ ఉంది. ఆధునిక సాంకేతిక ప్రగతి కారణంగా వృత్తులలో కొత్త మార్పులు చోటు చేసుకోవచ్చు. కాని ఆ వృత్తులలోని సహజత్వం ఎప్పటికీ అలాగే ఉంటుంది. శిష్టరచయిత విద్యాగంధంలేని పామరులతో కలసిపోయి వారి ఆటపాటలను, వారి జీవితవిధానాలను వారి జీవితాలలోని వింత వింత సంఘటనలను గ్రంథస్థం చేస్తున్నాడు. ఇలాచేయడానికి ఆ శిష్ట రచయితలోని జానపదీయతే కారణం. జానపద సాహిత్యాన్ని అభిమానించడం అంటే గతాన్ని గుర్తించడమని అర్థం. అలాగే భవిష్యజ్జీవనాన్ని నిర్దేశించడమని కూడా అర్థం.

**పురాణ సాహిత్యం - జానపదీయత :** శిష్టత్వానికి జానపదత్వానికి పెద్ద తేడా లేదు. ఉన్నదల్లా మనస్సులోనే. ఈ రెంటి మధ్య తేడాను గుర్తించడం కూడా మంచిది కాదేమో. ఈ విషయాన్ని ఆనంద కుమారస్వామి మాటల్లో చూద్దాం. "The attempt to distinguish aristoacratic from popu-

lar motifs in traditional literature is fallacious all motifs in traditional art is a folk art in the sense that it is the art of the unanimous people (Jana)"[1] జానపద-సాహిత్యం అజ్ఞాత కర్తృకం. ఆరకంగా చూస్తే అపౌరుషేయాలైన వేదాలను జానపద సాహిత్యంగా పరిగణించవలసి ఉంటుంది. తరువాత కాలంలో ఎప్పుడో ఇవి గ్రంథస్థమైనా జానపదీయత పోలేదు. పుట్టలను గుట్టలను ఆరాధించడం, మేఘానికి మెరుపుకు రూపం కల్పించడం, బలుల సమర్పణద్వారా పరాన్ని సాధించడం మొదలైన విషయాలన్నీ జానపద సంస్కృతిలో భాగాలు. వీటిని వివరించేది జానపదసాహిత్యం. ఆ తరువాత వచ్చిన పురాణ సాహిత్యంలో ఈ లక్షణాలున్నాయి. రైవతకాద్రిని యాదవులు పూజించినట్లు హరివంశ పురాణం చెపుతుంది. యజ్ఞయాగాదులను వర్ణించని పురాణంలేదు. అశ్వమేధ రాజసూయాది యాగాల ప్రస్తావన ప్రబంధ సాహిత్యంలో కూడా ఉంది. ఇలా చూస్తూ పోతే ఎన్నో జానపదాంశాలు పురాణ, కావ్య సాహిత్యంలో ఉన్నట్లు తెలుస్తుంది. దీనికి కారణం జానపద సంస్కృతి సజీవ జన సంస్కృతిగా తరతరాల వారికి వారసత్వంగా సంక్రమించడమే.

పురాణ సాహిత్యం మనకెన్నో విషయాలను చూపుతుంది. కొన్ని విషయాలు హేతుబద్ధంగా ఉంటాయి. కొన్ని విషయాలు హేతువుకు లొంగకుండా ఉంటాయి. దృగ్దీక్షతో సంతానవతులు కావడం, కన్యాత్వం చెడకుండా మాతృత్వం పొందడం, ఒకచోట ఉండి మరొక చోట ప్రత్యక్షం కావడం. మానవులుగా ఉంటూనే స్వర్గం వెళ్లిరావడం. మానవులైన రాజులు యుద్ధాల్లో దేవతలకు సహాయం చేయడం మొదలైన అద్భుత విషయాలన్నీ పురాణాల్లో మనకు కనిపిస్తాయి. ఈ విషయాలలోని సాధ్యా సాధ్యాలు ఈ సందర్భంలో అనవసర చర్చ. ఇలాంటి అద్భుత విషయ విన్యాసాలన్నీ జానపద రీతులని తెలుసుకోవడం ఇక్కడ అవసరం. భారత దేశంలో ఇతర ప్రక్రియా సాహిత్యం కంటే పురాణ ప్రక్రియా సాహిత్యం అన్ని విధాలా ఎంతో విస్తృతమైంది. దీని ప్రభావం కావ్య సాహిత్యం మీద అంతా ఇంతాకాదు. ఒకవేళ పురాణాలలో పైన చూపిన అద్భుత విన్యాసాలన్నీ కల్పనలుగా గ్రహిస్తే ఇవన్నీ జానపదుల జీవితాలను క్రమబద్ధం చేయడానికి ఉద్దేశించినవిగా అర్థమవుతుంది.

నారదీయ పురాణంలోని -

"పురాణ పురుషాజ్జాతం యథేదం జగదద్భుతమ్
తథేదం వాఙ్మయం జాతరో పురాణేభ్యోన సంశయః"

అనే శ్లోకం ఈ విషయాన్ని నిరూపిస్తుంది. "పురాణగాథలు పుట్టడంలో ప్రధాన లక్ష్యం ఆచార సంప్రదాయాల మీద కథాకల్పనల ద్వారా శ్రోతలలో భయ భక్తులు కల్పించడం. ........ ......... ....... సమాజంలోని వ్యక్తుల కార్యకలాపాల్ని క్రమబద్ధం చెయ్యడం, ఆచార కాండతో సమన్వయించడం మాత్రం అనివార్యంగా ప్రపంచంలో అన్నిచోట్ల కనిపిస్తున్న పురాణగాథల లక్షణాలు"[2].

ప్రాచీన కాలంలో సాహిత్యం మౌఖికంగా ప్రచారమైంది. శ్రోతలను ఆకట్టుకోవాలంటే పౌరాణికులు లేదా కథకులు వారికి అద్భుతమైన కథలు చెప్పాలి. దేవ దానవ మానవ లోకాలకు చెందిన కథలు చెప్పి వాటి ద్వారా సంస్కృతీ ఛాయలను ప్రదర్శించి వారిలో నిలపాలి. మానవుడికి ప్రయత్నిస్తే అసాధ్యం లేదని చెప్పి దేవతలకు మానవులు యుద్ధాల్లో సహాయపడిన కథలు చెప్పాలి. ఈ విషయాలు వినడానికి ఆశ్చర్యంగా అద్భుతంగా ఉంటాయి. ఈ సాహస కథలు వినిన మానవులే తరువాత వీరులైనారు. ఎన్నో అద్భుత కార్యాలు నిర్వహించారు. ప్రాచీన సంస్కృతిని పదిలపరిచారు. పౌరాణిక కథలు కలిగించిన ఫలితమిదే. అద్భుత కథలు చెప్పడంలో జానపదత్వముంది. కథలో అనుకోని మలుపులు, అద్భుతాలు లేకుంటే శ్రోతలు వినరు. అందుకే పురాణానంతర కాలంలో జానపద కథల ప్రచారం బాగా సాగింది. కథ చెప్పడమంటే జానపద కథ చెప్పడమే. ఈ కథలు రాజుల కథలే కానక్కరలేదు. సాహసంతో కూడిన సామాన్యుల కథలు కూడా జానపద కథలే. ఈ వివరాల ననుసరించి పురాణాలు జానపద కథలను ప్రచారం చేయడానికే పుట్టాయని చెప్పవలసి ఉంటుంది. ఇక్కడొక విషయం గుర్తించాలి. పురాణ యుగంలోని సంఘంలో ప్రచారం పొందుతూ ఉండిన జానపద కథలన్నీ పురాణాలలో గ్రంథస్థమైనాయి. పౌరాణికులు వీటిని బాగా వివరించి చెప్పి వీటికి తరిగిపోని జానపదత్వాన్ని కలిగించారు.

అద్భుత కథా ప్రదర్శనతో పాటు పురాణాలు చేసిన పని మరొకటుంది. అవ్యక్త స్థితి నుండి సృష్టి జరిగి ఎలా వికసించిందో, ఆసృష్టిలో మానవుల

సంగతి ఏమిటో చెప్పే ప్రయత్నం చేశాయి పురాణాలు. పురాణం అనే మాటకు అమరసింహుడు ఇచ్చిన నిర్వచనం దీనిని నిరూపిస్తుంది[3]. ఇది కథలు వినడంతో పాటు కథలలోని అంతస్సారాన్ని గ్రహించడానికి, మానవమేధ కందని విషయాలను దివ్యత్వంతో సాధించవచ్చునని తెలుసుకోడానికి దోహదం చేసింది. ఈ రకంగా తత్త్వ జిజ్ఞాసకు పునాది ఏర్పడి వేదాంత చర్చలకు దారి చూపబడింది. ఇవన్నీ జానపదుల ఆలోచనలకు లోబడిన విషయాలే. ఈ విషయాలే తరువాత శిష్టత్వం పొందాయి. ఇతిహాసాలలోని విషయాలన్నీ పురాణాలలోకి వచ్చాయి. పౌరాణిక విషయాలన్నీ దివ్యమైనవనే భావన ఏర్పడింది. పామర శ్రోతల విషయంలో దివ్యమైన అంటే అద్భుతమైన అని అర్థం. కథలన్నీ దివ్యమైనవి కాబట్టి ఇవి ఎందుకిలా జరిగాయి అనే ప్రశ్నలు పుట్టలేదు. దివ్యత్వమనేది సహజత్వంగా అర్థంచేసుకోబడింది. సహజత్వమే జీవన విధానం. పురాణాలను గురించి జానపదుల భావన ఇది.

మహాభారతం మానవ జాతి చరిత్రను, వికాసాన్ని చెప్పే చారిత్రక గ్రంథం. ఈ గ్రంథంలో ఉన్నన్ని పాత్రలు, పాత్రల మనస్తత్వాలు, జానపదాంశాలు మరొక గ్రంథంలో లేవనడం వాస్తవానికి దగ్గరమాట. భారత పాత్రలు మానవత్వంలోని మహత్వాన్ని దివ్యత్వంలోని సహజత్వాన్ని ప్రదర్శిస్తాయి. పాండవుల తండ్రులు దేవతలు, తల్లులు మానవకాంతలు. తల్లిదండ్రుల స్వభావం రావడం వల్ల వీళ్లలో దైవత్వం, మానవత్వం రెండూ వచ్చాయి. ఈ లక్షణమే జానపదం. భారత కథ వినే శ్రోతలకు ఇదొక అద్భుతంగా తోస్తుంది. కర్ణుడి విషయమూ ఇంతే. పాండవులకు లేని మరొక గొప్ప లక్షణం కర్ణుడికుంది. కర్ణుడు సహజ కవచకుండల శోభితుడు. పౌరాణికుడికి ఈ విషయం చెప్పి శ్రోతలను అద్భుత ప్రపంచంలోకి తీసుకెళ్లే సౌలభ్యముంది. కుంతికి చెవి నుండి పుట్టినవాడు కావడంతో ఇతనికి కర్ణుడని పేరు వచ్చినట్లు జానపదులు భావిస్తారు. ఇది అసహజం కావచ్చు. కాని ఆపాత్రలోని దివ్యత్వాన్ని వెలికి తెచ్చే మాటఇది. కర్ణుడికి 'కానీనుడు' అంటే కన్యకు పుట్టినవాడు అని మరొక పేరుంది. మూల భారతం సూర్యుని వరం వల్ల కుంతికి కర్ణుడు జన్మించినట్లు చెప్పింది. ఎలా జన్మించాడో చెప్పలేదు. అయోనిజుడా లేక యోనిజుడా అన్న విషయ ప్రస్తావనలేదు. దీనికి జానపదుడు వివరణ కల్పించాడు. కుంతి చెవిద్వారా కర్ణుడు జన్మించినట్లు చెప్పి సందేహ

నారదీయ పురాణంలోని -

"పురాణ పురుషాజ్జాతం యథేదం జగదద్భుతమ్
తథేదం వాఙ్మయం జాతరో పురాణేభ్యోన సంశయః"

అనే శ్లోకం ఈ విషయాన్ని నిరూపిస్తుంది. "పురాణగాథలు పుట్టడంలో ప్రధాన లక్ష్యం ఆచార సంప్రదాయాల మీద కథాకల్పనల ద్వారా శ్రోతలలో భయ భక్తులు కల్పించడం. ........ ......... ....... సమాజంలోని వ్యక్తుల కార్యకలాపాల్ని క్రమబద్ధం చెయ్యడం, ఆచార కాండతో సమన్వయించడం మాత్రం అనివార్యంగా ప్రపంచంలో అన్నిచోట్ల కనిపిస్తున్న పురాణగాథల లక్షణాలు"[2].

ప్రాచీన కాలంలో సాహిత్యం మౌఖికంగా ప్రచారమైంది. శ్రోతలను ఆకట్టుకోవాలంటే పౌరాణికులు లేదా కథకులు వారికి అద్భుతమైన కథలు చెప్పాలి. దేవ దానవ మానవ లోకాలకు చెందిన కథలు చెప్పి వాటి ద్వారా సంస్కృతీ ఛాయలను ప్రదర్శించి వారిలో నిలపాలి. మానవుడికి ప్రయత్నిస్తే అసాధ్యం లేదని చెప్పి దేవతలకు మానవులు యుద్ధాల్లో సహాయపడిన కథలు చెప్పాలి. ఈ విషయాలు వినడానికి ఆశ్చర్యంగా అద్భుతంగా ఉంటాయి. ఈ సాహస కథలు విన్న మానవులే తరువాత వీరులైనారు. ఎన్నో అద్భుత కార్యాలు నిర్వహించారు. ప్రాచీన సంస్కృతిని పదిలపరిచారు. పౌరాణిక కథలు కలిగించిన ఫలితమిదే. అద్భుత కథలు చెప్పడంలో జానపదత్వముంది. కథలో అనుకోని మలుపులు, అద్భుతాలు లేకుంటే శ్రోతలు వినరు. అందుకే పురాణానంతర కాలంలో జానపద కథల ప్రచారం బాగా సాగింది. కథ చెప్పడమంటే జానపద కథ చెప్పడమే. ఈ కథలు రాజుల కథలే కానక్కరలేదు. సాహసంతో కూడిన సామాన్యుల కథలు కూడా జానపద కథలే. ఈ వివరాల ననుసరించి పురాణాలు జానపద కథలను ప్రచారం చేయడానికే పుట్టాయని చెప్పవలసి ఉంటుంది. ఇక్కడొక విషయం గుర్తించాలి. పురాణ యుగంలోని సంఘంలో ప్రచారం పొందుతూ ఉండిన జానపద కథలన్నీ పురాణాలలో గ్రంథస్థమైనాయి. పౌరాణికులు వీటిని బాగా వివరించి చెప్పి వీటికి తరిగిపోని జానపదత్వాన్ని కలిగించారు.

అద్భుత కథా ప్రదర్శనతో పాటు పురాణాలు చేసిన పని మరొకటుంది. అవ్యక్త స్థితి నుండి సృష్టి జరిగి ఎలా వికసించిందో, ఆసృష్టిలో మానవుల

సంగతి ఏమిటో చెప్పే ప్రయత్నం చేశాయి పురాణాలు. పురాణం అనే మాటకు అమరసింహుడు ఇచ్చిన నిర్వచనం దీనిని నిరూపిస్తుంది[3]. ఇది కథలు వినడంతో పాటు కథలలోని అంతస్సారాన్ని గ్రహించడానికి, మానవమేధ కందని విషయాలను దివ్యత్వంతో సాధించవచ్చునని తెలుసుకోడానికి దోహదం చేసింది. ఈ రకంగా తత్త్వ జిజ్ఞాసకు పునాది ఏర్పడి వేదాంత చర్చలకు దారి చూపబడింది. ఇవన్నీ జానపదుల ఆలోచనలకు లోబడిన విషయాలే. ఈ విషయాలే తరువాత శిష్టత్వం పొందాయి. ఇతిహాసాలలోని విషయాలన్నీ పురాణాలలోకి వచ్చాయి. పౌరాణిక విషయాలన్నీ దివ్యమైనవనే భావన ఏర్పడింది. పామర శ్రోతల విషయంలో దివ్యమైన అంటే అద్భుతమైన అని అర్థం. కథలన్నీ దివ్యమైనవి కాబట్టి ఇవి ఎందుకిలా జరిగాయి అనే ప్రశ్నలు పుట్టలేదు. దివ్యత్వమనేది సహజత్వంగా అర్థంచేసుకోబడింది. సహజత్వమే జీవన విధానం. పురాణాలను గురించి జానపదుల భావన ఇది.

మహాభారతం మానవ జాతి చరిత్రను, వికాసాన్ని చెప్పే చారిత్రక గ్రంథం. ఈ గ్రంథంలో ఉన్నన్ని పాత్రలు, పాత్రల మనస్తత్వాలు, జానపదాంశాలు మరొక గ్రంథంలో లేవనడం వాస్తవానికి దగ్గరమాట. భారత పాత్రలు మానవత్వంలోని మహత్వాన్ని దివ్యత్వంలోని సహజత్వాన్ని ప్రదర్శిస్తాయి. పాండవుల తండ్రులు దేవతలు, తల్లులు మానవకాంతలు. తల్లిదండ్రుల స్వభావం రావడం వల్ల వీళ్లలో దైవత్వం, మానవత్వం రెండూ వచ్చాయి. ఈ లక్షణమే జానపదం. భారత కథ వినే శ్రోతలకు ఇదొక అద్భుతంగా తోస్తుంది. కర్ణుడి విషయమూ ఇంతే. పాండవులకు లేని మరొక గొప్ప లక్షణం కర్ణుడికుంది. కర్ణుడు సహజ కవచకుండల శోభితుడు. పౌరాణికుడికి ఈ విషయం చెప్పి శ్రోతలను అద్భుత ప్రపంచంలోకి తీసుకెళ్లే సౌలభ్యముంది. కుంతికి చెవి నుండి పుట్టినవాడు కావడంతో ఇతనికి కర్ణుడని పేరు వచ్చినట్లు జానపదులు భావిస్తారు. ఇది అసహజం కావచ్చు. కాని ఆపాత్రలోని దివ్యత్వాన్ని వెలికి తెచ్చే మాటఇది. కర్ణుడికి 'కానీనుడు' అంటే కన్యకు పుట్టినవాడు అని మరొక పేరుంది. మూల భారతం సూర్యుని వరం వల్ల కుంతికి కర్ణుడు జన్మించినట్లు చెప్పింది. ఎలా జన్మించాడో చెప్పలేదు అయోనిజుడా లేక యోనిజుడా అన్న విషయ ప్రస్తావనలేదు. దీనికి జానపదుడ వివరణ కల్పించాడు. కుంతి చెవిద్వారా కర్ణుడు జన్మించినట్లు చెప్పి సందేవ

నివృత్తి చేసుకొన్నాడు. ఇది జానపదుల కల్పన. ఇలాంటి కల్పనలు భారతంలో ఎన్నో ఉన్నాయి. కొన్ని సందర్భాలలో వ్యాసుడుగాని లేక కవిత్రయం వాళ్లుగాని కథను సంక్షిప్త పరచి ఉండవచ్చు. దానివల్ల ఆ కథాంశం శ్రోతలకు లేదా పాఠకులకు అర్థస్ఫూర్తి కలిగించకపోయి ఉండవచ్చు. అలాంటప్పుడు ఆసందర్భం వివరణ కోరుతుంది. ఆవివరణ జానపదుని మనస్తత్త్వానికి అనుగుణంగా ఉంటుంది. అంటే ఎక్కడ కథాంశం వివరణాపేక్షకంగా ఉంటుందో అక్కడ ఆ కథకు సంబంధించిన జాన పదాంశాలు కల్పింపబడి కథతోపాటు ప్రచారం పొంది ఉంటాయని అర్థం చేసుకోవాలి.

నన్నయ భారతాన్ని ధర్మశాస్త్రమని, వేదాంతమని, నీతిశాస్త్రమని, మహాకావ్యమని, ఇతిహాసమని, పురాణమని పేర్కొన్నాడు.[4] అయితే భారతానికి పురాణమనే పేరే బాగా సరిపోతుంది. పురాణంలో అన్ని విషయాలు ఉంటాయి. అదొక విజ్ఞానసర్వస్వం. భారతకథ పుణ్యకథ అని, భారతం వింటే సమగ్రమైన జ్ఞానం కలుగుతుందని నన్నయ అభిప్రాయ పడ్డాడు. వేదాంతంలో, నీతి శాస్త్రంలో జానపదాంశాలు చేరినా నిలకడగా నిలవలేవు. ఎందుకంటే శాస్త్రాలలో కల్పనకు తావుండదు. పురాణం ఎన్ని కల్పనలనైనా ఆదరిస్తుంది. అందువల్ల పురాణంలో జానపదాంశాలకు ఎక్కువ చోటు ఉంటుంది. భారత కథలో జానపదాంశాలు ఎక్కువగా చేరినాయని చెప్పడానికి ఎక్కువ అవకాశాలున్నాయి. ఈనాడు దొరుకుతున్న భారత ప్రతులు వ్యాస భారతానికి ఎంతో దూరంలో ఉన్నాయి. వ్యాసుడు మొదట 8800 శ్లోక పరిమితి గల భారతాన్ని జయమనే పేరుతో రచించాడట. తరువాత వైశంపాయనుడు, సుమంతుడు, జైమిని, పైలుడు వేర్వేరుగా భారత సంహితలను రచించారట.

"సుమంతు జైమిని వైశంపాయన పైల సూత్ర భాష్య
భారత మహాభారత ధర్మాచార్యాః

(అశ్వలాయన గృహ్యసూత్రం 3-4-4)

అనే విషయం దీనికి ప్రమాణం. వీళ్లు భారత సంహితలను రచించారంటే వ్యాసభారతాన్ని పెంపుచేశారని అర్థం. వీటిలో అన్నీ అదృశ్యం కాగా జైమిని భారతం మాత్రం నిలిచింది. అందులో కూడా అశ్వమేధ కథ తక్కిన కథల కంటే భిన్నంగా ఉండడంచేత అదిమాత్రం ప్రస్తుతం

దొరుకుతున్నది. అశ్వమేధ పర్వం కవిత్రయ భారతంలో కూడా ఉంది. జైమిని అశ్వమేధపర్వ కథకు కవిత్రయ భారతం వారి అశ్వమేధ పర్వ కథకు వ్యత్యాసాలున్నాయి. జైమిని అశ్వమేధ పర్వాన్ని పిల్లలమర్రి పిన వీరభద్రకవి 'జైమిని భారతం' అనే పేరుతో ఆంధ్రీకరించాడు.

"వేదానధ్యాపయామాస మహాభారత పంచమాన్
సుయజ్ఞం జైమినిం పైలం శుకంచైవ చ స్వాత్మజం
ప్రభుర్వరిష్ఠో వరదో వైశం పాయన మేవచ
సంహితాస్తైః పృథక్త్వేన భారతస్య ప్రకాశితాః"

అనే శ్లోకాన్ని బట్టి సుమంత జైమిని పైల శుక వైశంపాయనులు వ్యాసభారతాన్ని వేరువేరుగా ప్రకాశింప జేశారని అర్థమవుతుంది. కవిత్రయ భారతం వైశంపాయన ప్రోక్తం. వ్యాసుడు స్త్రీ పర్వాంతంలో "ఇమం మహాయుద్ధ మఖం మహాత్మనాం శృణోతి నూనం పఠతేచయః పుమాన్" అని చెప్పాడు. భారత యుద్ధాన్ని యజ్ఞంతో పోల్చి చెప్పడం ఇందులో గమనింపవలసిన అంశం. సౌప్తిక పర్వంతోనే భారతకథ అయిపోతుంది. ఆ తరువాతి పర్వమైన స్త్రీ పర్వంలో వ్యాసుడు కురుక్షేత్ర యుద్ధం యజ్ఞం లాంటిదని చెప్పడంలో సౌప్తిక పర్వం వరకు జరిగిన యుద్ధ సన్నివేశాలకు ఫలశ్రుతి చెప్పినట్లయింది. ఆయన ఉద్దేశంలో భారతం ఇంతే. అయితే స్త్రీ పర్వం తరువాత ఏడు పర్వాల కథ పెరిగింది. ఈ పెరిగిన కథకంతా బాధ్యులు వ్యాసులవారి శిష్యులే. ఈ పెంపుదలలో వ్యాసుడికి ఏ మాత్రం సంబంధం లేని కథలున్నాయి. ఈ కథలలో వ్యాసుని పాత్రకూడా ఉంది. వ్యాసుని శిష్యులు భారత కథను ప్రచారం చేసిన కాలం నాటి సంఘంలో వ్యాప్తిలో ఉండిన జానపద కథలు వారి వారి భారత గ్రంథాలకెక్కి శిష్టత్వాన్ని పొంది ఉంటాయి.

ప్రమీలార్జునుల వివాహానికి సంబంధించిన కథ కవిత్రయ భారతంలో లేదు. జైమిని భారత అశ్వమేధ పర్వంలో ఉంది. వ్యాసుడు చెప్పని ఈ కథ జైమిని భారతంలో కనిపిస్తున్నదంటే అది అంతకు ముందే జానపద కథగా ఉండి జైమిని ద్వారా గ్రంథస్థం అయి ఉంటుంది. లేదా శ్రోతలను ఆకట్టుకోడానికి జైమిని ఆ కథను కొత్తగా తయారు చేసి తన భారతంలో చేర్చి ఉండాలి.

ప్రమీలార్జునీయం సినిమాగా (1936) వచ్చినప్పటికే ఈ కథ వచనంగా (ఎం.శ్రీరామమూర్తి, 1898), నాటకంగా (ధర్మవరం కృష్ణమాచార్యులు, 1914; ద్రోణంరాజు సీతారామారావు. 1921) ముద్రితమైంది. ఆతరువాత 1958లో 'ప్రమీల సమరసన్నాహం' పేరుతో హిందీలో గేయంగా వచ్చింది.[6] చెర్విరాల భాగయ్య 1963లో ప్రమీలార్జునీయ కథను యక్షగానంగా రచించాడు. ఇదే కథ సి.కోటేశ్వరరావు గారి ద్వారా నవలగా కూడా మారింది. ఒక కథను ఇంత మంది రచయితలు వివిధ ప్రక్రియలలో రచించినారంటే ఆకథకు జానపదులలో ఎంత ప్రాచుర్యముందో అర్థమవుతుంది. ప్రమీల ధీరురాలైన స్త్రీ. ఆమె వీరాధివీరుడైన అర్జునునితో పోరుకు దిగడం అద్భుతం. జానపద కథకు అద్భుతత్వం ప్రధాన లక్షణం. వీరరస ప్రధానమైనప్పుడే ఆకథ అద్భుతంగా ఉంటుంది.

పిన వీరభద్రుని జైమిని భారతం, చరిగొండ ధర్మన చిత్ర భారతం కూడా ఇలాంటి వీరరస ప్రధానమైన అద్భుత కథలతో నిండినవే. ఈ గ్రంథాలలోని పాత్రలు భారత పాత్రలైనప్పటికి ఆపాత్రల చుట్టూ తిరిగే కథలు ప్రధాన భారత కథకు సంబంధించినవికావు. జైమిని భారతాన్ని గురించి రాస్తూ సి.పి. బ్రౌను పండితుడు "This is one of the poems which are looked upon as పంచడబ్బులు or mere fictions or apocryphal tales" అన్నాడు[7]. Apocryphal అనేమాటకు ప్రక్షిప్తం, అప్రసిద్ధం, సందిగ్ధం, అనుమానాస్పదం అనే అర్థాలున్నాయి. దీనిని బట్టి జైమిని భారతంలోని కథలు కల్పితాలని సి.పి.బ్రౌన్ కాలం నాటికే ఒక అభిప్రాయముండినట్లు అర్థంచేసుకోవచ్చు. కల్పిత కథలన్నీ జానపద కథలేగదా! చిత్రభారతంలోని కథ కూడా ఇలాంటిదే. చిత్ర భారత కథకు మూలం బ్రహ్మాండ పురాణం. ఈ కథ గయోపాఖ్యాన కథవలె ఉంటుంది. బ్రహ్మాండ పురాణంలో ఇలాంటి కల్పిత కథలెన్నో ఉన్నాయి. బ్రహ్మాండ పురాణం క్రీ.శ. 1-6 శతాబ్దాల మధ్య కాలానికి సంబంధించినది. ఆ కాలం నాటి జానపద కథలెన్నో ఈ పురాణంలో శిష్టత్వాన్ని పొందాయి. చిత్రభారతకథను డా॥నాగయ్యగారు ఇలాసంక్షిప్త పరిచారు.

"తుల్యుడను ముని శాపమువలన రంభ గుర్రముగా మారి చతుర్థనుడను మహారాజు కడనుండెను. చతుర్థనుడా అశ్వము నధిరోహించి ఆకాశమార్గమున పోవుచుండగా గుర్రపునోటి నురుగు అర్ఘ్యము విడుచున్న శ్రీకృష్ణుని దోసిలిలో

సంహరింతునని ప్రతిజ్ఞ చేసెను. ఈ వార్తను నారదుని మూలమున చతుర్థనుడు విని భయకంపితుడై తన్ను కాపాడుటకై బ్రహ్మను, శివుని, ఇంద్రుని ప్రార్థించెను. వారు కృష్ణుని బారి నుండి అతనిని కాపాడలేమని చెప్పిరి. ఈ సందర్భమున ధర్మన శివునిచే బాణాసుర వృత్తాంతమును ఇంద్రునిచే పారిజాతాపహరణ కథను వర్ణించెను. చివరకు చతుర్థనుని శత్రువెవరో తెలిసి కొనకయే అర్జునుడతనికి అభయ మిచ్చెను. నిజము తెలిసినను అర్జునుడు తన ప్రతిజ్ఞ వీడక కృష్ణునితో యుద్ధమునకే సిద్ధ పడెను. చిత్రభారత యుద్ధము యాదవ పాండవులకు పదునెనిమిది దినములు నడిచెను. ఈ యుద్ధమున కౌరవులు పాండవుల పక్షమున పోరిరి. కృష్ణుడు తన చక్రముచే ధర్మరాజును తప్ప తదితరుల నందరిని సంహరించెను. ధర్మరాజు ధర్మబుద్ధికి సంతసించి తిరిగి అందరిని బ్రతికించెను"[8].

భారతంలో జానపద బాణీకి చెందిన కథలెన్నో అవాంతర కథలుగా, లేక ప్రధాన కథకు పోషకాలుగా చేరి భారతం మహాభారతంగా మారిందని పై చర్చవల్ల తేలిన సారాంశం. శ్రోతలు కథకులనుండి ఆశించేది తమను ఊహాలోకాలలో విహరింపజేయగల అద్భుతకథలు. వ్యాసుని శిష్యుల ద్వారా భారత కథలను వినిన శ్రోతలు కూడా ఇలాంటి వారే. అందువల్ల ప్రాచీన కాలంలోనే భారతకథలో జానపదాంశాలు చేరినాయి. సినిమా ప్రేక్షకులుగూడా ప్రాచీనకాలానికి చెందిన శ్రోతల వంటివారే కాబట్టి వీరికి పౌరాణిక చిత్రాలలో కూడా అద్భుత దృశ్యాలు, సంఘటనలు కావాలి. దైవ - మానుష లేక మానుష - దైవ కథలు, దైవ - మానుష - రాక్షస కథలు వీరిని బాగా ప్రభావితం చేస్తాయి. పురాణాలలో ఇలాంటి విషయాలు ఉండడం, వీళ్లలో పురాణసంస్కృతి సజీవం కావడం దీనికి కారణాలు. అందుకే భారత కథా చిత్రాలలో సహజంగా కథలలో ఉండే జానపదాంశాలే కాకుండా జనాభిరుచిని బట్టి కొత్త జానపదాంశాలు కూడా కల్పించబడినాయి.

**కథాసాహిత్యం - జానపదీయత** : కథచెప్పడం, ఊకొడుతూ ఆకథను వినడం భారతదేశంలో అతి ప్రాచీనమైన పద్ధతి. కథలంటే చెవికోసుకోవడం (ఆసక్తిగా వినడం) ఇప్పటికీ ఉంది. ఇప్పటి వరకు లభించిన

ఆధారాలను బట్టి మనదేశంలో కథాసాహిత్యానికి సంబంధించి దొరికిన మొదటి గ్రంథం బృహత్కథ. క్రీస్తు పూర్వం రెండు లేక ఒకటవ శతాబ్దానికి చెందిన గుణాఢ్యుడు పైశాచీ భాషలో రచించిన గ్రంథమిది. పైశాచి ప్రాకృతానికి అపభ్రంశరూపం. గుణాఢ్యుడు ఆంధ్రుడనే అభిప్రాయముంది. ఈ పైశాచీ బృహత్కథననుసరించి క్రీ.శ. 9వ శతాబ్దిలో బుధస్వామి 'బృహత్కథాశ్లోక సంగ్రహం' అనే గ్రంథాన్ని సంస్కృతంలో రాశాడు. బృహత్కథననుసరించి క్రీ.శ. 11వ శతాబ్దిలో సోమదేవభట్టు 'కథా సరిత్సాగరం' అనే గ్రంథాన్ని రచించాడు. కథాసరిత్సాగరాన్ని బట్టి బృహత్కథలోగల విషయాలెలాంటివో కొంత ఊహించవచ్చు. కథాసరిత్సాగరంలో నాయకుల వీరకృత్యాలు, కాశ్మీర దేశంలోని కొన్ని మూఢ విశ్వాసాలు, బౌద్ధుల జాతక కథాంశాలు, మాంత్రికుల చేష్టలు, పిట్టకథలు ఉన్నాయి. మానవ చరిత్రలు దుఃఖభూయిష్టాలనీ దివ్యుల చరిత్రలు సుఖమయాలని కూడా కథలద్వారా సోమదేవభట్టు సూచించాడు. ఇందులో రాజుల చరిత్రలేగాక బ్రాహ్మణ, వైశ్యుల కథలు, కర్మకారుల కష్టసుఖాలు, వణిక్పుత్రుల వ్యాపార విశేషాలు కూడా ఉన్నాయి. ఈ విషయాలను బట్టి బృహత్కథ ఆనాటి సంఘంలోని పరిస్థితుల కనుగుణమైన ఇతివృత్తాలను వీరరస స్ఫోరకంగా కథనం చేసినట్లు చెప్పవచ్చు.

రామాయణంలో కాకపోయినా కనీసం భారతంలోను, (వ్యాసుని శిష్యులు ప్రచారం చేసిన భారతాలు), ఇతర పురాణాలలోను జానపద కథలు చేరడానికి బృహత్కథ కొంత కారణమనడంలో సందేహంలేదు. "శ్రీరామాయణ భారత బృహత్కథానాం కవీన్ నమస్కుర్మః" అని గోవర్ధనాచార్యుని ఆర్యాసప్తశతిలో ఉంది.[9] గోవర్ధనాచార్యుడు క్రీ.శ. 11వ శతాబ్దివాడు. ఇతడు గాథాసప్తశతిని సంస్కృత శ్లోకాలుగా అనువదించాడు. గోవర్ధనాచార్యుని కాలం నాటికి బృహత్కథకు ఎంత ప్రాచుర్యముందో పై సంస్కృత వాక్యం వల్ల తెలుస్తుంది. బృహత్కథ ఆనాటి జానపద కథలను గ్రంథస్థంచేసింది. బృహత్కథను రామాయణ భారతాల సరసన చేర్చడం వల్ల రామాయణ భారతాలలో కూడా సమకాలీన జానపదాంశాలు గ్రంథస్థమైనాయని విశ్వశించవచ్చు. మరొక విషయం - బృహత్కథలోని కథలను జనం విన్నట్లే రామాయణ భారత కథలను కూడా విని ఉంటారు. ప్రధాన కథతో మిళితమైన జానపద కథలు

లేకుండా అవి జనానికి రుచించి ఉండవు. పైగా ఆకాలానికి ఆ గ్రంథాలలోని కథలన్నీ జానపదాలే. తరువాత కాలాలలో ఆగ్రంథాలలోని కథలకు శిష్టత్వం అబ్బింది. బృహత్కథలోని జానపదాంశాలు సంస్కృత కావ్య సాహిత్యంపై చూపిన ప్రభావం ఎంతో ఉంది. బృహత్కథననుసరించి భాసుడు ప్రతిజ్ఞాయౌగంధరాయణం, స్వప్నవాసవదత్త నాటకాలు రచించాడు. బృహత్కథలోని గోముఖుడు యౌగంధరాయణుడుగా, మదన మంచుక వసంతసేనగా భాసుని నాటకాలలో మారిపోయారు. ఈ రెండు నాటకాలు పూర్తిగా కల్పితాలు. చారిత్రకమైన పేర్లు ఆనాటకాలలో కనిపించినా అవి చారిత్రకాభాసాలే.

పై చర్చను బట్టి మనదేశంలో కావ్యసాహిత్యంతో పాటు జానపద కథా సాహిత్యం కూడా సమాంతరంగా కొనసాగినట్లు అర్థమవుతుంది. జానపద కథలను గ్రామ వృద్ధులు ఆసక్తిగల శ్రోతలకు చెప్పేవారని 'ప్రాప్యావన్తీనుదయన కథా కోవిద గ్రామవృద్ధాన్' అనే కాళిదాసు శ్లోకం చెపుతుంది.[10] సాహసవంతమైన, అమానుషమైన కథలంటే ప్రజలకు ఎంతో ఇష్టం. తాము చేయలేని సాహసకార్యాలను జానపద కథావీరుడు చేసి చూపిస్తుంటే శ్రోతలు ఆవీరుని స్థానంలో తమను ఊహించుకొని తృప్తిపడతారు. మానవజన్మ వ్యర్థమని, మానవత్వం దైవత్వంగా మారడం గొప్ప విషయమని నమ్ముతారు. ఆ అంశాన్ని నిరూపించే జానపదాంశం కథలో ఉంటుంది. స్వర్గం, నరకం జానపదులు కల్పించినవే. తరువాతనే శిష్టకవులు వాటికి శిష్టత్వం కల్పించారు. భారతంలో ఇలాంటి అద్భుత కథలున్నాయి. జానపద కథావీరుడికి గల అదృశ్యశక్తి శ్రీకృష్ణుడికి ఉంది. అర్జునుడు రెండుసార్లు స్వర్గం వెళ్లి వచ్చాడు. పాండవులు సశరీరులుగా స్వర్గానికి వెళ్లినట్లు కథ ఉంది. ఈ విషయాలన్నీ శ్రోతల మనస్సుల మీద ఎనలేని ప్రభావం చూపుతాయి. కథలలోని అంశాలు సహజత్వానికి దగ్గరగా ఉండినట్లు కనిపిస్తాయి. అయినా సామాన్య మానవులకు అందనంత దూరంలో ఉంటాయి. అందీ అందనట్లు ఉండడం వల్లనే శ్రోతలలో రసపుష్టి కలుగుతుంది. అందకపోతే అందలేదన్న నిరాశ, అందితే అవాస్తవికత కలిగించే నిరాశ కథాగమనానికి అవరోధాలవుతాయి.

జానపదీయతకు మరొక లక్షణం కథ సంభాషణ రూపంలో ఉండడం. కథను సంభాషణ రూపంలో సాగించడం కథకునికి సౌలభ్యం. కథకుడు

నటుడు కూడా అయి వుంటాడు. అతడు సన్నివేశాలను నటించి చూపిస్తాడు. నాయకుడు ప్రతి నాయకుని ఓడించే సందర్భంలో పళ్లుకొరుకుతూ మీదికి దూకినాడని చెప్పడానికి కథకుడు పళ్లుకొరికి చూపిస్తాడు. కీచకవధ ఘట్టంలో భీముడు పళ్లుకొరకడం తెలిసిందే. కథ సంభాషణ రూపంలో సాగుతున్నప్పుడు వినేశ్రోత కథలో తాతాద్మ్యం పొందే అవకాశముంటుంది. భారతంలో యక్షప్రశ్నలున్నాయి. యక్షుడు వేసిన ప్రశ్నలకు ధర్మజుడు జవాబులు చెప్పి తన తమ్ములను బతికించుకున్నాడు.[11]. భారత కథను ఊకుడు కథగా చెప్పే పద్ధతి నన్నయకాలంలో కూడా ఉండేది. సాధారణంగా కథలు చెప్పేది పౌరాణికులు. అందుకే నన్నయ రాజరాజు ఆస్థానంలో భారతరామాయణానేక పురాణ ప్రవీణులైన పౌరాణికులు ఉండినట్లు గ్రంథస్థంచేశాడు. భారతాన్ని కథగా వినడం ఇప్పటికీ ఉంది. వినేవాళ్లు ఆ కథలోని అద్భుతత్వాన్ని అనుభవిస్తూనే ఉన్నారు. భారత పాత్రలు మానుష - అమానుష లక్షణాలు కలవి. ఇది జానపద సాహిత్య లక్షణం. భారత పాత్రల స్వభావం మన మనసులకు తెలుసు. ఒక్కొక్కపాత్ర ఒక్కొక్క లక్షణానికి ప్రతీకగా మనలో నిలిచిపోయింది. శకుని మోసానికి, దుర్యోధనుడు అభిమానానికి, భీమార్జునులు పరాక్రమానికి, సైంధవుడు క్రౌర్యానికి, శ్రీకృష్ణుడు దివ్యత్వానికి ప్రతీకలు. ఈ భావాలన్నీ మానవ స్వభావంలోని ప్రాథమిక స్థితికి చెందినవి. జానపదులలోని భావతీవ్రత శిష్టులలో ఉండదు.

ఏ విషయాన్నైనా సర్దుకు పోయే తత్వం శిష్టులది. పాతివ్రత్య ధర్మం జానపదుల నుండి శిష్టులలోకి వచ్చింది. ఈ యంశాన్ని నిరూపించే కథలు పురాణాల్లో ఎన్నో ఉన్నాయి. భారతంలో ద్రౌపది కథ, సావిత్రికథ, దమయంతి కథ పాతివ్రత్య నిరూపణ కోసం వివరింపబడినవే. అభిమాన ధనులైన సుయోధనుని వంటివారు జానపదులు. ధర్మాన్ని నియతంగా ధర్మరాజువలె పాటించేవారు జానపదులు. ధర్మాన్ని నియతంగా ధర్మరాజువలె పాటించేవారు జానపదులు. ఆకారణం చేతనే పల్లె ప్రాంతాల్లో ఇంకా మాటతప్పని వారున్నారు.

వాస్తవికతలో అద్భుతాన్ని, అద్భుతంలో వాస్తవికతను చూపించేది జానపద సాహిత్యం. అందులో పురాణ కథలు ప్రజలలో నమ్మకాన్ని, ఆత్మస్థైర్యాన్ని కలిగించడానికి ఉద్దేశించినవి. పురాణాలలో భారత పురాణం ప్రజలకు అతి సన్నిహితం. ఇప్పటికీ కొందరు కొన్ని కథలు చెప్తుతారు.

ఆ కథలలో భారత పాత్రలపేర్లు మాత్రం వినబడతాయి. కథలు కొత్తవి. మనం ఎక్కడావిని ఉండం. ద్రౌపది పాతివ్రత్యానికి సంబంధించిన కథ ఒక్కొక్క ప్రాంతంలో ఒక రకంగా ప్రచారంలో ఉంది. తమిళనాడు సమీప ఆంధ్ర ప్రాంతంలో ద్రౌపది ఒక దేవతగా పూజలందు కొంటున్నది. కొన్ని ప్రాంతాలలో ఆమెకు అంతగా గుర్తింపులేదు. భారతంలో ద్రౌపది పాంచాలి కావడానికి కారణమైన కథ ఉందని చెప్పినా అది జానపదులకు పట్టదు. వాళ్లకు నచ్చినట్లు వాళ్లు కల్పించుకుంటారు. తమిళ కన్నడ భారతాలలో కూడా జానపదుల కథాకల్పనలు కన్పిస్తాయి. "వింత వింత కథలను కల్పించుట మానవ స్వభావం కాబోలు. పూర్వమున్న కథలను పూర్తిగా మార్చివేయుట, పూర్వ గాథల నాధారము జేసికొని క్రొత్త గాథలు కల్పించుట, పాత కథలకు కొంత తమ కల్పనము జోడించుట వలననే 'కాళిదాసు కవిత్వము కొంత - తమ పైత్యము కొంత' అనుమాట ప్రసిద్ధి కెక్కినది ............ ఇట్టి కల్పనము చేయునది జానపదులేకాదు. దీనిలో శిష్టులును సిద్ధహస్తులే. ఇట్టి కథా కల్పనములు మానవుల హృదయాను భూతుల వలన కలుగును. ఇట్టి హృదయాను భూతుల కెంత స్థానము లభించిన నంతగా నిజమైన కథ వెనుకకు నొదుగును. సంబంధంలేని క్రొత్త కూర్పులు మార్పులు కలుగును. ఇంకొక కథాభాగము రెక్కలు కట్టుకొని వచ్చి దీనిలో నదుకుకొని పోవును. అట్టి సమయమున ఈ క్రొత్త కల్పన లెటనుండి చేరినవో, ఆకథకు మూల మెట్టిదియో కనుగొనుట కష్టము"[12] అని రాసిన ఆచార్య బి.రామరాజుగారి మాటలు జానపదుల నూతన ప్రియత్వాన్ని కల్పనా వైచిత్రిని తెలుపుతాయి.

**భారతకథలు - జానపదీయత** : ధృతరాష్ట్ర, పాండురాజుల పుట్టుకకు, ఆ తరువాత కురుపాండవ వంశాల అభివృద్ధికి మూలం వ్యాస అంబికా అంబాలికల సమాగమం. అంబికా అంబాలికలు విధవలు. పైగా క్షత్రియ వనితలు. పరాశరాత్మజుడైన వ్యాసుడు వేదాధ్యయన తత్పరుడు. క్షత్రియ కాంతలతో ఈయన సంగమం సంకరం. సత్యవతికి వ్యాసుడు మొదటి కుమారుడు కాబట్టి అంబాలకాంబికలకు బావ అవుతాడు. సత్యవతి వ్యాసుని పిలిపించి

ధృతి నీయనుజుండై విశ్రుతుడైన విచిత్రవీర్యు సుక్షేత్రములన్
సుతులంబడయుము కులమవి, రతసంతతి నెగడ దేవర న్యాయమునన్
(ఆది. 4-245)

అని కోరింది. దీనికి వ్యాసుడు ఒప్పుకొని - 'ఇది యెందును గల ధర్మవ, యెప్పుడు వినబడు నానాపురాణ వివిధ శ్రుతులన్' (ఆది 4 - 247) అంటాడు. తరువాత అంబిక యందు ధృతరాష్ట్రుని, అంబాలిక యందు పాండురాజును పుత్రులుగా ప్రసాదిస్తాడు వ్యాసుడు. ఇక్కడ మాయలు మంత్రాలు లేవు. సమాగమం ద్వారానే ఇది సాధ్యమైంది. తమ్ముడు సంతానం లేకుండా చనిపోయినపుడు అన్న తమ్ముని భార్యద్వారా సంతానం కలిగించి వంశం నిలపడం అనాదిగా ఉన్న ధర్మమట. దీనికి దేవర న్యాయమనిపేరు.

దేవరన్యాయ ప్రసక్తి వేదాల్లోను పురాణాల్లోను ఉన్నదంటున్నాడు వ్యాసుడు. పాండురాజుకు భార్యల ద్వారా సంతానం పొందే అవకాశం లేదని తెలిసిన తరువాత ఆయన అనుమతితో కుంతి యమ, వాయు, ఇంద్రుల ద్వారా సంతానం పొందింది. మాద్రి అశ్వనీ దేవతల ద్వారా సంతానం పొందింది. వీళ్లంతా దేవతలనుకున్నా పరపురుషులేగదా! సంతతిలేక వంశం నశించనున్నపుడు ఈ పద్ధతిని ఆపద్ధర్మంగా ప్రాచీనులు భావించినట్లు తెలుస్తున్నది. ఇది తప్పుకాదు. ఈ పద్ధతిని జానపదులు సమర్థిస్తారు. డా|| బ్రహ్మానంద గమనించిన అంశాలు ఈ సందర్భంలో అవసరం. "ఇక్కడ ఒక అతి ప్రాచీనమైన గిరిజన తెగల సంస్కృతీ అవశేషం చోటు చేసుకొన్నది. బంజారాలమీద పరిశోధించినవారు ఒక విషయం గుర్తించారు. బంజారా భాషలో మరిదిని 'దేవర్' అంటారు. ఇతర ఔత్తరాహ భాషల్లోను ఈ పదం ఉంది. అన్న చనిపోతే మరిది వదినెను మనువాడతాడు 'దేవర్‌భౌజాయ్' సంప్రదాయమని దీన్ని పిలుస్తారు. అలా పుట్టిన పిల్లలు 'జాంగడ్' (సంకరజాతి) కారు. వారికి ఆస్తిహక్కు ఉంటుంది. కాని ఆ స్త్రీ ఇతర సుమంగళులలాగా అలంకరించుకోదు. ముఖ్యంగా చెవికమ్మలు (ఛోటియా) తీసివేస్తుంది. సంతతి కోసం, ఆ స్త్రీ రక్షణకోసం, జాతి పవిత్రతను కాపాడడంకోసం ఈ 'న్యాయం' కులనీతిగా పుట్టింది. వెన్నలకంటి రాఘవయ్యగారు 'Tribal Justice' (1977) అనే తమగ్రంథంలో ఈ ఆచారం ఆదిమ తెగల్లో సర్వత్రా కనిపిస్తున్నట్లు

రాశారు. కాని గ్రామీణ సంతతిలో మాత్రం ఇది పోయింది. వదినె తల్లితో సమానం. అన్న తండ్రితో సమానం. ఇది గ్రామాల్లో ఇవాల్టి నీతి"[13]

దేవరన్యాయం ఇప్పటికీ కొండ ప్రాంతాల్లోని కొన్ని తెగల్లో ఉందని సామాజిక శాస్త్రవేత్తలు చెపుతున్నారు. జానపద సంస్కృతి నుండి ఈ పద్ధతి భారతంలోకి వచ్చింది. గ్రామాల్లో ఈనాటి ప్రజలు ఈ పద్ధతిని ఒప్పుకోరు. ఇలా ఒప్పుకోక పోవడం రామాయణ కాలంలోనే మొదలైంది. లక్ష్మణుడు సీతను తల్లిగాను రాముని తండ్రిగాను భావించాడు. లక్ష్మణుని సీతారాముల వెంట పంపుతూ సుమిత్ర ఇలా అంది - "రామం దశరథం విద్ది మాం విద్ధి జనకాత్మజామ్ అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛతాత యథాసుఖమ్" [14] దీనికి మించిన ప్రమాణమేముంది? భారతంలో దుర్యోధనుడు కూడా ఈ పద్ధతిని గర్హించాడు. దేవర న్యాయంవల్లనే కురుపాండవ వంశాలు ఏర్పడినాయని, పురాణాలెలా ఈ పద్ధతిని సమర్థించినా అది ముమ్మాటికీ వర్ణసంకరమేనని అతని గట్టి అభిప్రాయం. 'దానవీరశూరకర్ణ' (1977) సినిమాలో దుర్యోధనుని అభిప్రాయమిదే. కుమారాస్త్ర విద్యా ప్రదర్శన సందర్భంలో కులకారణంగా కర్ణుడు నిందింపబడినపుడు, కౌరవపాండవుల మధ్య సంధి కూర్చడానికి శ్రీకృష్ణుడు రాయబారం నిర్వహించినపుడు దుర్యోధనుడు కురుజాతి ఎలా వర్ణసంకరమైందో సుదీర్ఘంగా వివరిస్తాడు.

ఈ చర్చ రెండు విషయాలను ప్రతిపాదిస్తుంది. 1. సినిమా 1977లో వచ్చింది కాబట్టి పాత్రల మనస్తత్వాలు సమకాలీన సమాజస్థితికి దగ్గరగా ఉండాలన్న ఉద్దేశంతో దుర్యోధనుని పాత్రనలా మలచి ఉండవచ్చు. ప్రాచీన జానపద సంస్కృతికి చెందిన 'దేవరన్యాయం' పద్ధతి శిష్టులకు ఆమోదయోగ్యం కాకపోవడం వల్ల ఇలాంటి పద్ధతి ఆధునిక నాగరక సమాజంలో కొనసాగరాదన్న అభిప్రాయం కూడా దీనికి కారణం కావచ్చు. దుర్యోధనుడు కొన్ని సందర్భాల్లో క్రూరుడైనా నిజాన్ని నిర్భయంగా బయటపెడతాడు. ఇది భారతంలోనే చాలమందికి నచ్చదు. శ్రీకృష్ణనిలో దుర్యోధనునికి దివ్యత్వం కనిపించలేదు. కొన్ని సందర్భాల్లో కృష్ణుని తేజస్సుతో అతనికి మూర్ఛ కలిగినంతపని అయినా అది కేవలం మాంత్రికులు ప్రయోగించే మాయ అని సరిపెట్టు కొంటాడు. నిజంగా కృష్ణుడు దివ్యపురుషుడని అతని చిత్తానికి తోచి ఉంటే

యుద్ధానికి కావలసిన సహాయం కోరడానికి ఆయన దగ్గరకు వెళ్లడు. భీష్మాదులు కృష్ణుడు దేవుడని చెప్పినా నమ్మలేదు. భారతంలో కనిపించేది ఆర్య సంస్కృతి. ఈ సంస్కృతిలో కొన్ని పాత్రలు సనాతన సంప్రదాయాలను గౌరవిస్తే దుర్యోధనాది పాత్రలు కొన్ని సంప్రదాయాలకు కొంత భిన్నంగా నడిచినట్లు కనిపిస్తుంది. ఏ సమాజంలోనైనా భిన్నమనస్తత్వాలుంటాయి. అప్పటికి ఆర్య సంస్కృతి జానపద సంస్కృతే. తరువాత ఎప్పుడో శిష్టీకరణ పొందిన తరువాత ఈ సంస్కృతి కొన్ని మార్పులకు లోనైంది.

2. జానపద కథల్లో పాతివ్రత్యానికి సంబంధించిన అంశాలుంటాయి. భర్తకు సేవ చేయడం ప్రాచీనకాలం నుండి మనదేశంలో కొనసాగుతున్నది. భర్తృసేవ జానపద సంస్కృతిలో ప్రధాన విషయం. ఈ సంస్కృతి భారతంలో శిష్టత్వం పొందింది. సత్యవతి శంతనుని, కుంతి పాండురాజును, గాంధారి ధృతరాష్ట్రుని, ద్రౌపది పంచపాండవులను నీతి నియమాలతో సేవించినట్లు భారతంలో చూపబడింది. వీళ్లలో సత్యవతి కన్యగా ఉన్నప్పుడే పరాశర మహర్షివల్ల వ్యాసుని కన్నది. కుంతి కన్యగా ఉన్నపుడే సూర్యుని వల్ల కర్ణుని కన్నది. సత్యవతి గర్భవతియైనట్లు భారతం చెబుతున్నది. (అది. 4-239). అలాగే కుంతికూడా. బిడ్డలను కన్నప్పటికి పరాశరుని మహత్వం వల్ల సత్యవతి కన్యాత్వం దూషితం కాలేదని, సూర్యుని మహత్వం వల్ల కుంతి కన్యాత్వం దూషితం కాలేదని భారత కథనం. జానపద కథల్లో దృగ్దీక్ష వల్ల పిల్లలు పుట్టినట్లు కనిపిస్తుంది. భారత కాలానికి ముందు పురుషుడు కంటితో స్త్రీని చూస్తే ఆమె గర్భవతి అయిందేమో తెలియదు. కాని భారతంలో స్త్రీ పురుష సంగమం వల్లనే సంతానం కలుగుతుందని స్థిరీకరించబడింది. దుర్యోధనుని దృష్టిలో సత్యవతి, కుంతి పతివ్రతలైనప్పటికి వారివల్లనే వంశం సంకరమైంది. భీష్మ (1942) చిత్రంలో సత్యవతీ పరాశరుల కథ ఉంది. యోజన గంధిగా మారకముందు సత్యవతి దాశరాజు కూతురు. దాశరాజు బెస్తవాడు. కాబట్టి సత్యవతి కథ జానపద సంస్కృతికి చెందిందిగా చెప్పాలి. ఈ సంస్కృతిలో హెచ్చుకులం వారితో సంగమం దోషం కాదు. వ్యాసుడు జన్మించిన తరువాత శంతనుడామెను చూచి మోహితుడవుతాడు. క్షత్రియుడు కాబట్టి శంతనుడు కూడా హెచ్చుకులం వాడే. జానపద కథల్లో మహర్షులకు

ఎంతో మహిమ ఉంటుంది. ఆ మహిమవల్ల సత్యవతి కన్యగానే మిగిలిందని ఆ సంస్కృతి నమ్మింది. భారత సంస్కృతి కూడా ఇందులో భాగమే కాబట్టి సత్యవతీ శంతనుల వివాహానికి అటంకాలెదురు కాలేదు. భీష్మ సినిమా చూచిన వాళ్లెవరికీ సత్యవతి కన్యాత్వం చెడిందన్న అలోచన రాలేదు. ప్రేక్షకుల దృష్టి ఆమె కనిన వ్యాసుని మహత్వంలోను, ఆయన భారతవంశాన్ని నిలబెట్టిన గొప్పతనంలోను ప్రసరిస్తుంది. ఈ జానపద సంస్కృతి భారతంలో గ్రంథస్థమై తరువాత ఎప్పుడో ఆక్షేపణలకు గురి అయింది. కుంతి విషయం కూడా ఇంతే. ఈ కారణాల వల్ల సత్యవతికి గాని, కుంతికి గాని అప్పటి వాళ్లలోను, ఇప్పటి వాళ్లలోను గౌరవం ఉంది.

3. ఉద్యోగ పర్వంలో శ్రీకృష్ణుడు కౌరవ సభకు రాయబారం వెళ్లాలని పాండవులతో చర్చిస్తుండిన సమయంలో రాయబారానికి సంబంధించి ద్రౌపది తన అభిప్రాయం ప్రకటిస్తుంది. సంధి కుదరడం ఆమెకు ఇష్టంలేదు. ద్రౌపది అభిప్రాయాన్ని రూపు కట్టించడానికి ఈ సందర్భంలో తిక్కనగారు ఒక పద్యం రాశారు.[15] 'వరమున బుట్టితిన్ భరతవంశము జొచ్చితి.......' అనే ఈ పద్యంలో ద్రౌపది అయోనిజత్వం ప్రస్తావించబడింది. ఆమె గర్భంనుండి జన్మించినది కాదు. యజ్ఞంనుండి జన్మించినది. అందుకే ఆమెపేరు యాజ్ఞసేని. రామాయణంలో సీతకూడా అయోనిజ. మాంధాత కథలో మాంధాత గర్భంనుండి కాకుండా తండ్రి యవనాశ్వుని కడుపు చించుకొని పుట్టినట్లుంది. పురాణాల్లో ఇలాంటి విషయాలెన్నో ఉన్నాయి. 'అయోనిజత్వం' జానపదుల భావన. అయోనిజులైన వ్యక్తులను దైవశక్తి సంపన్నులుగా చూస్తారు జానపదులు. పాండవులకు ద్రౌపదితో బాటు అందరికీ వేర్వేరు భార్యలున్నారు. జానపద సాహిత్యం వాళ్లకెవరికీ ఇవ్వనంత ప్రాధాన్యాన్ని ద్రౌపదికిచ్చింది. ఇప్పుడు దేశంలోని అనేక ప్రాంతాల్లో ద్రౌపదీదేవి తిరునాళ్లు జరగడానికి కారణం ఆమె దివ్యత్వమే. ఆమె భర్తలు కావడం వల్లనే పాండవులకు గౌరవం. సినిమావాళ్లు ఏ దృశ్యాన్ని వదిలిపెట్టినా ద్రౌపది శ్రీకృష్ణునితో రాయబార ఘట్టంలో సంభాషించిన ఘట్టాన్ని వదలలేదు. కొన్ని సినిమాలలో తిక్కనగారి పద్యం అలాగే చిత్రీకరించబడింది.

4. సభాపర్వంలో ద్రౌపది వస్త్రాపహరణ ఘట్టముంది. వ్యాసుడు, కవిత్రయం వాళ్లు ఈ ఘట్టాన్ని స్థూలంగా స్ఫురింప జేశారేగాని వివరణాత్మకంగా వర్ణించలేదు. సినిమాలలో ఈ ఘట్టం చాలా వివరంగా చూపబడింది.

'పాండవ వనవాసం' (1965) చిత్రంలో బ్రహ్మాండమైన కౌరవసభ 'సెట్టింగు' వేసి అందులో అద్భుతంగా చిత్రించారు. సభాప్రాంగణం పై కప్పునుండి శ్రీకృష్ణుడు ద్రౌపదికి అక్షయ వలువలు ఇచ్చినట్లు కూడా ఈ చిత్రం చూపిస్తుంది. నిండుసభలో ఒక స్త్రీని వివస్త్రను చేయాలనుకోవడం చిన్న విషయం కాదు. జానపద సంస్కృతిలో స్త్రీ గౌరవ నిరూపణచేసే కథలెన్నో ఉన్నాయి. స్త్రీ మాన రక్షణ అతి ముఖ్యమైన విషయం. ఏ జానపదుడూ ద్రౌపదికి జరిగిన పరాభవాన్ని సమర్థించడు. అయితే భారతంలో ఎందుకీ సంఘటన జరిగింది అనే విషయం పరిశీలిస్తే ఆసక్తికరమైన అంశం బయటపడుతుంది. ప్రాచీన కాలంలో ఒక వ్యక్తిని అవమాన పరచాలంటే ఆ వ్యక్తి తల గొరిగేవారిని తెలుస్తున్నది. శిరోముండనం ఒక శిక్షగా ధర్మశాస్త్రాలు పేర్కొంటున్నాయి. తలగొరగడం అవమానంగా భావించడం వల్లనే అది శిక్షగా మారింది. భాగవత పురాణంలో శ్రీకృష్ణుడు రుక్మికి తల గొరిగి అవమానపరచడం ఉంది. భారత కాలంలో కూడా ఈ శిక్ష ఉంది. దుర్యోధనుడు తనను చూచి నవ్విన పాంచాలిని పరాభవించాలనుకున్నాడు. సభకు ఈడ్పించాడు. ఆమె తల వెంట్రుకలను గొరిగించి ఉంటే ఆమె తలను తీయించిన దానితో సమానమయ్యేది కదా! ఈ ఆలోచన అతనికి రాలేదు. ఆమెను నగ్నంచేసి పతులను తలవంచుకొనేటట్లు చేయాలనుకున్నాడు. దుర్యోధనుడికి ఈ ఆలోచన రావడానికి కారణం అంతకు ముందే మనదేశంలో ఉండిన నగ్న దేవతా సంస్కృతి. ప్రాచీనకాలంలో శరీరాన్ని పూర్తిగా వస్త్రంతో కప్పుకొనే పద్ధతి లేదు. స్త్రీలైనా పురుషులైనా కట్టుబట్ట మాత్రమే ధరించే వారు. స్త్రీల వక్షాలు అనాచ్ఛాదితంగా కనిపించేవి. కొన్ని తాంత్రిక మాంత్రిక పూజల్లో పూర్తి నగ్నంగా స్త్రీలు నిలబడేవారు. ఇప్పటికీ కొన్ని దేవాలయాల్లో స్త్రీల బొమ్మలు నగ్నంగా కనిపిస్తూ ప్రాచీన సంస్కృతిని మనకు పరిచయం చేస్తున్నాయి. అభిచార హోమాల్లో నగ్నత్వం తప్పనిసరి. అతి ప్రాచీన సంస్కృతికి చెందిన దశయిది. ఈ విషయాల నేపథ్యంతో ఆలోచిస్తే ద్రౌపదికి వలువ లూడ్చడం ప్రాచీన సంస్కృతికి చెందిన అంశంగా గుర్తించవచ్చునేమో. ఇది ఇంకా పరిశీలించ వలసిన అంశం.

ఇలా తాంత్రిక దృష్టితో కాకుండా సామాజిక దృష్టితో చూస్తే స్త్రీ మాన రక్షణ చేయవలసిన పురుషుడే ఆమె మానాన్ని అగౌరవ పరచడం తప్పనిపిస్తుంది. ఇది మొదట జానపదాంశం. తరువాత శిష్టత్వం పొందింది.

ఇప్పుడు స్త్రీ అన్ని విషయాల్లో పురుషుడితో సమానమనే నినాదం వినిపిస్తున్నది. సంఘంలో క్రూరుడైన వాడు స్త్రీని పరాభవిస్తే ఆమెనాపరాభవం నుండి కాపాడగల శక్తి గలవాడు చూస్తూ ఊరకుండడం ధర్మం కాదు. భారతంలో దుర్యోధనుడు క్రూరుడు. శ్రీకృష్ణుడు కాపాడగల శక్తి గలవాడు. కౌరవసభలో కృష్ణుడీ విషయాన్ని 'సారపు ధర్మమున్ విమల సత్యము పాపముచేత బొంకుచే.......' అనే పద్యంలో[16] వాచ్యంచేశాడు. ఆపదలో ఉన్న స్త్రీని కాపాడి ఆమె గౌరవాన్ని నిలపడం మన సంస్కృతిలోని గొప్పలక్షణం. శ్రీకృష్ణుడు లేకుంటే ఆనాడు ద్రౌపది పరిస్థితి ఏమిటి? భారతీయ సంస్కృతి అధః పాతాళానికి కుంగిపోయి ఉండేది. ఈ అంశాలను దృష్టిలో ఉంచుకున్నా ఉంచుకోక పోయినా ద్రౌపది వస్త్రాపహరణ సన్నివేశాన్ని చిత్రించిన ప్రతి సినిమాలోను ఈ ప్రయోజనం నెరవేరింది. స్త్రీ పూజనీయ అనే భావం పురుషులలో కలగడానికి ఈ సన్నివేశం ఉపకరిస్తుంది. జానపదాంశాన్ని భారతం ప్రదర్శిస్తే భారతంలోని ఆ అంశాన్ని సినిమాలలో చిత్రించి ప్రజలకు అతి సన్నిహితంగా తీసుకొని వచ్చారు సినిమా వాళ్ళు. సినిమాల మీద జానపద సాహిత్య ప్రభావం ఇంతకు మించి ఇంకేం కావాలి?

5. బాణాలు తయారుచేయడం మొదట ఆటవికులలో పుట్టింది. జంతువులను వేటాడడానికి ఇది ఉపయోగపడింది. ఆటవిక సంస్కృతి గ్రామ సంస్కృతిగా మారిన తరువాత విల్లమ్ములకు సంబంధించిన విద్య గుర్తింపబడింది. ఇదే విలువిద్య. తరువాత సాహిత్యం దీనిని ధనుర్వేదమని పేర్కొన్నది. భారతంలో అర్జునుడు, ఏకలవ్యుడు గొప్పవిలుకాండ్రు. ఈ విద్యలో కర్ణుడు కూడా తక్కువ వాడు కాదు. భారత కథేతి వృత్త సినిమాలలో కర్ణార్జునులు తప్పక కనిపిస్తారు. భారతకాలం నాటికి ఇనుప లోహంతో శస్త్రాస్త్రాలు తయారైనట్లు సాక్ష్యాలున్నాయి. 'ఏకలవ్య' (1982) సినిమాలో బాణ విద్యలో ఏకలవ్యుని మించి పోవాలనే కోరికతో అర్జునుడు ఆ ఎరుకలవాని కుడిచేతి బొటన వేలుని ద్రోణుని ద్వారా ఖండింపజేస్తాడు. కథా విషయం ఇక్కడ అవసరం లేదు. జానపద విద్యయైన విలువిద్య భారతంలో ఎంత ప్రశస్తి పొందిందో అర్థం చేసుకోవడం అవసరం. కర్ణుడు బాణ విద్యలో నైపుణ్యం కలవాడు కావడంచేత దుర్యోధనుడు అతనిని చేరదీశాడు. కర్ణుడు లేకుంటే భారతయుద్ధం జరిగేది కాదేమో. అర్జునుడు జగదేక ధనుర్ధరుడనే నమ్మకంతో ధర్మరాజు యుద్ధానికి అంగీకరించాడు. అర్జునుడు మత్సరించడంతో

'పాండవ వనవాసం' (1965) చిత్రంలో బ్రహ్మాండమైన కౌరవసభ 'సెట్టింగు' వేసి అందులో అద్భుతంగా చిత్రించారు. సభాప్రాంగణం పై కప్పునుండి శ్రీకృష్ణుడు ద్రౌపదికి అక్షయ వలువలు ఇచ్చినట్లు కూడా ఈ చిత్రం చూపిస్తుంది. నిండుసభలో ఒక స్త్రీని వివస్త్రను చేయాలనుకోవడం చిన్న విషయం కాదు. జానపద సంస్కృతిలో స్త్రీ గౌరవ నిరూపణచేసే కథలెన్నో ఉన్నాయి. స్త్రీ మాన రక్షణ అతి ముఖ్యమైన విషయం. ఏ జానపదుడూ ద్రౌపదికి జరిగిన పరాభవాన్ని సమర్థించడు. అయితే భారతంలో ఎందుకీ సంఘటన జరిగింది అనే విషయం పరిశీలిస్తే ఆసక్తికరమైన అంశం బయటపడుతుంది. ప్రాచీన కాలంలో ఒక వ్యక్తిని అవమాన పరచాలంటే ఆ వ్యక్తి తల గొరిగేవారిని తెలుస్తున్నది. శిరోముండనం ఒక శిక్షగా ధర్మశాస్త్రాలు పేర్కొంటున్నాయి. తలగొరగడం అవమానంగా భావించడం వల్లనే అది శిక్షగా మారింది. భాగవత పురాణంలో శ్రీకృష్ణుడు రుక్మికి తల గొరిగి అవమానపరచడం ఉంది. భారత కాలంలో కూడా ఈ శిక్ష ఉంది. దుర్యోధనుడు తనను చూచి నవ్విన పాంచాలిని పరాభవించాలనుకున్నాడు. సభకు ఈడ్పించాడు. ఆమె తల వెంద్రుకలను గొరిగించి ఉంటే ఆమె తలను తీయించిన దానితో సమానమయ్యేది కదా! ఈ ఆలోచన అతనికి రాలేదు. ఆమెను నగ్నంచేసి పతులను తలవంచుకొనేటట్లు చేయాలనుకున్నాడు. దుర్యోధనుడికి ఈ ఆలోచన రావడానికి కారణం అంతకు ముందే మనదేశంలో ఉండిన నగ్న దేవతా సంస్కృతి. ప్రాచీనకాలంలో శరీరాన్ని పూర్తిగా వస్త్రంతో కప్పుకొనే పద్ధతి లేదు. స్త్రీలైనా పురుషులైనా కట్టుబట్ట మాత్రమే ధరించే వారు. స్త్రీల వక్షాలు అనాచ్ఛాదితంగా కనిపించేవి. కొన్ని తాంత్రిక మాంత్రిక పూజల్లో పూర్తి నగ్నంగా స్త్రీలు నిలబడేవారు. ఇప్పటికీ కొన్ని దేవాలయాల్లో స్త్రీల బొమ్మలు నగ్నంగా కనిపిస్తూ ప్రాచీన సంస్కృతిని మనకు పరిచయం చేస్తున్నాయి. అభిచార హోమాల్లో నగ్నత్వం తప్పనిసరి. అతి ప్రాచీన సంస్కృతికి చెందిన దశయిది. ఈ విషయాల నేపథ్యంతో ఆలోచిస్తే ద్రౌపదికి వలువ లూడ్చడం ప్రాచీన సంస్కృతికి చెందిన అంశంగా గుర్తించవచ్చునేమో. ఇది ఇంకా పరిశీలించ వలసిన అంశం.

ఇలా తాంత్రిక దృష్టితో కాకుండా సామాజిక దృష్టితో చూస్తే స్త్రీ మాన రక్షణ చేయవలసిన పురుషుడే ఆమె మానాన్ని అగౌరవ పరచడం

ఇప్పుడు స్త్రీ అన్ని విషయాల్లో పురుషుడితో సమానమనే నినాదం వినిపిస్తున్నది. సంఘంలో క్రూరుడైన వాడు స్త్రీని పరాభవిస్తే ఆమెనాపరాభవం నుండి కాపాడగల శక్తి గలవాడు చూస్తూ ఊరకుండడం ధర్మం కాదు. భారతంలో దుర్యోధనుడు క్రూరుడు. శ్రీకృష్ణుడు కాపాడగల శక్తి గలవాడు. కౌరవసభలో కృష్ణుడీ విషయాన్ని 'సారపు ధర్మమున్ విమల సత్యము పాపముచేత బొంకుచే......' అనే పద్యంలో[16] వాచ్యంచేశాడు. ఆపదలో ఉన్న స్త్రీని కాపాడి ఆమె గౌరవాన్ని నిలపడం మన సంస్కృతిలోని గొప్పలక్షణం. శ్రీకృష్ణుడు లేకుంటే అనాడు ద్రౌపది పరిస్థితి ఏమిటి? భారతీయ సంస్కృతి అధః పాతాళానికి కుంగిపోయి ఉండేది. ఈ అంశాలను దృష్టిలో ఉంచుకున్నా ఉంచుకోక పోయినా ద్రౌపది వస్త్రాపహరణ సన్నివేశాన్ని చిత్రించిన ప్రతి సినిమాలోను ఈ ప్రయోజనం నెరవేరింది. స్త్రీ పూజనీయ అనే భావం పురుషులలో కలగడానికి ఈ సన్నివేశం ఉపకరిస్తుంది. జానపదాంశాన్ని భారతం ప్రదర్శిస్తే భారతంలోని ఆ అంశాన్ని సినిమాలలో చిత్రించి ప్రజలకు అతి సన్నిహితంగా తీసుకొని వచ్చారు సినిమా వాళ్ళు. సినిమాల మీద జానపద సాహిత్య ప్రభావం ఇంతకు మించి ఇంకేం కావాలి?

5. బాణాలు తయారుచేయడం మొదట ఆటవికులలో పుట్టింది. జంతువులను వేటాడడానికి ఇది ఉపయోగపడింది. ఆటవిక సంస్కృతి గ్రామ సంస్కృతిగా మారిన తరువాత విల్లనమ్ములకు సంబంధించిన విద్య గుర్తింపబడింది. ఇదే విలువిద్య. తరువాత సాహిత్యం దీనిని ధనుర్వేదమని పేర్కొన్నది. భారతంలో అర్జునుడు, ఏకలవ్యుడు గొప్పవిలుకాండ్రు. ఈ విద్యలో కర్ణుడు కూడా తక్కువ వాడు కాదు. భారత కథేతి వృత్త సినిమాలలో కర్ణార్జునులు తప్పక కనిపిస్తారు. భారతకాలం నాటికి ఇనుప లోహంతో శస్త్రాస్త్రాలు తయారైనట్లు సాక్ష్యాలున్నాయి. 'ఏకలవ్య' (1982) సినిమాలో బాణ విద్యలో ఏకలవ్యుని మించి పోవాలనే కోరికతో అర్జునుడు ఆ ఎరుకలవాని కుడిచేతి బొటన వేలుని ద్రోణుని ద్వారా ఖండింపజేస్తాడు. కథా విషయం ఇక్కడ అవసరం లేదు. జానపద విద్యయైన విలువిద్య భారతంలో ఎంత ప్రశస్తి పొందిందో అర్థం చేసుకోవడం అవసరం. కర్ణుడు బాణ విద్యలో నైపుణ్యం కలవాడు కావడంచేత దుర్యోధనుడు అతనిని చేరదీశాడు. కర్ణుడు లేకుంటే భారతయుద్ధం జరిగేది కాదేమో. అర్జునుడు జగదేక ధనుర్ధరుడనే నమ్మకంతో ధర్మరాజు యుద్ధానికి అంగీకరించాడు. అర్జునుడు మత్సరించడంతో

జగదేక ధనుర్ధరుడు కాగలిగిన ఏకలవ్యుడు ఆ విద్యను సరిగా ఉపయోగించుకోలేక పోయాడు. భారతంలో బాణ ప్రయోగంతో భారతదేశంలో 'ఐరన్ కల్చర్' ప్రారంభమైంది. జానపదుల బాణ లాఘవం భారతంలో ఒక విద్యగా స్థిరపడింది. మానవుని అరణ్య జీవితంలో అవసరానికి ఉపయోగపడిన విలువిద్య తరువాత ఒక కళగా మారింది.

## భారత కథలు - సినీ కల్పనలు - జానపదాంశాలు :

భారతం పురాణం కాబట్టి అందులోని కథలను యథాతథంగా సినిమాల కెక్కిస్తే అంత రంజకంగా ఉండవు. ఆ కథలను సినిమా రచయితలు సినిమా కథలుగా మార్చుతారు. ప్రధాన కథలో కొన్ని మార్పులు చేసి, కొన్ని సన్నివేశాలను కల్పించి ప్రేక్షకులకు ఆసక్తిని కలిగిస్తారు. భారతకథా సినిమాలన్నింటిలో కృష్ణుడుంటాడు. ఆయన జగన్నాటక సూత్రధారి. ఆయన లీలలు ప్రేక్షకులను అలరిస్తాయి కాబట్టి కథ ఏదైనా ఆ సినిమాలో తప్పని సరిగా కృష్ణునికి సంబంధించిన అద్భుత సన్నివేశాలు కొన్ని ఉంటాయి. అవసరం లేకపోయినా సత్యాకృష్ణుల ప్రణయ సన్నివేశాన్ని చూపించిన సినిమాలున్నాయి. తెలుగు సినిమాలలో శృంగారం, వీరం, హాస్యం ప్రధాన రసాలుగా ఉంటాయి. పౌరాణిక కథా చిత్రాలలో శృంగార వీర రసాలుంటాయి. ఈ మూడు రసాలలో జానపదులకు వీర శృంగారాలంటేనే ఎక్కువ మక్కువ. భారతీయుల లేదా తెలుగు ప్రజల మనస్తత్వం జానపద మనస్తత్వమే కాబట్టి వీళ్లకు ఈ రెండు రసాలను పోషించే కథలే బాగా నచ్చుతాయి. అందువల్ల భారత కథలలో కూడా ఈ రెండు రస భావాలను పరిపుష్టం చేయగల కథలే సినిమాలుగా వచ్చాయి.

మొన్న మొన్నటివరకు తెలుగు ప్రేక్షకుడికి సినిమా కథ అంటే జానపద కథే. ఇందులో రాజకుమారుడుంటాడు. అతడు వేటకు వెళతాడు. అడవిలో రాకుమార్తె కనిపిస్తుంది. ఆమెను ప్రేమిస్తాడు. ఆమెకు దగ్గర రాజబంధువొకడు వారిద్దరి మధ్యా అడ్డు పడతాడు. అంతలో ఈ అందాల సుందరిని పొందాలని ఒక మాంత్రికుడొస్తాడు. వాడు ఆ రాజబంధువును అంటే 'విలన్'ను కలుసుకుంటాడు. వీళ్ళిద్దరూ కలిసి రాకుమార్తెను

జరగబోయే విషయం చెబుతాడు. ఒక మంత్రం ఉపదేశిస్తాడు. ఈ మంత్ర సహాయంతో ఆ రాకుమారుడు ఆకాశంలో ఎగురుతూ ఆమెను కలుసుకుంటాడు. మాంత్రికుడితోను, విలన్‌తోను పోరాడి ఆమెను రక్షించి తీసికొని వెళ్లి ఆమె తల్లిదండ్రులకు అప్పగిస్తాడు. వాళ్లు ఆ వీరుని సాహసాన్ని కొనియాడి రాకుమార్తెనిచ్చి పెండ్లి చేసి రాజ్యానికి రాజును చేస్తారు. జానపద సినిమా కథలన్నీ ఇలాగే ఉంటాయి. ఈ సినిమాలలో కనిపించే ఉత్కంఠ భరితమైన వీరోచిత కృత్యాలు ప్రేక్షకులను ఆనంద పరుస్తాయి. తెలుగులో ఇలాంటి జానపద కథా చిత్రాలనెన్నిటినో నిర్మించి ప్రేక్షకుల ఆదరాభిమానాలను పొందిన దర్శక నిర్మాత బి. విఠలాచార్యగారు.

సినిమా ప్రేక్షకులు ఏమాశించి సినిమాకు వెళతారో తెలుసు. అందువల్ల భారత కథా చిత్రాలు నిర్మించిన వాళ్లు కూడా ప్రధాన కథతో సంబంధంలేని సంఘటనల నెన్నిటినో కల్పించారు. ఇప్పటి వరకు వచ్చిన భారత కథా చిత్రాలలోని కథలు కవిత్రయ భారతానికే పరిమితం కావు. సమకాలీన జానపద భావాలను ప్రతిబింబించే కథలను కూడా వీళ్లు వాడుకొన్నారు. శశిరేఖా పరిణయం, కృష్ణార్జున యుద్ధం కథలు భారతంలో లేవు. శశిరేఖాపరిణయమే 'మాయాబజార్' సినిమా కథ. ఈ కథలు మొదట జానపదాంశాలుగా ప్రచారమై తరువాత నాటకాలుగా మారి ఆ తరువాత సినిమాలైనాయి. కవిత్రయ భారతానికి సంబంధించని ఈ సినిమాలలో ఎలాంటి మార్పులున్నాయో, జానపదాంశాలెలా వీటిలో చేరినవో పరిశీలించవలసి ఉంది.

**(అ) మాయాబజార్ :** అప్పప్ప కవి రచించిన 'శశిరేఖాపరిణయం' అనే ప్రబంధంలో మాయాబజార్ సినిమా కథ ఉంది. ఈ ప్రబంధాన్ని వావిళ్లవారు 1954లో పీఠిక లేకుండా ప్రచురించారు. సినిమా వాళ్లు ఈ ప్రబంధాన్ని చూచినారో లేదో తెలియదు. ఈ కథ నాటకంగా కూడా వచ్చింది కాబట్టి సినిమా వాళ్లు కనీసం నాటకాన్నైనా చూచి సినిమా కథను తయారు చేసుకొని ఉంటారు. సినిమా కథకు ఈ ప్రబంధంలోని కథకుగల భేదాలను పరిశీలిస్తే సినిమా వాళ్లు ఎందుకు మార్పులు చేశారోఅర్థమవుతుంది. సినిమాలలో రేవతీ బలరాములు శశిరేఖను అభిమన్యునికిచ్చి వివాహం చేస్తామని సుభద్రకు మాట ఇస్తారు. ప్రబంధంలో -

జగదేక ధనుర్ధరుడు కాగలిగిన ఏకలవ్యుడు ఆ విద్యను సరిగా ఉపయోగించుకోలేక పోయాడు. భారతంలో బాణ ప్రయోగంతో భారతదేశంలో 'ఐరన్ కల్చర్' ప్రారంభమైంది. జానపదుల బాణ లాఘవం భారతంలో ఒక విద్యగా స్థిరపడింది. మానవుని అరణ్యా జీవితంలో అవసరానికి ఉపయోగపడిన విలువిద్య తరువాత ఒక కళగా మారింది.

## భారత కథలు - సినీ కల్పనలు - జానపదాంశాలు :

భారతం పురాణం కాబట్టి అందులోని కథలను యథాతథంగా సినిమాల కెక్కిస్తే అంత రంజకంగా ఉండవు. ఆ కథలను సినిమా రచయితలు సినిమా కథలుగా మార్చుతారు. ప్రధాన కథలో కొన్ని మార్పులు చేసి, కొన్ని సన్నివేశాలను కల్పించి ప్రేక్షకులకు ఆసక్తిని కలిగిస్తారు. భారతకథా సినిమాలన్నింటిలో కృష్ణుడుంటాడు. ఆయన జగన్నాటక సూత్రధారి. ఆయన లీలలు ప్రేక్షకులను అలరిస్తాయి కాబట్టి కథ ఏదైనా ఆ సినిమాలో తప్పని సరిగా కృష్ణునికి సంబంధించిన అద్భుత సన్నివేశాలు కొన్ని ఉంటాయి. అవసరం లేకపోయినా సత్యాకృష్ణుల ప్రణయ సన్నివేశాన్ని చూపించిన సినిమాలున్నాయి. తెలుగు సినిమాలలో శృంగారం, వీరం, హాస్యం ప్రధాన రసాలుగా ఉంటాయి. పౌరాణిక కథా చిత్రాలలో శృంగార వీర రసాలుంటాయి. ఈ మూడు రసాలలో జానపదులకు వీర శృంగారాలంటేనే ఎక్కువ మక్కువ. భారతీయుల లేదా తెలుగు ప్రజల మనస్తత్వం జానపద మనస్తత్వమే కాబట్టి వీళ్లకు ఈ రెండు రసాలను పోషించే కథలే బాగా నచ్చుతాయి. అందువల్ల భారత కథలలో కూడా ఈ రెండు రస భావాలను పరిపుష్టం చేయగల కథలే సినిమాలుగా వచ్చాయి.

మొన్న మొన్నటివరకు తెలుగు ప్రేక్షకుడికి సినిమా కథ అంటే జానపద కథే. ఇందులో రాజకుమారుడుంటాడు. అతడు వేటకు వెళతాడు. అడవిలో రాకుమార్తె కనిపిస్తుంది. ఆమెను ప్రేమిస్తాడు. ఆమెకు దగ్గర రాజబంధువొకడు వారిద్దరి మధ్యా అడ్డు పడతాడు. అంతలో ఈ అందాల సుందరిని పొందాలని ఒక మాంత్రికుడొస్తాడు. వాడు ఆ రాజబంధువును

సహాయంతో ఆ రాకుమారుడు ఆకాశంలో ఎగురుతూ ఆమెను కలుసుకుంటాడు. మాంత్రికుడితోను, విలన్‌తోను పోరాడి ఆమెను రక్షించి తీసికొని వెళ్లి ఆమె తల్లిదండ్రులకు అప్పగిస్తాడు. వాళ్లు ఆ వీరుని సాహసాన్ని కొనియాడి రాకుమార్తెనిచ్చి పెండ్లి చేసి రాజ్యానికి రాజును చేస్తారు. జానపద సినిమా కథలన్నీ ఇలాగే ఉంటాయి. ఈ సినిమాలలో కనిపించే ఉత్కంఠ భరితమైన వీరోచిత కృత్యాలు ప్రేక్షకులను ఆనంద పరుస్తాయి. తెలుగులో ఇలాంటి జానపద కథా చిత్రాలనెన్నిటినో నిర్మించి ప్రేక్షకుల ఆదరాభిమానాలను పొందిన దర్శక నిర్మాత బి. విఠలాచార్యగారు.

సినిమా ప్రేక్షకులు ఏమాశించి సినిమాకు వెళతారో తెలుసు. అందువల్ల భారత కథా చిత్రాలు నిర్మించిన వాళ్లు కూడా ప్రధాన కథతో సంబంధంలేని సంఘటనల నెన్నిటినో కల్పించారు. ఇప్పటి వరకు వచ్చిన భారత కథా చిత్రాలలోని కథలు కవిత్రయ భారతానికే పరిమితం కావు. సమకాలీన జానపద భావాలను ప్రతిబింబించే కథలను కూడా వీళ్లు వాడుకొన్నారు. శశిరేఖా పరిణయం, కృష్ణార్జున యుద్ధం కథలు భారతంలో లేవు. శశిరేఖాపరిణయమే 'మాయాబజార్' సినిమా కథ. ఈ కథలు మొదట జానపదాంశాలుగా ప్రచారమై తరువాత నాటకాలుగా మారి ఆ తరువాత సినిమాలైనాయి. కవిత్రయ భారతానికి సంబంధించని ఈ సినిమాలలో ఎలాంటి మార్పులున్నాయో, జానపదాంశాలెలా వీటిలో చేరినవో పరిశీలించవలసి ఉంది.

**(అ) మాయాబజార్ :** అప్పప్ప కవి రచించిన 'శశిరేఖాపరిణయం' అనే ప్రబంధంలో మాయాబజార్ సినిమా కథ ఉంది. ఈ ప్రబంధాన్ని వావిళ్లవారు 1954లో పీఠిక లేకుండా ప్రచురించారు. సినిమా వాళ్లు ఈ ప్రబంధాన్ని చూచినారో లేదో తెలియదు. ఈ కథ నాటకంగా కూడా వచ్చింది కాబట్టి సినిమా వాళ్లు కనీసం నాటకాన్నైనా చూచి సినిమా కథను తయారు చేసుకొని ఉంటారు. సినిమా కథకు ఈ ప్రబంధంలోని కథకుగల భేదాలను పరిశీలిస్తే సినిమా వాళ్లు ఎందుకు మార్పులు చేశారోఅర్థమవుతుంది. సినిమాలలో రేవతీ బలరాములు శశిరేఖను అభిమన్యునికిచ్చి వివాహం చేస్తామని సుభద్రకు మాట ఇస్తారు. ప్రబంధంలో -

(శశిరేఖా పరిణయం 1-76)

అని దేవకి దేవి కోరినట్లుంది. శశిరేఖాభిమన్యులది మేనరిక సంబంధం. జానపద సంస్కృతిలో మేనరికానికి ఎంతో ప్రాధాన్యత ఉంది. శశిరేఖాభిమన్యుల వివాహం నిర్ణయమైందని నారదుడు వెళ్లి దుర్యోధనునికి చెపుతాడు. శకుని సలహామేరకు యాదవ సంబంధంతో పాండవులను ఓడించడానికి పథకం వేసుకొని బలరాముని హస్తినకు ఆహ్వానించి ఆయనను సంతృప్తిపరచి లక్ష్మణ కుమారునికి శశిరేఖనడుగుతాడు దుర్యోధనుడు. ఇది సినిమాకోసం చేసిన మార్పు. తరువాత బలరాముడు శశిరేఖను అభిమన్యునకివ్వనంటాడు. అప్పుడు సుభద్ర 'మేనల్లుడుండనొరులకు, మానిని నీరాదటంద్రు మహిమాదికులున్' (శశి. 2-29) అని మేనరికాన్ని గుర్తుకు తెస్తుంది. సినిమాలో రేవతి కూడా దుర్యోధనుడు పంపిన కానుకలు చూచి కన్ను చెదరి అభిమన్యునికి కన్య నివ్వనంటుంది.

తరువాత సుభద్రాభిమన్యులు ఘటోత్కచుని వనానికి వెళతారు. సంబంధాలు తెలియక ఘటోత్కచుడు అభిమన్యుడు కొట్లాడుకుంటారు. వారిరువురి శరీరాలనుండి రక్తం కాలువలై పారుతుంది. అంతలో వ్యాసుడొచ్చివారి సంబంధం తెలుపుతాడు. అన్నదమ్ములిద్దరూ కలిసిపోతారు. సినిమాలో ఈ ఘట్టం నాటకీయంగా మారింది. యుద్ధంలో అభిమన్యుడు మూర్ఛపోతాడు. సుభద్ర కోదండం తీసికొని తాను అర్జునుని భార్య అయితే దుష్ట రాక్షసుడు నశిస్తాడంటూ బాణం వేయబోతుంది. అర్జునుని భార్య అనే మాటవిని ఘటోత్కచునికి అంతా అర్థమవుతుంది. ఇది వీరోచితమైన దృశ్యం. అర్జునుడు గొప్ప వీరుడు. అలాగే అతని కుమారుడైన అభిమన్యుడు కూడా గొప్ప వీరుడు. ఈ భావం ప్రేక్షకులలో కలిగించడానికి ఈ మార్పు అవసరమైంది. స్త్రీ కూడా వీరోచితంగా పోరాడడం జానపదాంశం. ఇష్టంలేని వాడిని ఏదో ఒక రకంగా వదిలించుకోవాలంటే వాడిని భయపెట్టాలి. ఘటోత్కచుడు మాయా శశిరేఖగా పెండ్లిపీట మీద కూర్చుంటాడు. పెండ్లిలో తెర ఎత్తినప్పుడు శశిరేఖ లక్ష్మణ కుమారునికి ఎలా కనిపించిందో ప్రబంధం ఒక సీసపద్యంలో వివరంగా వర్ణించింది.[17] గండు పిల్లిగా, పండు కోతిగా, భల్లూకంగా, కోరల

పోతుంది. ఈ దృశ్యం సినిమాలో యథాతథంగా కనిపిస్తుంది.

తరువాత పెండ్లి మానుకొని కౌరవులు యాదవులను తూలనాడడం మొదలు పెడతారు. అప్పుడు ఘటోత్కచుడు కౌరవుల మధ్య అసంఖ్యాకంగా తేళ్లు, మండ్రగబ్బలు, పాములు, పులులు, భూతాలు సృష్టించి వారిని నానాహింస పెడతాడు. "నానా విధంబుల బాధించు ఘటోత్కచుని మాయల నివారించు సామర్థ్యంబు గోవిందునకు గలిగియు నర్జునుపై బక్ష పాతంబునను గౌరవులకు గర్వ భంగంబు గావలయునను తలంపునం జేసి మౌనిమై యుండె."[18] సినిమాలో కూడా ఇలాగే చిత్రింపబడింది.

ఇనతనయాది వాక్యములె ఇంగితమంచు దలంచి పాండురా
ట్తనయుల సింహ విక్రముల దైవతనాథ సమాన మూర్తులన్
జెనకగ లేక జూదమున జేకొని సంపద వారలేవురన్
వనులకు బంపి నీవిపుడు వాసవి పుత్రునకిచ్చు చేడియన్
కొడుకుకు బెండ్లి చేసికొను కోరిక మిక్కలి మానసంబునన్
బొడమి సురేంద్రునిం దెగడు భోగముతో జనుదెంచు నిన్ను నీ
కొడుకుల బంధులన్ హితుల గూరిమి తమ్ముల నాప్త మంత్రులన్
మెడలు దెగంగనేసి రణమేదిని కిన్బలిచేసి పిమ్మటన్
సింధు పురంబున కుంజని, యంధుని పాపాత్మునంబికాత్మజు వేగన్
బంధించి తెచ్చినేడీ, సింధువునన్ ముంచిముంచి సిగదెగవైతున్[19]

అంటూ ఘటోత్కచుడు దుర్యోధనాదులను శృంగ భంగం చేస్తాడు. సినిమాలో పాండవులను గాని, వారి బంధవులను గాని, వారి బంధువుల బంధువులను గాని అవమాన పరిస్తే మీకిదే శాస్తి అంటూ ఘటోత్కచుడు వారిని గుడ్డ మూటలో బంధించి హస్తినలో పడేటట్లు చేస్తాడు. కంసారికి సీరికి మొక్కి వారి చేత దీవెనలు పొంది అతని స్థావరం చేరుకుంటాడు. అక్కడ శశిరేఖాభిమన్యుల వివాహం జరుగుతుంది. ప్రబంధం చివర ఫలశ్రుతి ఉంది.

ఈ కథ విను జనులకున్, లోక ప్రభు డబ్జ పత్రలోచను డమరా
నీకము బ్రోచిన కృష్ణుడు, ప్రాకటముగ సిరులొసంగి భవముల బాపున్"

ఇలాంటి ఫలశ్రుతి సినిమాలో కూడా ఉంది. ఘటోత్కచుడు కృష్ణుని స్తుతిస్తూ ఈ కథ రాసినా చదివినా సుఖ సంపదలు కలిగి శోభిస్తారనడంతో సినిమా ముగుస్తుంది.

శశిరేఖా పరిణయ ప్రబంధంలోని కథను సినిమా కథను పోల్చి చూస్తే పెద్ద తేడాలు కనపడవు. సినిమాకు 'మాయాబజార్' అని పేరు పెట్టడం వల్ల మాయలు మంత్రాలకు సంబంధించిన సరంజామా కల్పించ వలసి వచ్చింది. ఘటోత్కచుని గురువైన చిన్నమయ్య మాయతో ఒక బజారును సృష్టిస్తాడు. ఆ బజారులో సమస్త వస్తువులు దొరుకుతాయి. చిన్నమయ్య మాయతో నిర్మించిన భవంతి పెళ్లివారి విడిది. బజారులో చిన్నమయ్య సృష్టించిన వస్తువులను చూచి కౌరవులు, వారి వెంట వచ్చిన వాళ్లు ఆశ్చర్యపోతారు. యాదవులు బహు చక్కగా పెండ్లి ఏర్పాట్లు చేశారనుకుంటారు. చిన్నమయ్య రత్నకంబళి సృష్టిస్తే తుంటరులైన కౌరవ పురోహితులు రత్నగింబళి కావాలంటారు. చిన్నమయ్య దానినీ సృష్టిస్తాడు. వాళ్లు దానిమీద కూర్చుంటారు. అది రెండు వైపులా ముడుచుపోయి వారిని నానా ఇబ్బందులు పెడుతుంది. అలాగే చిన్నమయ్య తల్పం సృష్టిస్తే వాళ్లు గిల్పం కావాలంటారు. చిన్నమయ్య దానినీ సృష్టిస్తాడు. వాళ్లు గిల్పంమీద కూర్చుంటే అది వారిని గిరగిరా తిప్పి బోర్లపడేటట్లు చేస్తుంది.

మంత్రదండం, వస్తువుల సృష్టి, మాయా శశిరేఖ, అసలు శశిరేఖ మాయం, ఘటోత్కచుడు పెళ్లి భోజనమంతా తినడం మొదలైనవన్నీ జానపద కథలకు సహజ విషయాలు. 'ప్రియదర్శిని'ని (ఇప్పటి కంప్యూటర్ తెరలాంటిది) మొట్టమొదట ఈ సినిమాలోనే చూపించడం జరిగింది. ఆ తరువాత ప్రతి జానపద చిత్రంలో అది మాంత్రికుడు అందాల రాకుమారిని చూడడానికి తగిన అద్దంగా మారిపోయింది. జానపదుల అభిరుచికి తగిన ఈ సామగ్రి ఉండడం చేతనే ఈ సినిమా పౌరాణిక చిత్రమైనా జానపద చిత్రంవలె ఇప్పటికీ ప్రేక్షకులను అలరిస్తున్నది.

ఈ సినిమాలో ప్రధానమైన జానపదాంశం మేనరికం. శశిరేఖాభిమన్యులు మేనమామ మేనత్త బిడ్డలు. కొన్ని అవాంతరాలు కలిగినా చివరకు వారి వివాహం జరుగుతుంది. ఈ వివాహ సంబంధంతో శశిరేఖాభిమన్యులు, వారి తల్లి దండ్రులు, చుట్టాలు తెలుగు వాళ్లైపోయారు. ఈ సినిమా సాధించిన విజయానికి ఇదికూడా ప్రధాన కారణం. ఇక్ష్వాకుల నాటి నుండి తెలుగు దేశంలో మేనరిక వివాహ వ్యవస్థ ఉంది.

తోవేటి సీతారామయ్య 'శశిరేఖా పరిణయం' అనే పదం రాశాడు (1883). ఇందులో కథంతా ఏమి మార్పు లేకుండా ఉంది. అభిమన్యుడు

చిలుకతో శశిరేఖ సౌందర్యం వర్ణించి చెప్పడం, శశిరేఖ అదే చిలుకతో అభిమన్యుని గురించి చెప్పడం ఈ పదంలోని ప్రత్యేకత. ఇదే కథను శశిరేఖా పరిణయం - బతుకమ్మ పాట'గా పట్టెము దశరథయ్య రాశాడు. ఈ కథలో సుభద్రా బలరాములు పరస్పరం నిందించుకుంటారు. బలరాముడు సుభద్రను మెడబట్టి గెంటిస్తాడు.[20]

**(ఆ) కృష్ణార్జున యుద్ధం :** ఈ సినిమాకు మూలం గయోపాఖ్యానం. గయోపాఖ్యాన కథకు మూలమేమిటో తెలియదు. ఈ కథకు ఆంధ్ర దేశంలో బహుళ ప్రచారముంది. ఒక్కటే ప్రాణంగా ఉండిన కృష్ణార్జునులు పరస్పరం పోరాడుకున్న ఈ కథ కృష్ణదేవరాయల కాలంలో కావ్యరూపంలో వచ్చింది. చరిగొండ ధర్మన 'చిత్ర భారతం'లో కృష్ణార్జునుల యుద్ధం ఉంది. ఈ కథలో గయుడు లేడు. గయుడు స్థానంలో చతుర్ధన మహారాజు కనిపిస్తాడు. ఇతనికి అర్జునుడు అభయమిచ్చి కృష్ణునితో వైరం తెచ్చుకోవలసి వస్తుంది. చిత్ర భారతంలోని ఈ కథ బ్రహ్మాండ పురాణంలో ఉందట.[21] ఇలావంతునికి శుకయోగి చెప్పిన ఈ కథను నైమిశారణ్యంలో సూతుడు శౌనకాది ఋషులకు చెపుతాడు. గయుడి కారణంగా కృష్ణార్జునుల మధ్య యుద్ధం సంభవించిన కథ మొదటిసారిగా నాదెండ్ల గోపమంత్రి రచించిన 'కృష్ణార్జున సంవాదం'లో కనిపిస్తుంది. కృష్ణార్జున సంవాదం లోని కథననుసరించి తరువాత గయోపాఖ్యాన కథలెన్నో తెలుగులో రచింపబడినాయి. ఈ కథను రామయామాత్యుడు రెండాశ్వాసాల కథగా రాశాడు.[22] ఈ కథలో గయుడు శ్రీకృష్ణుని చేతులలో ఉమిసిన కథ ఉంది. ఇదే కథను చిలకమర్తివారు నాటకంగా రాశారు. "మొట్టమొదట అది కేవలము వచనముగానే వ్రాయబడినది. వచనమును అర్థవంతముగా చదువుటలోను, రసమును బట్టి ముఖ వైఖరిని కంఠస్వరమును మార్చుటలోను నిపుణులైన శ్రీయుతులు హనుమంతరావు నాయుడు (గయుడు), ప్రకాశం పంతులు (చిత్రరేఖ-అర్జునుడు), దుర్గి గోపాల కృష్ణారావు (శ్రీకృష్ణుడు), ఐనవోలు తాతయ్య నాయుడు (కౌశికుడు) గార్లచే ఈ వచన నాటకము బాగుగా రక్తికట్టినది. వ్రాతప్రతిని సవరించి ముద్రించినప్పుడు కూడ వచన భాగములో మార్పులేదు. పద్యభాగమంతయును మాత్రము నూతనముగ జేర్పబడెనట. అచ్చుపడిన వెంటనే ప్రతులు శనగపప్పువలె ఖర్చుపడినవట. లక్ష్మీ నరసింహంగారు 1942లో స్వీయ చరిత్ర వ్రాయునప్పటికి లక్ష ప్రతులమ్ముడు పోయినవని అంచనా వేయబడెను".[23]

ఈ నాటకంలో నాయకుడు అర్జునుడు. అతనిలో శౌర్యం, ధర్మనిష్ఠ ఉన్నాయి. అప్పటికే బాగా ప్రచారమై ప్రజలలో ఉత్సాహాన్ని రేకెత్తించిన కృష్ణార్జునుల పాత్రలు ఈ నాటకంలో పరస్పరం పద్యాలతో మాట్లాడుకోవడం, నిందించుకోవడం ప్రేక్షకుల ఉత్సాహం ద్విగుణీకృతం కావడానికి కారణమైంది. సులభ శైలిలో చిన్న చిన్న పదాలతో హృదయంగమంగా ఉండిన పద్యాలు ఈ నాటకానికి మంచి ప్రచారం తెచ్చాయి. ఇదే కథను ధేనువకొండ తిమ్మయ్య జంగం కథగా రాశాడు. జానపదులకు మిక్కిలి ప్రీతికరమైందీ కథ. యాదవులు పాండవులు యుద్ధానికి పూనుకోగా ఈ యుద్ధంలో కౌరవులు పాండవ పక్షం వహించి యాదవులతో పోరుతారు. యాదవ పాండవ యుద్ధం నారదుని ద్వారా విని ధృతరాష్ట్రుడు సదుద్దేశంతో దుర్యోధనాదులను పాండవులకు సహాయపడమని పంపిస్తాడు. ముందు కృష్ణుని నిర్జిస్తే తరువాత పాండవులను ఓడించడం సులభమన్న ఉద్దేశంతో దుర్యోధనాదులు పాండవులకు సహాయపడతారు. ఈ యుద్ధంవల్ల జరిగే ప్రళయాన్ని వివరించి శివుడు కృష్ణార్జునుల మధ్య సంధి చేస్తాడు. చివర కృష్ణుడు అర్జునునితో "కౌరవ్యులకును నీకును ముందని కాగలదని తలచి, అపుడు వారిని గెల్చెదో గెలువవొయని మదినూహించి, ఇప్పుడు నిర్నిమిత్తము తారసిల్లి నేనితం జేసినా"[24]నని చెపుతాడు.

చిలకమర్తి వారి నాటకంలోని కథ యథాతంథంగా సినిమాలో ఉంది. యుద్ధంలో కౌరవులు పాండవులకు సహాయం చేసినట్లు లేదు. ఔచిత్యం కోసం సినిమా రచయిత "యుద్ధం కేవలం కృష్ణార్జునుల మధ్యనే జరుగుతుంది. మిగిలిన వారెవరూ ఇందులో జోక్యం చేసుకోవద్దు". అని కృష్ణుని చేత చెప్పించాడు. సినిమాలో సుభద్ర యతి వేషంలోని అర్జునుని సేవింటడం, సుభద్రార్జునుల వివాహం, అలాగే చినముని చంద్రికల వివాహం (చినముని యతివేషంలోని అర్జునుని శిష్యుడు), ఖాండవ దహనం, గయుని వృత్తాంతం, కృష్ణార్జునుల మధ్య అంటే యాదవ పాండవుల మధ్య అక్రూర సుభద్రల రాయబారాలు, కృష్ణార్జునుల యుద్ధం మొదలైన ప్రధాన విషయాలున్నాయి. సినిమా రచయిత ప్రధాన కథనలాగే ఉంచి ప్రేక్షకుల కవసరమైన శృంగార వీర హాస్య రస స్ఫోరకమైన చిరు కల్పనలు చేశాడు. సత్యభామ అలగడం, కృష్ణుడామెను సాంత్వన పరచడం, రుక్మిణీ సత్యలు సుభద్రను మరదలుగా బాగా ఆదరించడం, రైవతకాద్రిలో విడిది చేసిన కపటమునికి ఒక శిష్యుని, ఆ శిష్యునికొక ప్రియురాలిన్ని కల్పించి పెట్టడం, చినముని చంద్రికల

మధ్య జరిగే సంభాషణలో యోగవిషయాలను శృంగార పరంగా స్ఫురింప జేయడం, శ్రీకృష్ణార్జునుల పరస్పర నిందారోపణలో గుప్తంగా ఉండవలసిన వారి చిన్ననాటి చేష్టలు బయట పడడం మొదలైనవి సినిమా రచయిత కల్పించిన చిరు కల్పనలు.

'కృష్ణార్జున సంవాదం'లో నాదెండ్ల గోపమంత్రి అర్జునునికి యుద్ధంలో సహాయం చేయడానికి వచ్చిన దుర్యోధనుడు కృష్ణుని అధిక్షేపించినట్లు చూపినాడు. ఆ ద్విపద పంక్తులివి -

"కోపింప గోపాల కులమూకగాదు, చూపట్టు ప్రతి భటస్తోమంబుగాని
విన గోపికా గీత వినతులు గావు, తనరిన హయహేషితంబులుగాని
సరినెక్క గేలికా చలములు గావు, సరభస మత్త కుంజరములుగాని

..........................................................................

గోపాల నీకేల ఘోర యుద్ధంబు, భూపాలడవు గావు పొమ్మని యేసె". ఈ అధిక్షేపణాన్ననుసరించి తరువాత నాటకాలలో కృష్ణార్జును లిరువురు పరస్పరం అధిక్షేపించుకున్నట్లు కల్పించబడింది. సినిమాలో కూడా

"ఎగ్గు సిగ్గులు లేక ఏక చక్రపురాన
తిరిపమెత్తిన నాడు తెల్లమాయె" అని కృష్ణుడు అర్జునుని నిందిస్తే

"నల్లపిల్లివోలె ఇల్లిల్లు దిరుగుచు
పాల్వెన్న దొంగిలి ప్రబలలేదె" అని అర్జునుడు కృష్ణుని నిందిస్తాడు. ఈ దృశ్యాన్ని ఆకాశం నుండి నారదుడు తృప్తిగా వీక్షించినట్లు సినిమాలో చిత్రింపబడింది.

వ్యాస, కవిత్రయ భారతాలలో లేని ఈ కథ జానపదుల చేత కల్పించబడి మొదటిసారిగా నాదెండ్ల గోపమంత్రి చేత గ్రంథస్థం చేయబడింది. అందువల్ల ఈ కథలోని ప్రతి అంశమూ జానపదీయతను వెల్లడించేదే. గంజాయి పీలుస్తూ పల్లె ప్రాంతాల్లో యాచన కోసం తిరుగుతూ కనిపించే సన్యాసులకు ప్రతినిధిగా ఈ సినిమాలో 'చినముని' కనపడతాడు. వీళ్లు కపట సన్యాసులు. కాషాయ వేషం వేసి కాయాన్ని అన్ని రకాలుగా సుఖపెట్టే ప్రయత్నం చేస్తుంటారు. పైకి సన్యాసులమని చెప్పుకుంటూ రహస్యంగా స్త్రీ సంగమం కోసం కూడా

ప్రయత్నించి దానినీ సాధిస్తుంటారు. ఇలాంటి సన్యాసి కాకపోయినా చినముని యోగమార్గం వదలి భోగమార్గంలో పడి చంద్రిక కౌగిలిలో సుఖించడం సినిమా చూపిస్తుంది. తీర్థయాత్రలకు బయలుదేరు నపుడు అర్జునుని వెంట చెలికాడుగా వచ్చినవాడు ధౌమ్యుని కొడుకైన విశారదుడు. కాని ఈ సినిమాలో అర్జునుని వెంట వచ్చినవాడు విశారదుడు కాదు. చినముని అనే పేరుగల ఒక జానపద సన్యాసి.

సుభద్రార్జునుల వివాహానంతరం బలరాముడు తనకు తెలియకుండా ఆ వివాహం జరిపించాడని కృష్ణుని నిందిస్తూనే కనీసం సుభద్రకు సారెపెట్టి పంపడమైనా ఏ లోటు రాకుండా చూడమని సలహా ఇస్తాడు. 'సుభద్రసారె' ఒక జానపదాంశం. ఈ కథ నన్నయ భారతంలో ఉన్నా సుభద్రకు సారె పెట్టి పంపినట్లు లేదు. సుభద్రార్జునులు ఇంద్ర ప్రస్థపురానికి వెళ్లిన తరువాత బలరామ కృష్ణులు పాండవుల కందరికీ కానుకలు తీసుకొని వెళ్లి ఇస్తారు. సినిమాలో కూడా ఈ ప్రస్తావన ఉంది. సారెపెట్టి రుక్మిణీ సత్యలు సుభద్రను సాగినంపినట్లు సినిమాలో చూపబడింది. భారత పరంగా 'సుభద్ర సారె' అనే పాట దేశంలో ప్రచారంలో ఉంది. సారెపెట్టడం మేనరికమంత ప్రాచీనమైన సంప్రదాయం. జానపద సంస్కృతి నుండి ఈ సంప్రదాయం శిష్ట సాహిత్యాని కెక్కింది. ఒకరోజు సుభద్రార్జునుల మధ్య వివాదం కలిగింది.

"పున్నమనాడైన బూరెలు వండుకొని
పుణ్యుడా రమ్మని పిలిచిరె మీవాళ్లు
అమవాస్యనాడైన అట్లు వండుకొని
అల్లుడా రమ్మని పిలిచిరె మీవాళ్లు" అంటూ సాగదీసి అర్జునుడు అత్తవారింటి నుండి తనకేమీ రాలేదంటాడు.

అందుకు సుభద్ర

"మా వాళ్లు పేదోళ్లు మాకేమి గలదు
పెట్టగల పెద్దింట పెండ్లాడితేను
అచ్చటలు ముచ్చటలు నన్నియును జరుగు" అంటుంది. అర్జునుడు కోపపడి ఆమెను తన్ని కోపం తీర్చుకొంటాడు. ఆమె అమ్మవారింటికి వెళుతుంది. కృష్ణుడామె నోదార్చి కొన్నాళ్లుంచుకొని వస్త్రభూషణ వస్తు వాహనాలు, పసుపు

కుంకుమలు సారె బెట్టి పంపుతాడు.[25] ఇన్ని సిరులు సుభద్ర కొనిపోవడం వదినెలకు నచ్చదు. వాళ్లు కోపంతో ఇల్లు విరుసుకుపొమ్ము, వండిన వంటకం ఎత్తుకొని పొమ్ము, కట్టుకొను బట్టొకటి ఉంచకము" అని దెప్పుతారు. ఈ జానపద సంప్రదాయం నుండి సినిమాకూడా తప్పించుకోలేక పోయింది. సినిమాలో రుక్మిణీ సత్యలు సుభద్రను దెప్పి పొడవకుండా సాగనంపుతారు. ఈ సంప్రదాయం కావ్య సాహిత్యంలో బాగా శిష్టత్వం పొందింది. ప్రతి కావ్యంలో సారె ప్రస్తావన ఉంది. సినిమాలో వదినెలు దెప్పకుండా సుభద్రను సాగనంపడానికి కారణం వాళ్లు శిష్టులు కావడమే. శిష్ట స్త్రీలు ముఖం మీద ఏమీ అనరు.. ఎవరికీ తెలియకుండా భర్తను సాధిస్తారు.

**(ఇ) ప్రమీలార్జునీయం :** స్త్రీలు అన్ని విషయాలలో పురుషుల కంటే తక్కువేమీ కాదని చాటడానికి ఈ సినిమా పనికొస్తుంది. సినిమా తీసినవాళ్లు ఈ సిద్ధాంతం ప్రచారం చేయకపోయినా సినిమాలోని స్త్రీ పాత్రల సంభాషణలను బట్టి స్త్రీల ఔన్నత్యాన్ని నిలబెట్టడానికి ఈ సినిమా నిర్మితమైనట్లు భావించవచ్చు. ఈ సినిమా కథ నాటకాలలోని కథ ననుసరించి తయారైంది. నాటకాలకు మూలం జైమిని భారతంలో గల స్త్రీ మండల వృత్తాంతం. పాండ్య మండలంలో ప్రమీల అనే ఒక స్త్రీ ఉంది. ఎందరో స్త్రీలచేత సేవింపబడే ఆమె అతి సాహస వంతురాలు. అక్కడి స్త్రీలు ఆ మండలానికి వచ్చిన పురుషులను తమ అందంతో ఆకర్షించి కామతంత్ర పరవశులను చేస్తారు. తరువాత కొంతకాలానికే ఆ పురుషులు ధాతుక్షయతో మరణిస్తారు. ఈ విషయాలను తెలిపే పద్యాలివి -

"ఈ సరణి కామతంత్రా, భ్యాస పరిశ్రాంతి మిగుల బరవశమైనన్
నాశిలి ధాతుక్షయమై మాసము లోపలన వాడు మరణము నొందున్"

"తోడగతి చేయుదురు వానితోరమించు
కొంతలందరు నందోర్తు గర్భమైన
నిలుచు నమ్మాన వతికి జన్మించెనేని
కొడుకు గానేర డెపుడాడపడుచు కాని" (జైమిని భారతం 5-108, 109) ఇది ఆ మండల చరిత్ర. అక్కడి స్త్రీలు గర్భవతులైతే ఆడ శిశువులే పుడతారట. మగ పిల్లలను వాళ్లు ద్వేషిస్తారు. ఇంతకు మించిన Feminism మరేముంటుంది.? అలాంటి మండలంలోకి అర్జునుని యాగాశ్వం వెళ్లింది.

దానిని ప్రమీల పట్టింది. ప్రమీలార్జునుల మధ్య యుద్ధం ప్రారంభమైంది. ప్రమీల అర్జునుని మోసగింప దలచి

"సోమ పానంబు నీయగ్ర జూడొనర్చి
యిష్టఫల భోగముల బొందనిమ్ము నీవు
నిట మదీయా ధరామృతం బెలమిగ్రోలి
యువతి మండలమున కెల్ల నొడయడగుము" (జైమిని. 5-117)

అంటుంది. 'నిన్ను వరిస్తే చావు తప్పదు. చచ్చిన తరువాత యువతి మండలం ఏలడం సాధ్యం కాదు." అంటాడు అర్జునుడు. దైవికంగా అతడు తన దేశం వచ్చాడని, వచ్చిన తరువాత ప్రాణాలతో పోవడం సాధ్యం కాదని[26] ప్రమీల హెచ్చరిస్తుంది. ఇరువురి మధ్య భీకర సమరం జరుగుతుండగా అశరీరవాణి అర్జునునితో-

"పదివేలేడులు పోరిన, దుది నెప్పుడు గెల్వునీకు దుర్లభమిపుడీ
సుదతి వరియించి హయమును గదలింపుము ముదము
తోడ గరిపురికి.........." (జైమిని. 5-123)

అంటుంది. అర్జునుడు దానికంగీకరించి ప్రమీలను వరిస్తాడు. తరువాత ఏమయిందో ఈ గ్రంథంలో స్పష్టంగా లేదు.

అల్లి అనే ఒక పాండ్యరాజ కన్య అర్జునుని వివాహమాడిన వృత్తాంతాన్ని పుగళేంది తమిళంలో ఒక కావ్యంగా రాశాడు.[27] 'అల్లిరాణి కథ'ను తమిళ దేశ ఉత్తర సరిహద్దులోని ఆంధ్ర ప్రాంతంలో జంగం కథగా చెప్పడం ఉంది. ఈ కథ జానపద కథే. తమిళ దేశం నుండి భారతానికి సంబంధించిన ఈ జానపద కథ తెలుగులోకి వచ్చింది. ఈ అల్లిరాణే ప్రమీల అని విశ్వశించవచ్చు. తమిళంలో గల భారతాలలో ధర్మరాజు పట్టాభిషేకం వరకే ప్రధానంగా కథ ఉంటుంది. తరువాత స్వర్గారోహణ పర్వం వరకు గల కథ జానపదులు ప్రచారం చేసిందే. కన్నడ దేశంలో కూడా మూలంలో లేని అనేక భారత కథలు జానపదుల ప్రచారంలో ఉన్నాయి. తెలుగులో కవిత్రయ భారతం వైశం పాయన ప్రోక్తం. పైగా దీనిలో 18 పర్వాల కథ సమగ్రంగా ఉంది. కన్నడంలో 'విక్రమార్జున విజయం' అనే పేరుగల భారతం అర్జున నాయకం. 'గదాయుద్ధం' అనే భారతం భీమ నాయకం. ఈ పేరను

బట్టి కన్నడంలో మూల భారతం పూర్తిగా అనువదింప బడలేదని చెప్పవచ్చు. తెలుగులో 19వ శతాబ్ది చివర వచ్చిన భారత కథా నాటకాలపైన తమిళ కన్నడ దేశాలలో జానపద కథలుగా ప్రచారంలో ఉండిన భారత కథల ప్రభావం ఉంది. ఇటువంటి నాటకాల ననుసరించి భారత కథ సినిమాలు వచ్చాయి. అందువల్ల వాటిలో కవిత్రయ భారత కథలతో బాటు ఇతర కథలు కూడా కనిపిస్తాయి. అలాంటి కథలలో 'ప్రమీలార్జునీయం' సినిమాకు తీసుకొన్ని కథ ఒకటి.

జానపదాంశాలు కావ్యాలలో శిష్ట విషయాలైనట్లు, సినిమాలలో కూడా శిష్టవిషయాలై కనిపిస్తాయి. దీనికి కారణం సంప్రదాయబద్ధంగా కొనసాగి వస్తున్న జానపదాంశాలకు సమకాలీన జీవనపు తొడుగులు తొడిగి సినిమాలలో చూపించడం. జైమిని భారతంలోగల లైంగిక కార్యం ద్వారా పురుషులను చంపాలనుకొనే విషయం సినిమాలో తీసేశారు. ప్రమీల అర్జునుని తనను వరించమని అడగడానికి మారు సినిమాలో అర్జునుడే ఆమె ఆకర్షణలో పడిపోతాడు. జానపదాంశాలను ఇలా మార్చడం వల్ల స్త్రీ శక్తిని ప్రతిష్ఠించాలన్న సినిమా కథోద్దేశం నెరవేరింది.

శ్రీ కృష్ణుని సహాయం లేకుండా అర్జునుడేమీ చేయలేడని జానపద కథలలో ఉంది. జానపదులు శ్రీ కృష్ణునిలో దివ్యత్వం చూడడం దీనికి కారణం. కృష్ణుని దేవుడుగా నమ్మినా కార్యకారణ, సాధ్యా సాధ్య సంబంధంతో కృష్ణతత్వాన్ని వివరించడం సాధారణంగా శిష్టులు చేసేపని. జానపదుల దృష్టిలో శ్రీకృష్ణుడు ఈ విశ్వాన్ని క్షణంలో మాయ చేయగలడు. జానపదులలోని ఈ ఆలోచన సినిమాలో ప్రమీలలో ఉన్నట్లు చూపించారు. వీర విక్రమాల్లో ప్రమీలను మించిన వారెవరైనా ఉన్నారా అని ప్రమీల నారదుని అడిగితే నారదుడు సవ్యసాచి కలడంటాడు. కృష్ణుని సహకారమే లేకుంటే అతడేమీ చేయలేడని ప్రమీల అర్జునుని పరాక్రమాన్ని తక్కువచేసి మాట్లాడుతుంది. ప్రమీలార్జునుల వివాహం శ్రీ కృష్ణుని సహాయంతోనే జరుగుతుంది. సినిమా చివర ఈ అంశం నిరూపించ బడుతుంది.

యుద్ధ సందర్భంలో ప్రమీలార్జునులు ఒకరి నొకరు పద్యాలలో నిందించు కొంటారు. ఇదికూడా నాటకాల నుండి సినిమాలోకి వచ్చిందే. కృష్ణార్జున యుద్ధం (1963) సినిమాలో యుద్ధ సందర్భంలో కృష్ణార్జునులు

పద్యాల్లో ఒకరినొకరు నిందించుకోవడం ఉంది. ఈ జానపదాంశానికి ఆ రోజుల్లో విశేషమైన ప్రజాదరణ లభించింది. పల్లెటూరి వారు పొలాలలో పనిచేస్తూ ఆ పద్యాలు పాడుకొని ఆనందించేవారు. ఈ కీలకాంశాన్ని సినిమావాళ్లు గ్రహించారు. పాండవ వనవాసం (1965) సినిమాలో కూడా భీమ సుయోధనులకు సంవాద పద్యం ఉంది. జైమిని భారతంలోని కథలను ప్రత్తి గొడుపు రాఘవరాజు హరికథలుగా రచించాడు.[28] ఈ హరికథలలో ప్రమీలార్జునీయం కూడా ఉంది. అందులోని సంవాద పద్యాలివి.

"కన్నుగొట్టి విటుల కౌగలించుటకంటె
ముష్టి యెత్తమేలు కష్టమైన
ప్రమిల రాజ్యసీమ పడతుల బ్రతుకేమొ
వెగటు గల్గి నవ్వు జగమెరుంగు" అని అర్జునుడు అనగా

"తల్లి చేసిన తప్పులు దాచిపెట్టి
పరుల తప్పులు వెదకి యేకరువు బెట్టు
మందుడా కర్ణుడీల్గిన మచ్చయెటుల
జచ్చునోయి జగంబున చాటుగాగ" అని ప్రమీల వెటకారం చేస్తుంది.

ఈ హరికథలో కృష్ణుడు మాయా అర్జునుని సృష్టించి ప్రమీల దగ్గరకు పంపిస్తాడు. మాయా అర్జున ప్రమీలల సమాగమం జరుగుతుంది. అర్జునుడు బొళ బొళ నెత్తురు గ్రక్కుతూ మంచంమీద పడిపోతాడు. ప్రమీల పరమేశ్వరిని ప్రార్థించి ఆమె ద్వారా కృష్ణమాయా ప్రభావంతో అర్జునునికి దుష్టవ్యాధి వచ్చిందని తెలుసుకుంటుంది. రాజవైద్యులు ఆ వ్యాధి సురత దోషం వల్ల కలిగిన వ్యాధిగా నిర్ణయిస్తారు. ఈ వ్యాధి ప్రమీలకు కూడా ఉంటుంది. ఈ వ్యాధిని నివారించిన వారికి తన రాజ్యంలో అర్ధరాజ్యం ఇస్తానని ప్రమీల ప్రకటిస్తుంది. కృష్ణుడు కపట మాంత్రికుడుగా వచ్చి వ్యాధిని నయం చేస్తాడు. జానపదులకు బాగా నచ్చే విషయాలివి. సినిమాలో కృష్ణమాయ మరొక రకంగా ఉంది. కృష్ణుడే ప్రమీల వేషంలో వచ్చి అర్జునుని ఆమె మందిరానికి తీసుకొని పోతాడు. ప్రమీలార్జునులు రహస్యంగా కలుసుకుంటూ ఉన్నట్లు రాణి పరివారంలోని స్త్రీలకు తెలుస్తుంది. వాళ్లు ప్రమీలను నిలదీస్తారు. కథ ఎలా మారినా ప్రమీలను తికమక బెట్టే మాయా సన్నివేశాలు సినిమాలో ఉండడం జానపదీయత.

(ఈ) బభ్రువాహన : ఈ కథ నన్నయ భారతం ఆదిపర్వం ఎనిమిదవ ఆశ్వాసంలోను, తిక్కన భారతం అశ్వమేధ పర్వం చతుర్థాశ్వాసంలోను ఉంది. ఈ రెండు తావులలోను ఈ కథ సంక్షిప్తంగా ఉంది. ఇదే కథ జైమిని భారతంలో విపులంగా ఉంది. బభ్రువాహన హరికథ అర్జునుడు చనిపోయిన సందర్భంలో నారదుడు వచ్చి నాగలోకం వెళ్లి సంజీవనమణి తెచ్చి తండ్రిని బతికించమని బభ్రువాహనునికి చెప్పినట్లు చూపింది.[29] జైమిని భారతంలోను కవిత్రయ భారతంలోను ఉలూపి సంజీవన మణికోసం బభ్రువాహనుని నాగలోకం పంపినట్లుంది. ఈ కల్పనలన్నీ జానపదులకు ప్రీతిని కలిగించేవే. కథలో ఆశ్చర్యకరమైన మార్పులెన్ని ఉంటే అంతగా జానపదులు సంతోషపడతారు.

బభ్రువాహనుని తల్లి చిత్రాంగదనే కొందరు 'అల్లి' అని పిలుస్తారట. మరికొందరు పాండ్యదేశంలోని మరొక రాజకన్యను 'అల్లి' అంటారట.[30] ఆడపెత్తనాన్ని తమిళదేశంలో 'అల్లిరాజ్యం' అని వ్యవహరించడం ఉంది. అక్కడ నుండి ఈ అంశం ఆంధ్రదేశానికి కూడా వచ్చి వ్యాపించింది. ఇది జానపదుల భావన. చిత్రాంగద పాండ్యుల ఆడపడుచుగా తమిళ భారతాలు చెపుతున్నాయి. శివానుగ్రహంతో పాండ్యరాజులకు ఒక పుత్రుడు జన్మించడం ఆనవాయితీ. ఆక్రమంలో ఒక పాండ్యరాజుకు కొడుకు జన్మించకుండా చిత్రాంగద పుడుతుంది. చిత్రాంగధార్జునుల పుత్రుడు పాండ్యవంశ రాజవుతాడు. ఆకారణం వల్లనే పాండ్యులకు భారతమంటే అత్యంత భక్తి శ్రద్ధలట. పాండ్య దేశంలో భారతానికి గల ఆదరం భారతానికి సంబంధించిన జానపద కథలెన్నో పుట్టడానికి, తరువాత అవన్నీ ఆంధ్రదేశం రావడానికి దోహదం కలిగించదని పండితుల అభిప్రాయం. నిశితంగా పరిశీలిస్తే ప్రమీల కథలోను, బభ్రువాహనుడి కథలోను జానపదాంశాలెన్నో చేరాయి. పైగా ఈరెండూ దక్షిణ దేశంలోనే జరిగిన జానపద కథలు. ఉత్తర భారతానికి చెందిన సుభద్రకథ ఎక్కువ మార్పులు లేకుండా మూల విధేయంగానే ఉంది. 'సుభద్రసారె' లాంటి కథలు ఆంధ్ర దేశంలోని ప్రాచీన సంప్రదాయాలను నిలబెట్టడానికి ఏర్పడిన జానపదుల ఆలోచనలు.

ఇవన్నీ తినడం ఒకరికి సాధ్యమా అని అర్జునుడంటే భీముని తమ్ముడు భీమునిలాగే తింటాడనుకున్నా నంటుంది చిత్రాంగద. 'భీమునివలె తినలేను అయన లాగా రక్కసిని వరించలేను' అని అర్జునుడంటే పోనీ చక్కని చుక్కనే వరించమంటుంది చిత్రాంగద. మరొక రోజు చిత్రాంగద అర్జునుని చూడకుండా ఉండలేక యువరాజు వేషంలో వస్తుంది. విజయుడు ఈ గుట్టును రట్టుచేస్తాడు. అర్జునుని బతికించడానికి ఉలూచి బభ్రువాహనుని సంజీవని మణికోసం నాగలోకానికి పంపుతుంది. మణి ఇవ్వడానికి ఉలూచి తండ్రి అంగీకరించినా ఉలూచిని ప్రేమించి ఆమెచే తిరస్కరింపబడిన ధృతరాష్ట్రుడనే నాగరాజు అంగీకరించడు.. అతనితో బభ్రువాహనునికి పెద్ద యుద్ధమవుతుంది. అంతకు ముందే అర్జునుని శిరస్సును తన మాయా ప్రభావంతో ధృతరాష్ట్రుడు తెచ్చి భద్రపరుస్తాడు. ఈ సంఘటనలన్నీ జానపద కథాంశాలు.

ఉలూచి ఒక బాణం బభ్రువాహనునికిచ్చి అర్జునునితో యుద్ధానికి అతనిని సిద్ధంచేస్తుంది. తన విషయం తెలిసి కూడా యజ్ఞాశ్వాన్ని బంధించాడని కొడుకు మీద అర్జునునికి కోపం. కొడుకుగా తనను సరిగా గుర్తించలేదని బభ్రువాహనునికి కోపం. ఈ సందర్భాన్ని ఉలూచి బాగా ఉపయోగించుకొన్నది. జైమిని భారతంలోను, బభ్రువాహన హరికథలోను కొడుకు తండ్రి దగ్గర కెళ్లి తనవాళ్లు తెలియక అశ్వాన్ని కట్టివేశారని తనను క్షమించి తండ్రి ప్రేమను చూపమని అడిగినట్లుంది. అర్జునుడందుకు అంగీకరించకుండా చిత్రాంగద ఒక భీరువుకు నిన్నుకన్నదా అని బభ్రువాహనుని నిందిస్తాడు. తల్లినలా అన్నందుకు బభ్రుకు కోపం వచ్చి యుద్ధానికి సిద్ధమౌతాడు. ఈ కల్పన సినిమాలో లేదు. అర్జునుని గంగ శపించడం. ఆ విషయం తెలిసి ఉలూచి ఆశాపాన్ని పోగొట్టే ప్రయత్నంచేయడం కారణాలుగా అర్జునుని బభ్రువాహనుల యుద్ధం జరిగినట్లు సినిమా చూపించింది. అర్జునుడు మరణించిన తరువాత చిత్రాంగద ఉలూచిని నిందిస్తుంది. అపుడు ఉలూచి గంగ శాప విషయం చెపుతుంది. సవతుల మాత్సర్యం, సతి పతి కోసం పడేపాట్లు, కుమారుని విక్రమం, అర్జునుని వీరత్వం కల్పనలో చోటు చేసుకొని కథను అద్భుతంగా మలిచాయి. కథలో అద్భుతత్వముంటేనే జానపదులు ఆసక్తి చూపుతారు.

భారత కథా చిత్రాలు - సంఘటనలు - జానపదీయత :

సినిమా వాళ్లు ప్రేక్షకుల అభిరుచిననుసరించి మూలకథలను ఎలా మార్పుచేసుకున్నారో పైన వివరించడం జరిగింది. ఇక్కడ కథతో పూర్తిగా సంబంధంలేని సంఘటనలు వాటిలోని జానపదీయత చూపబడతాయి. సంఘటన కథలో భాగమే. అయినా హాస్యస్ఫోరకంగా ఉండడానికో, ఆశ్చర్యకరంగా ఉండడానికో, ప్రాచీన సంస్కృతిని వెలికి తీసి చూపడానికో ఒక సంఘటన కల్పింప బడినపుడు ఆ సంఘటనకు ప్రధాన కథతో సంబంధం ఉండనక్కరలేదు. అది స్వతంత్రంగా ప్రేక్షకులను ఆనంద పెట్టవచ్చు. వారిలో ఆలోచనను కలిగించవచ్చు. సాధారణంగా జానపద కథా చిత్రాలలో హాస్యపాత్రల మధ్య విజ్ఞాన దాయకమైన విషయాలను పొడుపు కథల రూపంలో చిత్రించడం కనిపిస్తుంది. అప్పటి వరకు గంభీరంగా సాగిపోతున్న కథ వెంట ఉత్కంఠ మానసులై వెళుతున్న ప్రేక్షకులకు ఇలాంటి పొడుపు కథల సన్నివేశాలు ఉద్వేగాన్ని తగ్గించి నవ్వుకొనేటట్లు చేస్తాయి. జానపద బ్రహ్మ విఠలాచార్య గారికి ఈ కిటుకు బాగా తెలుసు. పురాణ కథా సినిమాలలో ఏ సంఘటన తరువాత ఏ సంఘటన వస్తుందో ముందే ప్రేక్షకులకు తెలుసు. అందువల్ల ఇలాంటి కిటుకుల అవసరంలేదు. సహజంగానే కథలో హాస్యసన్నివేశాలు ఉంటాయి.

'మాయాబజార్' (1957) చిత్రంలో శకుని ఎలాగైన శశిరేఖను లక్ష్మణ కుమారుని భార్యను చేయాలను కుంటాడు. దానికి తగిన ప్రణాళిక సిద్ధంచేస్తాడు. లక్ష్మణ కుమారుడు సహజంగానే కొంత వెర్రిస్వభావం, క్షణికావేశం గలవాడు. సినిమాలో ఈ పాత్రను ఇంకా వెర్రివాడుగా చూపించారు. శశిరేఖను వరించమని లక్ష్మణ కుమారునితో శకుని అన్నపుడు 'అనాగరిక యాదవ కన్నను నేను వరింతునా' అంటాడు లక్ష్మణ కుమారుడు. హస్తినకు బలరాముడు వచ్చినపుడు లక్ష్మణ కుమారుణ్ణి ఆయనకు వందనం చేయమంటారు. 'వందనం చేయను, నమస్కరిస్తాను' అంటాడతడు. శశిరేఖను లక్ష్మణకుమారునికి ఇవ్వాలని నిర్ణయించిన తరువాత ఆమెను అభిమన్యునితో తిరగకుండా మేడమీది గదిలో బంధిస్తుంది రేవతి. అభిమన్యుడు కిందనుండి మేడమీది వరకు బాణాలతో మెట్లు నిర్మించి ఆమెను కిందికి దించుకుంటాడు.

కౌరవులను నాశనంచేసి పాండవులకు రాజ్యభాగం ఇప్పించాలని, దానికోసం సైన్యాన్ని సిద్ధంచేయాలని ఘటోత్కచుడు తన అనుచరులకు

చెప్పే సందర్భంఉంది. పాండవులకు చిక్కులన్నీ దుష్ట చతుష్టయం వల్లనే వచ్చాయని చెప్పే ప్రయత్నం చేస్తాడు చిన్నమయ్య. 'దుష్ట చతుష్టయం' అనే మాటను సరిగా పలకలేక లంబూ, జంబూ, 'దుసట చసుట తయం' అంటారు. అలా విడిగా అంటే దోషం వస్తుందంటాడు వాళ్ల గురువు చిన్నమయ్య. 'దోషం ఏమిటి దోషం! ఆ దుష్ట చతుష్టయాన్ని విడదీసి పొడిపొడి చేసెయ్యాలి' అంటాడు ఘటోత్కచుడు. చివరన పెండ్లిలో అందరూ భయ భ్రాంతులై అరుస్తుంటే 'అహా ఆర్తనాదములు శ్రవణానంద కరముగానున్నవి' అన్నవాడు కూడా ఘటోత్కచుడే. ఇవన్నీ కథతో సంబంధంలేని కల్పిత సంఘటనలే. వీటిలో జానపదుల ఆలోచనల నుండి పుట్టినవి కొన్ని, జానపద మనస్తత్వంతో సినిమా వాళ్లు కల్పించినవి కొన్ని.

అర్జునుడు తీర్థయాత్రలు చేస్తున్నాడని, త్వరలో ద్వారకకు వచ్చి సుభద్రను పెళ్లాడతాడని కృష్ణుడు చెప్పినపుడు ఆమె ఆనందంతో ఉద్యాన వనంలో పాట పాడుకుంటూ విహరిస్తుంది. ఆమె పాట మేఘంద్వారా ఎక్కడో ఉండిన అర్జునునికి వినిపించి ఆయన కూడా అదేపాట పాడినట్లు కృష్ణార్జున యుద్ధం (1963) సినిమాలో చిత్రింపబడింది. మేఘం పాటను మోసుకొని పోవడం జానపద కథా లక్షణమే కదా! వీరాభిమన్యు (1965) సినిమాలో వంటశాల నుండి భీముడు బయటకు విసిరి పారేసిన ఘటోత్కచుని రాజభటులు తగల బెట్టడం Jonathan swift (1667 - 1745) రచించిన Gulliver's Travels కథను పోలిఉంది. ఘటోత్కచుడు పెద్ద పర్వతంలాగా పడి ఉండగా అతని శరీరం చుట్టూ బెత్తెడు పొడుగున్న సైనికులు హాహాకారాలు చేస్తూ కట్టెలను పేర్చి అతనిని దహనం చేసే ప్రయత్నం చేస్తారు. ఈ సంఘటనను తయారుచేసిన దర్శకుని ప్రతిభను, కెమెరాలో బంధించిన 'కెమెరామాన్' ప్రతిభను కొనియాడ వలసిందే. ఇవన్నీ జానపద కథాంశాలే.

కొంచెం వీలు కలిగితే చాలు సినిమా వాళ్లు మాయలూ మంత్రాలతో కూడిన సన్నివేశాలను కల్పిస్తారు. బకుని కొడుకైన అలంబసునికి ఘటోత్కచునికి ఆకాశంలో యుద్ధం జరగడం (వీరాభిమన్యు 1965), ఘటోత్కచుని కుమారుడు వృక్షాసురుడుగా యాగాశ్వాన్ని అడ్డగించి కర్ణుని కుమారుని భయపెట్టడం, అర్జునుని అనుచరుడు మరుగుజ్జుగా మారి చెరసాల ఊచల నుండి తప్పించుకోవడం (ప్రమీలార్జునీయం, 1965) ఇత్యాది కల్పిత సంఘటనలన్నీ జానపదీయతను పోషించేవే. నర్తనశాల (1963) సినిమాలో విరటుని సభలోకి ఒక విచిత్రమైన వ్యాజం తీర్పుకోసం వస్తుంది. ఇద్దరు స్త్రీలు ఒక బిడ్డను

తెచ్చి నాబిడ్డంటే నాబిడ్డని వాదులాడుకొంటూ రాజును తగాదా తీర్చమంటారు. విరటుని కేమీ పాలుపోక అక్కడనే ఉన్న కంకుభట్టును తీర్పు చెప్పమంటాడు. బిడ్డను రెండు ముక్కలుగా ఖండించి తల్లులని కొట్లాడే వాళ్లిద్దరికి చెరొక ముక్క ఇవ్వమని కంకుభట్టు తీర్పు చెపుతాడు. దానితో అసలు తల్లి బయట పడుతుంది. ఇది సినిమా కోసం కల్పించిన జానపదాంశం. జానపద కథలుగా ప్రసిద్ధిపొందిన మర్యాద రామన్న కథలలో ఇలాంటి తీర్పులెన్నో కనిపిస్తాయి.

ప్రమీలార్జునీయం (1965) సినిమాలో విచిత్ర సన్నివేశం ఉంది. కృష్ణుడు చిలకమ్మి వేషంలో ఒక చిలుకతో ప్రమీల అంతః పురంలో ప్రవేశిస్తాడు. దేశంలోని రాకుమార్తెలలో ప్రమీలే అందగత్తె అంటుందాచిలక. ప్రమీల ఆచిలుకను కొనుక్కోవాలనుకుంటుంది. ఆ చిలుక తూగినంత ధన మిచ్చి కొనుక్కోమంటుంది చిలకమ్మి. త్రాసులో ఎంత ధనముంచినా చిలుక తూగదు. ప్రమీల వేలి ఉంగరం వేయగా చిలుక తూగుతుంది. ఆచిలుక అంతఃపురంలో అర్జునుడుగా మారుతుంది. ప్రేక్షకుల ఆనందం కోసం కల్పించిన సన్నివేశమిది. జానపద కథల్లో చిలుకలు ఎలాంటి చాతుర్యం గలవో మనకు తెలుసు. కావ్య సాహిత్యంలో నాయికలు చిలుకలను పెంచినట్లు కనిపిస్తుంది.

కుమారాస్త్ర విద్యా ప్రదర్శన సందర్భంలో కురుపాండవ కుమారులతో పాటు ద్రోణుని వద్ద విద్యనేర్చుకున్న కర్ణుడు గురువు సూచించిన లక్ష్యాన్ని ఛేదించగా అర్జునుడు ఛేదించలేక పోతాడు. ఏకలవ్య (1982) సినిమాలో గల ఈ సంఘటన పూర్తిగా కల్పితం. విలువిద్యలో అర్జునుని మించిన వాళ్లున్నారని, వారిలో ఏకలవ్యుడు మొదటి వాడని చెప్పడానికి ఈ కల్పన సినిమాలో బాగా పనికొచ్చింది. ద్రోణుడు ఏకలవ్యుని గూడెం వెళ్లి అతని బొటనవేలు గురుదక్షణగా గ్రహించాలని నిర్ణయించు కుంటాడు. ఆనాటి రాత్రి ఏకలవ్యుని భార్యకు కలవస్తుంది. ఆకలలో ద్రోణుడు ఏకలవ్యుని తలపై చేయిపెట్టినట్లు వెంటనే ఏకలవ్యుడు దగ్ధమై పోయినట్లు కనిపిస్తుంది. ఆ మరుసటి రోజే ద్రోణుడు గూడెం వస్తాడు. ద్రోణుడు ఏమడిగినా ఇవ్వవద్దని ఆమె భర్తను బతిమాలుతుంది. ఈ సంఘటన భార్యకు భర్తపై గల అనురాగాన్ని తరువాత జరుగబోయే విపరీత పరిణామాన్ని ధ్వనిస్తుంది. జానపద మనస్తత్వం గల ప్రేక్షకులను ఆనందపరిచే సన్నివేశమిది. ఇలాంటి సంఘటనలకు 'మోహినీ భస్మాసుర' కథ ప్రేరణ. మాయాబజార్ సినిమాలో చిన్నమయ్య శశిరేఖాభిమన్యుల వినోదార్థం 'మోహినీభస్మాసుర' నాటకాన్ని తన శాంబరీ విద్యతో

ప్రదర్శింపజేస్తాడు. సినిమాలలో ఇలాంటి అవాంతర కథలు ప్రేక్షకులను తాత్కాలికంగా అలరించడమే కాకుండా వారికి లౌకిక జ్ఞానం కూడా ప్రసాదిస్తాయి.

శ్రీ కృష్ణావతారం (1967) సినిమాలో కూడా కొన్ని విచిత్ర సన్నివేశాలున్నాయి. రుక్మిణిని శిశుపాలున కియ్యాలని నిర్ణయమవుతుంది. ఆమెను భార్యగా ఊహించుకొని అతడు గాలిలో తేలిపోతూ మదిర తాగి ఆనందిస్తూ ఉంటాడు. కృష్ణుడు రుక్మిణి వేషంలో శిశుపాలునికి పానపాత్రలో కనిపిస్తాడు. పెండ్లి కుమార్తె వేషంలో కృష్ణుడే శిశుపాలుని పక్క కూర్చొని తాళికట్టే సమయానికి మాయమై పోతాడు. భాగవతంలో లేని ఈ సంఘటనలు సినిమాకోసం జానపద ధోరణిలో కల్పింపబడినాయి. సత్రాజిత్తు తన కుమార్తె సత్యభామను భార్యగా స్వీకరించమని కోరగా కృష్ణుడు తాను వివాహితుడనంటాడు. భువనాన్ని భరించేవాడికి నాకుమార్తె బరువవుతుందా అంటాడు సత్రాజిత్తు. సత్రాజిత్తు మాటను బలరాముడు బలపరుస్తాడు. ఇది కూడా అలాంటి సంఘటనే. తల్లి దండ్రులు లేని ఒక పిల్లవాడు కర్ణుని దగ్గరకు వస్తాడు. చదువుకోడానికి వెళితే గురువులు తల్లిదండ్రులు లేని పిల్లలను బడికి రానివ్వమంటున్నారని ఏడుస్తూ చెబుతాడు. ఆపిల్లవాని పేరు మేఘనాధుడు. అది వింటూనే కర్ణుడికి తన విషయం గుర్తుకు వచ్చి ఎంతో బాధ కలుగుతుంది. కర్ణుడా పిల్లవానిని మంచి గురుకులంలో చేర్చమని అతని కయ్యే ఖర్చులు తాను భరిస్తానని చెప్పి పంపిస్తాడు. ఈ సన్నివేశం కర్ణ (1964) సినిమాలో చిత్రింప బడింది.

కర్ణుడు యుద్ధభూమిలో మరణించినపుడు ధర్మదేవత ప్రత్యక్షమై అతని వల్ల ధర్మం నిలుస్తుందనుకుంటే అతడు అకాల మరణం చెందాడని బాధ పడుతుంది. కృష్ణుడు వచ్చి యుగ ధర్మం ప్రకారం అతడు మృతి చెందాడని చెప్పి ఆమెను ఓదార్చుతాడు (కర్ణ, 1964). ఘోష యాత్రలో చిత్రసేనుడనే గంధర్వుడు దుర్యోధనాదులను బంధించినపుడు భానుమతి వచ్చి ద్రౌపదితో మొరపెట్టుకొంటుంది. ఒక స్త్రీ తన దుఃఖాన్ని మరొక స్త్రీకి చెప్పుకోవడ మిక్కడ విషయం. తరువాత భీమార్జునులు వెళ్లి దుర్యోధనాదులను బంధ విముక్తులను చేస్తారు. (పాండవవనవాసం 1965). సుభద్రార్జునుల వివాహం తరువాత కృష్ణుడే బలరాముని వేషంలో వచ్చి మందలిస్తాడు. పిల్లలుగా ఉన్నపుడే అభిమన్యు ఘటోత్కచులు తోటలో కొట్లాడుకుంటారు. తరువాత తమ సంబంధాలు తెలుసుకుంటారు. మయ సభలో దుష్ట చతుష్టయానికి శిల్పకాంతలు స్వాగతం చెపుతారు. జరాసంధుని సంహరించడానికి వెళ్లినపుడు

కృష్ణభీముల వెంట అర్జునుడు కూడా వెళతాడు. ద్రౌపది వస్త్రాపహరణ సందర్భంలో అర్జునుడు దుశ్శాసుని చంపుతానని ప్రతిజ్ఞచేస్తాడు. ఈ కల్పనలన్నీ కురుక్షేత్రం (1977) సినిమాలోనివి. ప్రేక్షకుల ఆనందం కోసమే కాకుండా ఆ సినిమాలో అర్జునుని నాయకుడుగా చూపడానికి కథంతా అతని చుట్టూ తిరిగేటట్లు చేయడానికి ఈ కల్పనలు అవసరమయ్యాయి.

## భారత కథాచిత్రాలు - పాత్రలు - జానపదీయత :

మూల కథల్లోని పాత్రలే సినిమాలో కనిపించినా ఔచిత్యం కోసం పాత్రల స్వభావం కొంత మారి కనిపిస్తుంది. 'మాయాబజార్' (1957)లో శకుని పాత్ర దీనికి మంచి ఉదాహరణ మవుతుంది. ప్రియదర్శిని మూత తెరచి చూస్తే కృష్ణుడికి శకుని కనబడతాడు. ఆ సినిమాలో శశిరేఖా లక్ష్మణకుమారుల వివాహ సంకల్పం శకునిది. మాయాశశిరేఖ లక్ష్మణ కుమారుని ఆటలు పట్టిస్తూ మగవాడి ఠీవితో అటూ ఇటూ తిరుగుతుంటే శకుని 'శశిరేఖ కనుకట్టు నేర్చిందా లేక నాకన్ను చెదిరిందా' అంటాడు. పెండ్లి చెడిపోతుంది. దుర్యోధనాదులను ఘటోత్కచుడు శృంగ భంగం చేస్తాడు. చివరన శకునుని సత్యపీఠం ఎక్కి ఏంజరిగిందో చెప్పమని ఘటోత్కచుడు గదముతాడు. 'త్రికాలములలో జరగనున్న సత్యం ఈ పీఠం ఎక్కిన వారికి దృగ్గోచర మవుతుంది' అని కృష్ణుడు ముందే చెప్పి ఉంటాడు. శకుని ఆ పీఠం ఎక్కి పాండవుల సిరిని కాజేయడానికి యాదవులను తమవైపు తిప్పుకోవడమే ఈ పెండ్లి ఏర్పాటులో గల ఆంతర్యమని, సన్మానంచేసి బలరాముని ప్రసన్నం చేసుకున్నామని నిజం చెపుతాడు. పాత్ర స్వభావాన్ని బాగా స్పష్టం చేయడానికి చేసిన కల్పన ఇది. ఈ కల్పనలో శకుని తన దౌష్ట్యాన్నితానే చెప్పుకుంటాడు.

వీరాభిమన్యు (1965) సినిమాలో ఉత్తర స్వభావాన్ని పట్టియిచ్చే సందర్భ మొకటుంది. ఉత్తరాభిమన్యులు మొదటిసారి కలుసుకొని విడిపోయిన తర్వాత మళ్లీ ఎప్పుడెప్పుడు కలుసుకుందామా అని కలలుగంటూ ఉంటారు. ఘటోత్కచుని సహాయంతో అభిమన్యుడు ఉత్తర చెలికత్తెగా మారి ఆమె జలక్రీడ చేస్తున్న సమయంలో ఆమెతో పాటు నీళ్లలో దిగి పరాచకాలు ప్రారంభిస్తాడు. ఉన్నట్లుండి కౌగలించుకోగా ఆకౌగిలిలో అంతకుముందు చెలికత్తెను కౌగలించుకొన్నప్పటి సౌఖ్యం కంటే మించిన మరొక కొత్త అనిర్వచనీయ సౌఖ్యం ఆమె అనుభవిస్తుంది. కన్నెల మధ్య ఇంత సౌఖ్యం ఉంటుందా అంటుంది. ఈ కల్పన వల్ల ఉత్తర కొత్త అనుభూతికోసం

ఎదురు చూస్తున్నదని అర్థమవుతుంది. సిగ్గుల మొగ్గగా ఉండిన ఉత్తర నోటి నుండి వచ్చిన ఈ మాట ఆమె అంతర్యాన్ని వివరిస్తుంది. పురుషులు స్త్రీలుగా మారి ప్రియురాండ్రతో సరసమాడుతూ వారి అంతర్యాలను తెలుసుకోవడం జానపద కథలలో కనిపించే లక్షణమే.

ఈ సినిమాలోనే అభిమన్యుడు యుద్ధానికి వెళ్లేముందు రాత్రి ఉత్తరతో గడిపిన శృంగారం ఒక కల్పనగా తీర్చబడి కనిపిస్తుంది. నాయికా నాయకులు శృంగారంలో మునిగినప్పుడు వారి శరీరాల మధ్య గాలి దూరడానికి కూడా సందు ఉండదని జానపద కథలేగాక కావ్య సాహిత్యం కూడా వర్ణిస్తుంది. అభిమన్యుడు ఆరాత్రి ఉత్తరతో పొందబోయే శృంగార సౌఖ్యాన్ని ఆమె శరీరం మీదగల ఏ అలంకరణ వస్తువులూ ఆటంక పరచకూడదని వరుసగా ఆమె కంకణాలు, నూపురాలు, ముక్కెర, హారం ఇత్యాది ఆభరణాలన్నిటిని తీసి వేస్తాడు. ఉత్తర బోసిగా కనిపిస్తుంది. భర్తా ఇలా ఎందుకు చేస్తున్నాడోనని ఆమెకు భయం కలుగుతుంది. సినిమాలో కనిపించే ఈ సన్నివేశం అభిమన్యుని శృంగార తత్పరతను వెల్లడి చేస్తుంది. సరిగ్గా ఇలాగే జానపద కథలలో నాయకుడు ప్రవర్తిస్తాడు. మరునాటి యుద్ధంలో అభిమన్యుడు చనిపోతే ఆయాభరణాలన్నీ ఆమెకు ఎలాగూ అవసరం లేదనే భావం ప్రేక్షకులకు కలుగుతుంది.

ప్రమీలార్జునీయం (1965) సినిమాలో అసలు సిసలైన జానపదాంశ మొకటుంది. ప్రమీలను ఎలా వశం చేసుకోవాలో తెలియక అర్జునుడు సతమతమవుతూ ఉంటాడు. అర్జునుని వెదుక్కుంటూ కృష్ణుడు వస్తాడు. స్త్రీ రాజ్యంలో తన గుడారంలో అర్జునుంటాడు. ఆరాత్రి కృష్ణార్జునులు ఇద్దరూ పక్కపక్కనే పడుకొంటారు. కృష్ణుడే ప్రమీల వేషంలో అర్జునుని ఆకర్షిస్తాడు. నిద్రను నటిస్తున్న అర్జునుడు మెల్లగా లేచి పోబోగా కృష్ణుడు లేస్తాడు. బావా నీవు రావద్దు బయట మంచుగా ఉందంటాడు అర్జునుడు. నిద్రను నటిస్తున్న కృష్ణుడు కూడా 'అవునవును మంచు తగిలితే నాకు జలుబు చేస్తుంది' అంటాడు. కృష్ణుని అర్జునుడు మామూలు మనిషిగానే చూశాడనడానికి ఈ సన్నివేశం పనికొస్తుంది. పురాణ కథల సినిమాలలో జలుబు దగ్గుల విషయం ఎక్కడా కనపడదు. ఈ సినిమాలోనే ఈ ప్రస్తావన ఉంది. ఈ

ఇప్పటికీ పల్లెటూళ్ళలో ఎవరైనా వ్యక్తి చేయరాని పనిచేస్తే రచ్చబండ దగ్గరకు లాక్కొచ్చి మళ్లీ అతడాపని చేయకుండా చేయాలి అనే మాట వినిపిస్తుంటుంది. చేయకూడని పనిని ఆవ్యక్తి కాలితో చేసివుంటే మళ్లీ ఆపని చేయడానికి అతకి కాలులేకుండా చేయడం, చేతితో చేసి వుంటే చేయి లేకుండా చేయడం అనిదీని భావం. ప్రాచీన కాలం నాటి ధర్మశాస్త్ర గ్రంథాలలో ఇలాంటి శిక్షలు చెప్పబడి కనిపిస్తాయి. ఈ కారణం చేతనే 'ప్రాణానికి ప్రాణం - రక్తానికి రక్తం' అనే మాటలు వాడుకలో వినిపిస్తాయి. ఇలాంటి సంఘటన ఏకలవ్య (1982) సినిమాలో ఉంది. ఏకలవ్యుడు ద్రోణుని బొమ్మ పెట్టుకొని విలువిద్య నేర్చుకుంటాడు. జగదేక ధనుర్ధరుడు కావాలనుకున్న అర్జునునికి ఏకలవ్యుని విలువిద్యా ప్రావీణ్యం అడ్డమవుతుంది. ద్రోణుడు అర్జునుని విలువిద్యలో సాటిలేని మేటి వీరుడుగా తీర్చి దిద్దుతానని చెప్పిఉంటాడు. గురుదక్షిణగా ద్రుపదుని బంధించి తెచ్చి అర్జునుడు ద్రోణుని తృప్తిపరుస్తాడు. తనను విలువిద్యలో మించి పోగల ఏకలవ్యుడనే వీరుడు ఉన్నాడని గురువుకు గుర్తుచేస్తాడు. ఏకలవ్యుని దీక్ష గురువుగారి స్మృతి పథంలో మెదలుతుంది. అయినా అర్జునుని ప్రీతికోసం 'ఏకలవ్యుని జన్మలో మళ్లీ విల్లు పట్టుకోకుండా చేస్తాను' అంటాడు. తరువాత ఈ మాటను జీర్ణం చేసుకోలేక ద్రోణుడెంతో బాధపడుతాడు. ఆ తరువాత జరుగవలసింది జరిగి తీరుతుంది. ఈ మాట ద్రోణుని వ్యక్తిత్వాన్ని దెబ్బతీస్తున్నది. జానపద కథలలో తప్పుచేసిన వారిని దండించాలనే మనస్తత్వం గలవారు ఇలా మాట్లాడుతారు. ఈ జానపద భావం భారతంలో శిష్టత్వం పొందింది. సినిమాలోకూడా ఈ భావాన్ని స్ఫురింప జేయడానికి ఆమాటను వాడుకోవడం జరిగింది.

కర్ణ (1964) సినిమాలో దుర్యోధనుని స్వభావం వ్యక్తమయ్యే జానపదాంశముంది. కర్ణుడు దుర్యోధనునికి అరమరికలులేని మిత్రుడు. కర్ణుని సచ్ఛీలత మీద దుర్యోధనునికి గట్టి నమ్మకముంది. దుర్యోధనుడు లేని సమయంలో కర్ణుడు భానుమతితో చదరంగ మాడుతూ ఉంటాడు. దుర్యోధనుడు రావడంతో తటాలున ఆమె లేచి పోబోతుంది. దుర్యోధనుని రాకను గమనించని కర్ణుడు ఆమె కట్టిన వస్త్రం పట్టుకొని లాగి ఆపుతాడు. ఇలా లాగడం వల్ల ఆమె ఒడ్డాణం తెగి ముత్యాలన్నీ నేలమీద రాలతాయి. అప్పుడు కర్ణుడు సుయోధనుడు వచ్చినట్లు గమనించి ఆందోళన పడతాడు. ఆందోళన పడవద్దని, ఆట కొనసాగించమని దుర్యోధనుడు భానుమతి కర్ణులను కోరి అక్కడి నుండి వెళ్లిపోతాడు. సుయోధనుని స్వభావం లోని గొప్పతనమిది.

జానపద కథల్లో ప్రాణానికి ప్రాణమిచ్చే స్నేహితులు కనబడతారు. తమ స్వభావం బాగుంటే తన చుట్టూ ఉన్నవారి స్వభావం కూడా బాగుంటుందని జానపదుల అభిప్రాయం. ఏ విషయాన్నైనా కపటం లేకుండా చూడాలన్నది వీళ్లనుండి నేర్చుకోవలసిందే. సమాజంలోని వ్యక్తులందరిలో ఈ భావముంటే మానవ స్వభావంలో చెడ్డతనం ఉండదు. జానపద సంస్కృతిలోని గొప్పతనం ఈ సినిమా సుయోధనుని పాత్రలో చూపింది.

ఇలా చూస్తూపోతే భారత కథా చిత్రాలలో అనేక పాత్రల స్వభావాలు నిసర్గంగా కనిపిస్తాయి. భారతం ఇతిహాసమైనా, పురాణమైనా, శాస్త్రమైనా, కావ్యమైనా దేశంలో దీనికి ఎంతో విలువుంది. భారత కథ ప్రజల జీవితాలతో మిళితమై శాశ్వతత్వాన్ని సాధించుకుంది. తెలుగు ప్రజలకు భారతం లోని కథలు ఆసక్తిని కలిగిస్తూనే ఉంటాయి. తమ జీవితాలలో ఎదురైన సమస్యలను భారత కథలలో గల సమస్యలతో పోల్చి చూచుకోవడం తెలుగువారికి అలవాటు. భారత కథా చిత్రాలను తెలుగు ప్రజలు ఇప్పుడూ చూస్తారు. ఎప్పుడైనా చూస్తారు.

## సూచికలు

1. Christian and oriental philosophy of Art p. 136
2. శిష్ట సాహిత్యంలో జానపదధోరణులు. పుట. 51
3. "సర్గశ్చ ప్రతి సర్గశ్చ వంశో మన్వంత రాణిచ
   వంశాను చరితం చేతి లక్షణానాంతు పంచకమ్"
4. ఆదిపర్వం 1 - 32
5. జైమిని బారతం - సంశోధనాత్మక పరిశీలనం. పుట - 33
6. మైథిలీ శరణ గుప్త రచించిన ఈ గేయాన్ని టి.పి.యస్ రామచంద్రాచార్యు తెలుగుచేసి 1958 - జూన్ మాస స్రవంతి పత్రికలో ప్రచురించారు.
7. జైమిని భారతం - సంశోధనాత్మక పరిశీలనం పుట -354 'పంచడబ్బులు' అంటే కల్పితాలని అర్థం. మైరావణ చరిత్ర, శతముఖ రామాయణం, కృష్ణార్జున సంవాదం, గంగాగౌరీ సంవాదం, కుశలవ కథ - ఇవి పంచడబ్బులు అని జూలూరి అప్పయ పండితుడు చెప్పినాడు. (దంభశబ్దం భవం - డబ్బు)

8. తెలుగు సాహిత్య సమీక్ష రెండవ సంపుటం. పుటలు, 267, 268
9. ఈ విషయం శాతవాహన సంచికలో శివకంకర శాస్త్రి రచించిన 'గుణాఢ్యుడు - బృహత్కథ' అనే వ్యాసం నుండి గ్రహించ బడింది.
10. మేఘ సందేశమ్ - పూర్వమేఘం. శ్లో. 31
11. అరణ్యా పర్వం - ఏడవ ఆశ్వాసం
12. తెలుగు జానపదగేయ సాహిత్యం. పుట - 132
13. శిష్ట సాహిత్యంలో జానపద ధోరణులు. పుటలు 23-24
14. వాల్మీకి రామాయణం. అయోధ్యకాండ 40 - 9
15. ఉద్యోగ పర్వం. 3 - 108
16. ఉద్యోగ పర్వం. 3 - 273
17. ఉద్యోగ పర్వం. 3 - 177
18. ఉద్యోగ పర్వం. 3 - 220
19. శశిరేఖా పరిణయం. 4 - 31, 32, 33.
20. ఈ వివరాలు తెలుగు జానపద గేయ సాహిత్యం నుండి గ్రహింపబడినాయి. పుట - 138 - 139
21. చిత్ర భారతం. 1 - 11
22. తెలుగు నాటక వికాసం. పుట - 248
23. తెలుగు నాటక వికాసం. పుట - 248 - 49
24. తెలుగు జానపద గేయసాహిత్యం. పుట 133
25. తెలుగు జానపద గేయ సాహిత్యం. పుట - 488
26. జైమిని భారతం. పుట 5 - 119
27. తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీలనం. పుట - 31
28. జైమిని భారత కథలను భగవాన్ దాస్ అనే పండితుడు హిందీలో హరికథలుగా రచించాడు. హిందీ హరికథలను ప్రతి గొడుపు రాఘవరాజు తెనిగించాడు. దీని ప్రథమ ముద్రణ 1956లో వచ్చింది.
29. ప్రతి గొడుపు రాఘవరాజు అనువదించిన బభ్రువాహన హరికథ.
30. తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీలనము. పుట - 185

# భారతేతి వృత్త సినిమాలు - పాటలు - పద్యాలు - జానపదీయత

సినిమాలలో కథ దృశ్యాలు, సంభాషణలు, పాటలు, పద్యాలు మొదలైన మాధ్యమాల ద్వారా ప్రేక్షకుల కందుతుంది. సమర్థుడైన దర్శకుడు ఇంకా ఎన్నో రకాలుగా కథను ప్రేక్షకులలో సాక్షాత్కరింపజేయవచ్చు. ఈనాడు అందుబాటులో ఉన్న సాంకేతిక సదుపాయాలు ఈ విషయంలో దర్శకుడి కెంతగానే ఉపకరిస్తాయి. అయినా పైన చూపిన నాలుగు మాధ్యమాలు ముఖ్యమైనవే గాక ప్రాథమిక మైనవికూడా. ఈ నాలుగు విషయాలను సినిమా కథకు అనుకూలంగా కూర్చుకోవడం దర్శకుని పని. ఈ పనిలో అతనికి కళాదర్శకుడు, కథారచయిత, సంభాషణల రచయిత, పాటల రచయిత సహకరిస్తారు. దృశ్యాలు కథకు నేపథ్యాన్ని సమకూర్చుతాయి. అవుట్‌డోర్, ఇన్‌డోర్ సెట్స్‌వేయడం ఇవన్నీ దృశ్యాల కింద ఆలోచించ వలసిన విషయాలు. సంభాషణలు, పాటలు, పద్యాలు ప్రేక్షకులకు వినిపించేవి. సంభాషణలు, పాటలు ప్రతి సినిమాకు తప్పనిసరి. వీటితో పాటు పౌరాణిక చిత్రాలలో పద్యాలు కూడా ఉంటాయి. పాటలు, మాటలు రక్తి కట్టడానికి నటుల ప్రతిభ అవసరం. సన్నివేశం, దానికి తగినపాట, దానికి తగిన సంగీతం, దానికి తగిన నటుని అభినయం, సన్నివేశ చిత్రీకరణకు తగిన నేపథ్యాన్నిచ్చే దృశ్య చిత్రణ - ఇవన్నీ పాటలు రక్తి కట్టడానికి దోహదపడే అంశాలు. దృశ్యాలను, ఇతర సాంకేతిక విషయాలను వదిలస్తే మిగిలిన వాటిలో మాటలు, పాటలు ముఖ్యమైనవిగా కనిపిస్తాయి.

మాటలు, పాటలు సినీ రచయితలకు సంబంధించిన అంశాలు. సినీ రచయితలపైన సమకాలీన సమాజంలోని అనేక విషయాల ప్రభావం ఉంటుంది. ముఖ్యంగా సాహిత్య ఉద్యమాల ప్రభావం ఎక్కువ. అయినా సినిమా రచయిత అట్టడుగు వర్గాలకు చెందిన ప్రేక్షకులకు అర్థమయ్యేటట్లు, వారి అభిరుచులకు సంబంధించిన అంశాలు ప్రతిబింబత మయ్యేటట్లు రాయవలసి ఉంటుంది. అందువల్ల సమకాలీన సాహిత్యస్పృహ కొంత కనిపించినా నూతన పద

పాటలు ఉంటాయి. పామరులైన ప్రజలకు కూడా సంస్కృత సాహిత్యం నుండి కొన్ని శ్లోకాలు తెలిసి ఉంటాయి. తమ లౌకిక జీవితంలో ఎదురయ్యే సమస్యలను బుద్ధిమంతులైన పెద్దలకు చెప్పి సలహా లడిగినపుడు వాళ్లు ఉదాహరణలకోసం కొన్ని శ్లోకాలను గుర్తు చేస్తుంటారు. భారత భాగవత గ్రంథాల నుండి కొన్ని పద్యాలను గుర్తు చేస్తుంటారు. ఈ రకంగా పామరులకు ప్రాచీన సంస్కృత, తెలుగు సాహిత్య గ్రంథాల నుండి కొన్ని శ్లోకాలు, పద్యాలు గుర్తుంటాయి. లేదా విన్నప్పుడైనా అవి తమ లౌకిక జీవితాలకు ఎలా ఉపయోగ పడతాయో ఆలోచిస్తూ కాసేపు నెమరు వేసుకొనే అవకాశ ముంది. ఇలాంటి శ్లోకాలను, పద్యాలను వీథినాటకాలలో, హరికథలలో, బుర్రకథలలో పల్లె ప్రజలు విని ఉంటారు. వీటిని మరలా సినిమాలో చూడడం వినడం ఆపద్యాలకు తమ అభిమాన నటీనటుల అభినయాన్ని తిలకించడం వారిలో నూతన అనుభూతిని కలిగిస్తాయి. ఈ కారణం చేత సినీ రచయితలు అలాంటి పద్యాలను శ్లోకాలను సినిమాలలో వాడుకొంటారు. సినిమా సన్నివేశాలకు తగిన రకంగా సాహిత్యం ఉండాలనే అభిప్రాయంతో పాటు పామర ప్రేక్షకుల స్పందన కూడా అవసరమే. పల్లెప్రాంతాల ప్రజలు ప్రతిరోజూ పనులు చేస్తున్నపుడు శ్రమ తగ్గించుకోవడం కోసం పాడుకునే పాటలను కూడా సినిమా రచయితలు సినిమాలలో పెడుతున్నారు.

1970 తరువాత నిర్మితమైన అనేక సాంఘిక చిత్రాలలో ఇలాంటి జానపద బాణీలు గల పాటలెన్నో కనిపిస్తాయి. గంభీరమైన పౌరాణిక సన్నివేశాల మధ్య ఇలాంటి పాటలను చిత్రించడం ఎబ్బెట్టుగా ఉంటుంది. పైగా సన్నివేశాలకు ఇవి అతకవు. అంతమాత్రంచేత పౌరాణిక చిత్రాలలో జానపదగేయాలు లేవనికాదు. మొదటి తరం వారైన పింగళి, సముద్రాల వంటి రచయితలు పౌరాణిక సన్నివేశాలకు తగిన రకంగా జానపద గేయాలను రచించారు. అవి ప్రజాదరణ పొందాయి. సినిమా పాటలన్నీ జానపద గేయాలేనన్న అభిప్రాయం ఉంది. శిష్ట సాహిత్యంలో జానపద ధోరణులున్నట్లు సినిమాలలో కూడా జానపద ధోరణులుంటాయి. సినిమా పాటలు ఈ తరగతికి చెందుతాయి. జానపద ధోరణి ఉన్న సినిమాపాట బాగా ప్రజాదరణ పొందడం మనం గమనించవచ్చు.

సంస్కృత శ్లోకాలు : భారత కథా చిత్రాలలో కృష్ణ పాత్ర తప్పనిసరి. ఆయన అర్జునుని కారణంగా చేసుకొని సమస్త మానవాళికి ప్రబోధించిన 'భగవద్గీత' ప్రతిభారత కథా చిత్రంలోను ప్రస్తావింపబడింది. శ్రీకృష్ణావతారం, వీరాభిమన్యు, దానవీర శూరకర్ణ మొదలైన చిత్రాలలో శ్రీకృష్ణుని విశ్వరూపం చిత్రీకరణ చివరి అంశం. భగవానుడు స్వయంగా చెప్పిన

యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానాం సృజామ్యహమ్
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతమ్
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అనే శ్లోకాలు తప్పని సరిగా చిత్రింపబడి కనిపిస్తాయి.

భారత కథాచిత్రాలు కృష్ణ పాత్రకే ప్రాధాన్యమిచ్చాయి. తెలుగు చిత్రాల్లు ప్రారంభంనుండి కూడా నాయకత్వ ప్రాధాన్యం కలిగినవిగా - అంటే 'Hero - Domination' ఉన్నవిగా కనిపిస్తాయి. అందుకేనేమో తెలుగు సినిమా హీరో లంటే ప్రజలకింత మోజు. ఈ మధ్య హీరోయిన్లు కూడా ఇలాంటి ప్రజాదరణ పొందుతూనే ఉన్నారు. పేరు ప్రఖ్యాతులున్న హీరోలు నటించే సినిమాలలో కథలు ఆహీరోల చుట్టూ తిరగడం కనిపిస్తుంది. ఒకటి రెండు ఉదాహరణలు అవసరం. 1962లో భీష్మ చిత్రం వచ్చింది. చిత్రం పేరే భీష్మ కాబట్టి కథంతా భీష్ముడిచుట్టూ తిరగడం అవసరం. భీష్మ పాత్రధారి గొప్ప నటుడు (ఎన్టీరామారావు) కాబట్టి ఆయన హీరోత్వం కూడా ఈ సినిమాలో నిరూపితమైంది. 'పాండవ వనవాసం' (1965) చిత్రం ఇలాంటిది కాదు. కథ అనేక పాత్రల మధ్య ఉంటుంది. అయినా ఈ సినిమాలో భీమ పాత్రధారి రామారావుగారు కాబట్టి ఆయనకు నాయకత్వ ప్రాధాన్యం ఉండాలి. కాబట్టి సినిమాలో భీమపాత్ర ఉదాత్తంగా మార్చబడింది. కథలో భీముని ప్రాధాన్యత కనిపిస్తుంది. కురుక్షేత్రం (1977) అనే సినిమాలో కృష్ణగారు అరుసుడుగా వేయడం వల కథ అరున పాత్రకు ప్రాధాన్యమిచ్చే విధంగా

సర్వాంగ పరిచుంబనరించి కలయిక కలితి ముక్తావళిమ
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణిః

అనే శ్లోకం శ్రీకృష్ణ సత్య చిత్రంలో అష్టమహిషులు శ్రీకృష్ణుని అలంకరణ సౌభాగ్యం గమనించే సందర్భంలో ఉంది. 'శ్రీకృష్ణావతారం' సినిమాలో భగవద్గీతా శ్లోకాలకు సముద్రాల తెలుగు సేత కనిపిస్తుంది. 'దాన వీర శూర కర్ణ' సినిమాలో శ్రీకృష్ణుడు అర్జునునకు కర్తవ్యబోధ చేసే సందర్భంలో అవసరమైన శ్లోకాలను సి.నారాయణరెడ్డిగారు అనువదించారు.

"ఆత్మనిత్యము ఆత్మసత్యము అది అచింత్యము అదిఅగమ్యము
చీల్చలేనిది కాల్చలేనిది చిరంతనమది సర్వగతమది
చంపెడి వాడవు నీవా, చంపబడెడి వారు వార?
చేసెడి వాడను నేనే - చేయించెడి వాడను నేనే"

**తెలుగు పద్యాలు** : భారత భాగవతాది పురాణాలలోని; మనుచరిత్ర, పారిజాతాపహరణాది కావ్యాలలోని పద్యాలనే గాక శతక పద్యాలను, ఆధునిక కవులలో కరుణశ్రీ లాంటి కవుల పద్యాలను సినిమా వాళ్ళు వాడుకున్నారు. భారత కథా చిత్రాలలో కవిత్రయ భారత పద్యాలు, తిరుపతి వేంకటకవుల పద్యాలు, గయోపాఖ్యానాది నాటకాలలోని పద్యాలు కనిపిస్తాయి.

"దారుణి రాజ్యసంపద మదంబున కోమలి కృష్ణ జూచిరం
భోరు నిజోరు దేశమున నుండగ బిల్చిన యిద్దురాత్ము ........"

అనే నన్నయ పద్యం పాండవ వనవాసం చిత్రంలో చిత్రింపబడింది. ద్రౌపది వస్త్రాపహరణ సందర్భంలో భీముడు దుర్యోధనుని తొడలు విరగగొడతానని ప్రతిజ్ఞ చేసిన పద్యమది. ఇదే సందర్భంలో దుశ్శాసనుని రొమ్ముచీల్చి రుధిరం తాగుతానని కూడా భీముడు ప్రతిజ్ఞ చేశాడు.

"కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవులనేకుల్ సూచుచుండన్మదో
ద్ధరుడై ద్రౌపది నిట్లుచేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ ........"

ఇది మరొక పద్యం. సందర్భం సరిగా అర్థంకాని పామర ప్రేక్షకులకు కూడా ఈ పద్యాలు అర్థమై వారిని వీర రసోన్మత్తులను చేస్తాయి. భారత

వీధి నాటకాలలో కూడా ఈ పద్యాలు వాడబడడంచేత ఈ పద్యాలకు ఎంతో ప్రాచుర్యం వచ్చింది.

నర్తనశాల సినిమా తిక్కన భారత విరాటపర్వకథ. తిక్కన విరాటపర్వాన్ని 'నానారసాభ్యుదయోల్లాసి' అన్నాడు. సినిమా గూడా అలాగే ఉంటుంది. ఈ కథలో శృంగార వీరరసాలు ప్రధాన రసాలుగా తక్కిన వన్నీ పోషక రసాలుగా కనిపిస్తాయి. నర్తనశాలలో భీమ కీచకుల యుద్ధం తిక్కన వర్ణించిన విధంగానే చిత్రించబడింది. పాండవుల అజ్ఞాతవాసం పూర్తియై అర్జునుడు ఉత్తర కుమారుని సారధ్యంతో ఉత్తర గోగ్రహణానికి వచ్చిన దుర్యోధనాదులను ఓడించడానికి వెళతాడు. ఆ సందర్భంలో తిక్కన పద్యాలు యథాతథంగా సినిమాలో వాడబడినాయి. అర్జునుడు కౌరవ వీరులను వేరు వేరుగా చూపుతూ ఉత్తరునికి పరిచయం చేసిన సందర్భంలోనిదీపద్యం.

"కాంచనమయ వేదికా కనకత్కేత నోజ్జ్వల
        విభ్రమమువాడు కలశజుండు
సింహలాంగూల భూషిత నభోభాగ
        కేతు ప్రేంఖణమువాడు ద్రోణసుతుడు
కనక గోవృషసాంద్ర కాంతి పరిస్ఫుట
        ధ్వజ సముల్లాసంబువాడు కృపుడు
లలితకంబు ప్రభా కలిత పతాకా
        విహారంబువాడు రాధాత్మజుండు

మణిమయోరగ రుచిజాల మహితమైన
పడగవాడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖర ఘన తాళ తరువగు సిడమువాడు
సురనదీ సూనుడేర్పడజూచి కొనుము" (విరాట 5 - 4)

యుద్ధంలో పట్టుకోల్పోయిన దుర్యోధనుని అర్జునుడు ఎగతాళిగా నిందించిన పద్యమిది.

"ఏనుంగు నెక్కి పెక్కే నుంగు లిరుగడరా
పురవీధుల గ్రాలగలదె
మణిమయంబైన భూషణ జాలముల నొప్పి
యొడ్డోలగంబున నుండగలదె
కర్పూర చందన కస్తూరి కాదుల నింపు
సొంపార భోగింప వలదె
అతి మనోహరలగు చతురాంగనల గూడి
సంగతి వేడ్కలు సలుపగలదె
కయ్యమున నొడి పోయిన కౌరవేంద్ర
వినుము నాబుద్ధి మరలి యీతనువు విడిచి
సుగతి వడయుము తొల్లింటి చూఱగలదె
జూద మిచ్చుట నాడంగరాదు సుమ్మి" )విరాట 5 - 204)

ఈ రెండు పద్యాలు ప్రేక్షకులకు సినిమా చూడక ముందు తెలియక పోయినా సినిమాలో తమ అభిమానహీరో వీరోచితంగా అభినయిస్తూ పాడినపుడు ఆనందాన్ని, ఆవేశాన్ని కలిగిస్తాయి.

శ్రీకృష్ణుడున్న ప్రతి సినిమాలో రాయబారం ఉంది. ఆంధ్రదేశంలో శ్రీ కృష్ణ రాయబారానికి ఎంతో ప్రజాదరణ ఉండడం వల్ల ఈ కథ నాటకాల కెక్కింది. తిరుపతి వేంకట కవుల పాండవోద్యోగ విజయ నాటకాల్లో రాయబారం అతి మధురమైన ఘట్టం. ఈ ఘట్టంలోని పద్యాలు ఒకటి రెండైనా వినని తెలుగు వాడుండడు.

"జెండాపై కపిరాజు ముందు సితవాజిశ్రేణియుం ........"

"అలుగుటయే ఎరుంగని మహామహితాత్ముడజాతశత్రువే ......."

"సంతోషంబున సంధి చేయుదరె .......... " మొదలైన పద్యాలు దాన వీర శూర కర్ణ సినిమాలో చిత్రీకరింప బడినాయి. సినిమాలుగా రూపొందిన భారత కథలో పద్యాలు పెట్టదలిస్తే ముందు తిరుపతి వేంకటకవుల పద్యాలే జ్ఞాపకం వస్తాయి. ఈ పద్యాలలో ఎన్నో కంఠతా వచ్చిన ప్రేక్షకులు సినిమాలలో ఈ పద్యాలు విని ఎంతో ఆనందించారు. 'స్టేజిడ్రామా'లలో విశేషంగా

ప్రేక్షకులను అలరించిన ఈ పద్యాలు జానపద సాహిత్యానికి చెందినవా లేక శిష్ట సాహిత్యానికి చెందినవా అని ప్రశ్నిస్తే జవాబు చెప్పడం కష్టం. 'డ్రామా'లలో స్టేజి నటులు రాగయుక్తంగా పద్యాలు పాడి గుక్కతిప్పుకోకుండా రాగాన్ని సాగదీస్తూ 'వన్సుమోర్'లు కొట్టించుకోవడం ఒకప్పటి ముచ్చటగా ఈనాడు మనం చెప్పుకొనే స్థితిలో ఉన్నాం. జానపదుల ఆదరణ వల్లనే 'స్టేజిడ్రామాలు' సినిమాలకు దీటుగా నిలబడ గలిగాయి. జానపదుల ఆనందం కోసమే 'డ్రామా'లలో పద్యాలు వచ్చాయి. అందువల్ల సినిమాలపై శిష్టసాహిత్య ప్రభావం కంటే జానపద కళలైన వీధి నాటకాల ప్రభావమే ఎక్కువని గుర్తించ వలసి ఉంది. 'శ్రీకృష్ణరాయబారం' ఘట్టం చిత్రించిన కొన్ని భారత కథా చిత్రాలలో తిరుపతి వేంకటకవుల పద్యాలు లేకపోవడం వల్ల ఆ చిత్రాలు విజయవంతం కాలేక పోయాయి. ఈ ఒక్క సాక్ష్యం చాలు జానపద బాణీల ప్రభావం సినిమాలపై ఎంత ఉందో చెప్పడానికి.

శ్రీకృష్ణుని అంతఃపుర విషయాలు నాటకాలలోగాని, సినిమాలలోగాని ప్రేక్షకులకు రసగుళికలు. ఆసన్నివేశాలు కనిపించినపుడు వాళ్లు రస పారవశ్యం పొందడం గమనించవచ్చు. ఆధునిక నాగరికత చాటున పెరుగుతూ కుహనా సంస్కృతికి అలవాటు పడిన వాళ్లకు 'రస పారవశ్యం' అనే మాటకు అర్థం తెలియదు. తెలియాలంటే వాళ్లలో జానపదీయత ఉండాలి. 'జానపదీయత' అనేది మనిషికి ఒక స్వాభావిక లక్షణం. ఏలక్షణం లోపిస్తే అందం అందంగాను, ఆనందం ఆనందంగాను అనిపించదో అది జానపద లక్షణం. జానపదుడంటే పల్లెటూరివాడని, మొరటువాడని అర్థంకాదు. భారతంలోనే ఒకచోట వ్యాసుడు 'కృత యజ్ఞశ్చ మేధావీ బుధో జానపద శ్శుచిః' అని జానపదులను యజ్ఞం చేసిన వాళ్లతో, పండితులతో సమానంగా చూశాడు. (శాంతి పర్వం. 83వ అధ్యాయం, 41వ శ్లోకం). 'శుచి' అనే మాట ఆత్మిక సంస్కారానికి సంబంధించినది. జానపదులు ఆత్మిక సంస్కారంతో ఉంటారు కాబట్టి వారిలో కళాభిరుచి, కళను అనుభవించి ఆనందించడం ఉంటాయి. ఇలాంటి వాళ్లకోసం పౌరాణిక నాటకాలెన్నో పుట్టాయి. ఆ నాటకాలలోని పద్యాలు ఎందరికో కంఠస్థమయ్యాయి.

> "మెట్టిన దినమని సత్యయు, పుట్టిన దినమనుచు భీష్మపుత్రియునన్ని
> ప్పట్టున బిలుతురు విందున, కిట్టి యెడల నెచటికేగ హితవో చెపుమా"
>
> (కృష్ణతులాభారం - నాటకం - ముత్తరాజు)

ఈ పద్యం కొన్ని సినిమాలలో ఉంది. 'శ్రీకృష్ణార్జున యుద్ధం' సినిమాలో ఇదే పద్యాన్ని కొంతమార్చి రాయించి వాడుకున్నారు. ఆపద్యమిది -

"మెట్టిన దినమీ సత్యకు, పుట్టిన దినమీ విదర్భ పుత్రికి మరి ఈ
పట్టున నేనెటు పోవలె, దిట్టముగా తెలుపుమయ్య దేవ మునీంద్రా"

నాటకం లోని పద్యం జ్ఞాపకమున్న ప్రేక్షకులకు ఈపద్యం అనుకరణగా రాయబడినదనే విషయం స్ఫురించదు. శ్రీకృష్ణుడు ఇద్దరు భార్యల మధ్య ఇరుకున బడిన ఈ సందర్భం నారదునికి అత్యంత ప్రీతిపాత్రం. అతనికే కాదు ప్రేక్షకులకు కూడా. ప్రతిభ గల నటీనటులై సహజంగా నటిస్తే ఈ సన్నివేశం ఎంతో బాగా రక్తి కడుతుంది. నటన, సాహిత్యం, సంగీతం, దర్శకుని ప్రతిభ మొదలైన వన్నీ ఉన్నా ఈ సన్నివేశంలో గల సహజత్వమే ప్రేక్షకులను తన్మయులను చేయడానికి కారణం. పల్లెపట్టులలో కృష్ణ నాటకాలకు సంబంధించిన సరదా ఇప్పటికీ ఉంది. వ్యయ ప్రయాసల కోర్చి రంగస్థల నాటకాలను కొందరు పోషిస్తూనే ఉన్నారు. శ్రీకృష్ణ రుక్మిణీ సత్యాలు మనవూరి వారు మన ఇంటిలోనివారు మనవారు అనే అభిప్రాయం ప్రజలలో ఉంది. ఈ ప్రజాదరణకు ప్రతిధ్వనే సినిమాలలో ఈకథలు కనిపించడం.

గయోపాఖ్యాన నాటకానికి ఆంధ్ర దేశంలో ఎంతో ప్రాచుర్యముంది. ఈ నాటకం లోని కథననుసరించి 'శ్రీకృష్ణార్జునయుద్ధం' సినిమా నిర్మితమైంది. గయుడు తన ప్రాణం రక్షించమని అర్జునుని శరణు వేడతాడు. గయుడికి అర్జునుడు అభయ ప్రదానం చేస్తాడు. ఆ సందర్భంలో అర్జునుడు చెప్పే పద్యమది.

"స్థాణుండే హరి పక్షమున్ మరి మహోద్ధత్యంబునన్ వచ్చినన్
రానీ, బంధులు మిత్రులున్ తుదకు సామ్రాజ్య ప్రభల్ పోయినన్
పోనీ, కృష్ణుడే పోరు తప్పదననీ ముల్లోకముల్ సాక్షిగా
ఏనీ ప్రాణము కాచి తీరెద భయం బింకేల వర్జింపుమా"

సినిమా కోసం పింగళి నాగేంద్రరావు ఈ పద్యం రాశారు. దీనికి

"నిటలాక్షుండిపుడెత్తి వచ్చిననురానీ, యన్నదమ్ముల్ననున్
విట తాటంబుగ బాసి పోయినను బోనీ, కృష్ణుడే వచ్చివ
ద్దిటు పార్థాయననీ, మరేమయినగానీ, లోకముల్బ్రెగ్గిలం
పటు దర్పంబున నిల్చి యీ గయుని ప్రాణం బేను రక్షించెదన్"

ఈ పద్యాన్నే సినిమాలో పెట్టుకోకుండా పింగళి చేత దీనికి అనుకరణ పద్యం రాయించడానికి కారణం ఏమిటో తెలియదు. ఇంతకు ముందు చెప్పినట్లు ఈ పద్యం తెలిసిన ప్రేక్షకులు సినిమాలోగల పద్యం మార్చిన సంగతి కూడా గుర్తించరు. సన్నివేశం ప్రారంభం కాగానే అందులో తాదాత్మ్యం చెందడం దీనికి కారణం.

రాబోయే యుద్ధానికి శ్రీకృష్ణుని సహాయం కోరడానికి పార్థ సుయోధనులు ద్వారక కెళ్ళి శ్రీకృష్ణుని కలిసే సన్నివేశం శ్రీకృష్ణావతారం, శ్రీకృష్ణసత్య, దాన వీర శూర కర్ణ సినిమాలలో చిత్రింప బడింది. ఈ సన్నివేశానికి మూలం తిక్కన భారతంలోని ఉద్యోగపర్వ కథ. ఈ కథను ఆధారం చేసుకొని తిరుపతి వేంకట కవులు నాటకం రాశారు. వారి నాటక పద్యాలు ఆంధ్రదేశంలో చాలమందికి బాగా పరిచయం. మూలానికి నాటకానికి కథలో మార్పులేదు. నాటకంలో సంభాషణలతో పాటు పద్యాలధికంగా ఉన్నాయి. కృష్ణుడు నిద్రబోతున్నట్లు నటిస్తూ ఉంటాడు. సుయోధనుడు లోపలికి వచ్చి కృష్ణుని తలవైపుగల ఆసనంలో కూర్చుంటాడు. కృష్ణుడిదంతా గమనిస్తూనే నిద్రబోతూ లేచినట్లు నటిస్తూ ముందుగా తన కాళ్ల వైపుగల అర్జునుని చూస్తాడు. తరువాత సుయోధనుని చూస్తాడు. సుయోధనుడు తానే ముందు వచ్చినానంటాడు. అయినా కృష్ణుడు

"నీవిటమున్ను వచ్చితిది నిక్కము పార్థుని దొల్త గాంచితిం
గావున మీకు నిద్దరకు గౌరవ మొప్పగ దోడు పాటు స
ద్భావము దీనికిం దెఱగు దప్పక యుండగ నేర్పరించెద
న్మీ వలపెట్టులట్ల తగ నీవును నీతడు గోరి కొండొగిన్"

(ఉద్యోగ పర్వం 1 - 72)

తిక్కన రచించిన ఈ పద్యం తిరుపతి వేంకట కవుల నాటకంలో రెండు పద్యాలుగా మారాయి.

"ముందుగ వచ్చితీవు మునుముందుగ అర్జుననేను జూచితిన్

బంధవులన్న యంశ మది బాయక నిల్చె సహాయ మిర్వురున్

బొందుట పాడి ............" అనే ప్రసిద్ధ పద్యం తిరుపతి వెంకట కవులది. దీనికి ముందే కృష్ణుడు పార్థ సుయోధనులను చూచి పలకరించాడు. ఈ సందర్భంలో

మేలుకని కృష్ణుడర్జును, నాలోకించి మరి కౌరవాధిపుగని త

త్కాలోచిత బహుమతియై, జాలబ్రియం బిరువురకు బ్రసన్నత జేసెన్"

(ఉద్యోగ 1-67)

అని తిక్కన రాసిన పద్యం ఆధారంగా నాటకంలో

"ఎక్కడ నుండి రాక ఇటకు .............."

"బావా ఎప్పుడు వచ్చితీవు ............" అనే రెండు పద్యాలు రచింప బడినాయి. తన సైన్యమంతా ఒకవైపు తానొక్కడే ఒకవైపు అని చెప్పి కృష్ణుడు వాళ్లను ఎవరి కిష్టమైనట్లు వారు కోరుకోవచ్చునంటాడు. దుర్యోధనుని కంటే అర్జునుడు చిన్నవాడు కావడం వల్ల 'కోరుట బాలుని కొప్పు ముందుగన్' అని నియమం పెడతాడు. అర్జునుడపుడు 'నందకుమార యుద్ధమున నారథమందు వసింపుమయ్య ............" అంటూ కృష్ణుని కోరుకుంటాడు. సినిమాలలో ఈ సన్నివేశాలు ప్రేక్షకులను బాగా రంజింప జేస్తాయి.

తిరుపతి వెంకట కవుల పాండవోద్యోగ విజయ నాటకాలు పల్లెప్రాంతం వాళ్లకు నచ్చినట్లు పట్టణ వాసుల కంతగా నచ్చవు. ఈ నాటకాల లోని పద్యాలు పల్లె ప్రాంతాల ప్రజల నాల్కల మీద ఉంటూ వారి జీవితంలో భాగమై పోయాయి. బావా ఎప్పుడు వచ్చితీవు, చెల్లియో చెల్లకో, సంతోషంబున సంధి చేయుదురె ఇత్యాది పద్యాల ప్రారంభ వాక్యాలను వ్యవహారంలో సందర్భాలకు తగినట్లు ప్రజలు వాడుకోవడం గమనిస్తే ప్రజలపై ఈ నాటకాల ప్రభావం ఎంతో అర్థమవుతుంది. అలాగే భారత కథలపై వచ్చిన ఇతర నాటకాల ప్రభావం కూడా ప్రజలపై ఉంది. గయోపాఖ్యాన పద్యాలు నాటక ప్రదర్శనల ద్వారా ఎందరికో కంఠతా వచ్చాయి. సినిమావాళ్లు ప్రజాదరణ పొందిన పద్యాలను తమ సినిమాలలో వాడి ప్రేక్షకులను సంతోష పెట్టడమే గాకుండా ఆపద్యాలకు శాశ్వతత్వాన్ని కలిగించారు. తమకు బాగా పరిచితమైన అంశాలు తెరమీద కనబడితే ప్రేక్షకుల ఆనందానికి అవధి ఉండదు.

**పాటలు :** పౌరాణిక నాటకాలలో పద్యాలతో పాటు పాటలు కూడా ఉన్నాయి. నాటకాలలోని పాటలు సినిమాల కెక్కాయి. 'శ్రీకృష్ణ తులాభారం' సినిమాలోని 'బలేమంచి చౌకబేరము' అనే పాట దీనికి మంచి ఉదాహరణ.

బలే మంచి చౌక బేరమూ-ఇది సమయమూ
మించినన్ దొరకదూ-త్వరంగొనడు సుజనులార
ధన ధనేతరముల చేతగాని-సాధన శమదమ నియమములకు గాని
లభియింపబోదు సుండి
కాదను కొను డౌనను కొను డొక మనసు
నిష్కళంకముగా నొనరించి తృణం బొసగినన్ -
వెనువెంటనె నడుచు చుండు ||బలే||

ఓ యాదవులారా! కనుచు నూరక నిలుచున్నారు
మీ యజమానిని గొనుడుసుమీ - తరిచెడుగా
పిదప నాయీ పలుకులు - మీ మానసములందు నిడి
దూరంబరయుడు - సరగున తడయక ||బలే||

ఇదే పాటను కొంత మార్చి రాయించి 'శ్రీకృష్ణ సత్య' సినిమాలో చిత్రించారు. సినిమా పాట ఇలాఉంది.

బలే వింత చౌకబేరము - ఈ తరుణము
దాటినన్ దొరకదు - త్వరితముగా రండురండు ||బలే||

ధన ధనే తరములకైన - అలవిగానిబేరము
చిత్త శుద్ధి గలవారికి - సిద్ధించెడి బేరము
ఫలాపేక్ష రహితము - పరమార్థమైనదీ బేరము ||బలే||

ఓయాదవులారా రండు - చూచుచు నిలుచుందురేల
యదు నాథుని మీస్వామిని - కొనుడీ త్వరపడుడీ
కనులముందు బేరము - కైవల్యమునకు మార్గము
ఈ తరుణము చేజారిన - మరిరాదు రాదు రాదు ||బలే||

పద్యాలవలె అప్పటికి నాటకాలలో చూచి విని బాగా పరిచితమైన పాటలు సినిమాలో విన్నపుడు ప్రేక్షకులకు ఆనందం కలుగుతుంది.

మాయాబజార్ సినిమా పురాణమైనా జానపద బాణీలో ఉండి ప్రేక్షకులను ఆనంద పరచడం గుర్తించిన విషయం. ఈ సినిమాలోగల పాటలన్నీ పాతతరం ప్రేక్షకులకు ఇంకా గుర్తున్నాయి. సన్నివేశాలకు తగినట్లుగా, అందరికీ అర్థమయ్యేటట్లుగా చిన్న చిన్న పదాలతో పాటలు రచించిన పింగళి నాగేంద్రరావు ప్రతిభ దీనికి కారణం.

"అల్లీబిల్లీ అమ్మాయికి చలచల్లని జోస్యము చెపుతాము

చకచక్కని జోస్యము చెపుతాము" అంటూ చెలికత్తెలు శశిరేఖకు జోస్యం చెప్పిన ఈ పాట నేటికీ పల్లె ప్రాంతాల్లో వయసుకు వచ్చీరాని ఆడపిల్లలు ఆడుకున్నట్లుంటుంది. బాలకృష్ణుని చిలిపి చేష్టలను గోపికలు యశోదకు చెప్పే ఒక చిన్న నృత్యనాటిక శ్రీకృష్ణుని ముందు ప్రదర్శింపబడుతుంది. ఆనాటికలో 'విన్నావా యశోదమ్మా ..........' అనేపాట పూర్తిగా జానపద గీతం. తల్లి దగ్గర చిన్న పిల్లలు చేసే చేష్టలను పింగళివారు ఈ పాటలో చూపించారు.

'నీవేనా నను పిలిచినది - నీవేనా నను తలచినది

నీవేనా నామదిలో నిలిచి హృదయము కలవర పరచినది' అని శశిరేఖాభిమన్యుల మధ్య సాగేపాట, లాహిరి లాహిరి లాహిరిలో - ఓహో జగమే ఊగినది' అనే శశిరేఖాభిమన్యుల, రుక్మిణీ కృష్ణుల మధ్య సాగే యుగళ గీతం ప్రేక్షకులను జానపద లోకానికి తీసుకొని వెళ్లి అక్కడ రాకుమార్తె రాజకుమారుల ప్రణయ సరాగాలను పరిచయం చేస్తాయి. మాయా శశిరేఖ అందానికి దాసుడైన లక్ష్మణ కుమారుడు పాడే

'సుందరీ నీ వంటి దివ్య స్వరూపము ఎందెందు వెదికిన లేదుగదా

నీ అంద చందములింక నావేగదా' అనే పాటలో పింగళివారు

'వగలనా విరహం' అనే మాటను వాడారు. ఈ మాట జానపదమో లేక శిష్ట ప్రయోగమో రసజ్ఞులు తేల్చవలసిన విషయం. ఈ సినిమాలో బాగా ప్రజాదరణ పొందిన పాట ఘటోత్కచుడు పెండ్లి భోజనం చేస్తూ పాడిన 'వివాహ భోజనంబు' అనేపాట. 1936లో నిర్మించిన 'మాయాబజార్' సినిమాలో ఈపాట ఇలా ఉంది.

"వివాహ భోజనంబు - వింతైన పాయసంబు
ఘనమైన దప్పళంబు - కడుమంచి అప్పళంబు
దవులార జేయువిందు - సంతోషముగ తిందు
సాకిల రండు ముందు - లేకున్న మనసు గందు
బలే సెబాసులడ్డు - పరుగెత్తనేమి అడ్డు
జిల్ బులార రండు - శీఘ్రం బయటకు రండు"

ఈపాటను ఆధారం చేసుకొని పింగళివారు వివాహఃభోజనంబు - వింతైన వంటకంబు' అనే పాట రాశారు.

'శ్రీకృష్ణార్జున యుద్ధం' సినిమాకు గూడా పింగళి పాటలు రాశారు. ఆయన పాటలలో సద్యః స్ఫురణ, ప్రసన్నత లక్షణాలుగా ఉంటాయి. తాను రాస్తున్నది ప్రేక్షకుల కోసమేనని ఆయన గుర్తిస్తాడు. ప్రేక్షకులు ఎలారాస్తే ఆనంద పడతారో ఆయనకు తెలుసు.

"అన్నీ మంచి శకునములే - కోరిక తీరీ దీవెనలే" అనేపాట సుభద్రార్జునుల మధ్య యుగళగీతం. సుభద్ర పాడేపాట మేఘంద్వారా అర్జునుని చేరినట్లు సినిమాలో స్ఫురింపచేశారు. "అన్నీ మంచి శకునములె - కన్యాలాభ సూచనలే" అంటూ అర్జునుడు పాడుతాడు. "వేయిశుభములు కలుగునీకు పోయిరావే మరదలా" అని పాడుతూ రుక్మిణీ సత్యలు సుభద్రను సారెతో సాగనంపుతారు. ఈ పాటలు జానపద సంస్కృతిని ప్రతిబింబిస్తాయి.

అభిమన్యుడు : రంభా వూర్వశి తలదన్నే రమణీ లలామ ఎవరీమె
నన్నేవెదకుచు భూమికి దిగిన కన్నెక రతియే కాబోలు

ఉత్తర : ఇంద్రుని చంద్రుని అందాలు ఈతని సొమ్మేకాబోలు
మౌనముగానే మనసును దోచిన మన్మథుడితడే కాబోలు
||రంభా||

అభి : తనివి తీరా వనిత పరువం తాక జాలని కరమేలా

ఉత్తర : పరవశించి పడుచు వానికి బహుమతియ్యని సొగసేలా

అభి : కలికి ఒడిలో పులకరించి కరిగిపోవని తనువేలా
ఉత్తర : ఎడములేక ఎదలు రెండూ ఏకమవని బ్రతుకేలా
||రంభా||

'వీరాభిమన్యు' చిత్రానికి ఆరుద్ర రాసిన పాటయిది. పాటలోని భావాలు సుమధురంగా మనసును తాకుతాయి. పాటవింటూ నాయికా నాయకుల అభినయం చూస్తూ ప్రేక్షకులు మైమరచిపోయే అవకాశముంది. ఈపాటలో వాడిన మాటలు కప్పురపు మూటలు. అన్వయ కాఠిన్యంగాని, అర్థకాఠిన్యం గాని లేని ఈపాట సాహిత్యంలో కొంచెం పరిచయమున్న ఎవరికైనా అర్థమవుతుంది. పింగళిరాసిన ఇలాంటి మరొక పాట 'పాండవ వనవాసం' చిత్రంలో ఉంది. ఈ పాట గూడా ఉత్తరాభిమన్యుల అనురాగాన్ని రూపు కట్టించేదే.

"నా చందమామ నీవెభామ
తారలే ఆన నీనీడనె నాప్రేమ సీమా
నీ కంఠ వీణా రాగాలు తీయ - నీ కన్నుదోయి మోహాలు పూయ
నీపాద మంజీరాన నాప్రేమ మ్రోయ - నటియించరావె
మెరుపుతీవా హాయిగా"

ఈ పాటలు సాహిత్య లక్షణాన్ని పొంది శిష్టుల అంగీకారాన్ని పొందుతాయనడంలో సందేహంలేదు.

"చల్లని సామివి నీవైతే అల్లన ఆగుము జాబిల్లి
ఎదలో కరుణే నీకుంటే ఉదయం కానీకోయి" అనే 'వీరాభిమన్యు'లోని పాట కూడా ఈ కోవకు చెందినదే.

సినిమా పాటలలో శిష్ట, జానపద ధోరణులను గుర్తించడం కష్టం. శిష్టులైనా సినిమా చూడడానికి థియేటర్‌కు వచ్చిన తరువాత జానపదులు కావలసినదే. సినిమా సృష్టి జానపదం. శాస్త్రదృష్టితో తీసిన సినిమాలు ఈ లక్షణానికి అపవాదం. ప్రేక్షకులలో ఈ లక్షణం లేక పోతే సినిమాలో లీనం కాలేరు. ఆయా సన్నివేశాలను అర్థం చేసుకొని ఆనందించ లేరు. సినిమా కవులకు ఈ విషయం తెలుసు. ఈ దృష్టితోనే వాళ్లు పాటలు రాస్తారు. కథ పౌరాణికమైనా పాటలు లౌకికంగా ఉంటాయి. దీనికి కారణం సమకాలీనత పాటలలో కనిపించడం.

అతిధీరవేగాని అపురూప రమణివే

"బావ బావ కొక భామామణిని భామభామ కొక బావగారిని
బ్రహ్మదేవుడే సృష్టించాడు - బ్రహ్మ దేవుడే జతచేశాడు"
(ప్రమీలార్జునీయం)

"దరికి రాబోకు రాబోకు రాజా" (నర్తనశాల)

"సైర మొనగాడా సైసైర మొనగాడా
భిల్ల జాతికి వల్లమాలిన సిరివి నీవేరా - మగసిరివి నీవేరా"

"ఇది మల్లెలు విరిసిన ఉదయం - చిరు జల్లులు విరులై కురిసిన ఉదయం" (ఏకలవ్య)

"కాపురమ్ము చేయలేమమ్మా ఓ యశోదా"

"నే తాళలేనే ఓచెలియా! ఓలలనా! ఓమగువా! ఓసఖియా" (శ్రీకృష్ణావతారం)

"గాలికి కులమేదీ! ఏదీ నేలకు కులమేదీ" (కర్ణ)

"ఏలరా! మనోహరా! త్రిలోక మోహనా"

"మాసాటివారు ఏచోట లేరని డంబాలు పోనేలా
ఇపుడిలా బెంబేలు కానేలా" (బభ్రువాహన)

ఈ పాటలలోని భావాలను పరిశీలిస్తే ఈ పాటలు కేవలం పౌరాణిక సినిమాలలోనే గాక సాంఘిక చిత్రాలలో కూడా ఉండవచ్చు ననిపిస్తుంది. ప్రేక్షకుల ఆనందం కోసం సినిమా కాబట్టి వారికి నచ్చిన విధంగా పాటలుంటాయి. సినిమాల మీద సామాజిక ప్రభావం తప్పని సరిగా ఉంటుంది. ఇక పాటల విషయానికొస్తే ప్రజలలో గల కళాభిరుచికి తగిన విధంగా సినిమా కవులు పాటలు రాస్తున్నారు. కళాభిరుచి ప్రజలందరిలోను ఉండదు. ఉన్నవారికి జానపద గీతాలపై ఇష్ట ముంటుంది.

సుభద్రార్జునుల వివాహం చిత్రించిన ప్రతిభారత కథాచిత్రంలో ఏదోరకంగా 'ఎగు భుజంబుల వాడు' అనే పద్యం కనిపిస్తుంది. ఈ పద్యం చేమకూర వెంకటకవి విరచిత విజయ విలాసంలో ఉంది. వెంకటకవి

పద్యానికి మూలం తాళ్లపాక తిమ్మక్క రచించిన సుభద్రా కళ్యాణం పాటలోని అర్జునుని శరీర వర్ణన. యతి వేషంలో అర్జునుని సేవిస్తూ సుభద్ర తన బావను గురించి అడిగినపుడు అతడెలా ఉంటాడని అర్జునుడు ప్రశ్నిస్తాడు. సుభద్ర తన మేనత్త కొడుకైన అర్జునుని ఇలా వర్ణించింది.

ఎగుభుజమ్ములవాడు మృగరాజు నడుము
నడిచి పుచ్చుకొను నెన్నడుము గలవాడు
గరగరని వాడు చక్కని వాడు నతడు
గొప్ప కన్నులవాడు కోదండ గుణకి
ణాంకంబులౌ బాహులమరినవాడు
వెన్నున మచ్చగల విభవంబువాడు
బవిరి గడ్డమువాడు పన్నిదంబడిన
వెన్ను పగడసాల వెసనాడ వచ్చు
చిగురొత్తు చెంద్రిక చెలగు పాదములు (సుభద్రా కళ్యాణం)

ఇవే మాటలతో చేమకూర వెంకటకవి సీసపద్యం రచించాడు.

ఎగుభుజంబులవాడు మృగరాజు మధ్యంబు
పుడికి పుచ్చుకొను నెన్నడుమువాడు
నెరి వెంద్రుకలవాడు నీలంపు నికరంపు
మెరుగు జామన చాయ మేనివాడు
గొప్ప కన్నులవాడు కోదండ గుణకిణాం
కములైన ముంజేతు లమరువాడు
బవిరి గడ్డమువాడు పన్నిదంబిడి తాగ
వచ్చు నందపు వెన్ను మచ్చవాడు

గరగరనివాడు నవ్వు మొగంబువాడు
చూడ గలవాడు మేలైన సొబగువాడు

ఈ పద్యం బభ్రువాహన సినిమాలో పూర్తిగా, మిగిలిన భారత కథా చిత్రాలలోని సుభద్ర అర్జునుని సేవించే ఘట్టాలలో పద్య భావం స్ఫురించే విధంగా ఉంది. విజయ విలాసం కథ భారతంలో నన్నయ రాశాడు. ఆ కథ ఆధారంగా తిమ్మక్క రాసింది. ఆతరువాత చేమకూర రాశాడు. ఇంతమంది చేతులలో పడిన ఈ కథకు తప్పకుండా జానపద ప్రచారం ఉంటుంది. తిమ్మక్క పాటలోని పైన చూపిన భాగం జానపదుల అభిరుచి ననుసరించి రాయబడి ఉంటుంది. దీనికి గల ప్రభావమే చేమకూర మరలా ఈ పద్యం రాయడానికి కారణం. ఈ పద్యం సినిమాల కెక్కింది అంటే సినిమాలపై జానపద సాహిత్య ప్రభావం ఎంత ఉందో అర్థమవుతుంది.

ఇలా చూస్తూ పోతే జానపద సాహిత్య ప్రభావంగల పద్యాలు పాటలు సినిమాలలో ఎన్నో కనిపిస్తాయి. కావ్యాలలోని నాటకాలలోని పద్యాలనుగాని పాటలనుగాని సినిమా కవులు గ్రహించినా వాటిని యథాతథంగా కాకుండా కొంత మార్చి తిరగ రాసి సినిమాలలో వాడారు. ప్రేక్షకులకు బాగా పరిచయమైన పాటలు పద్యాలు యథాతథంగా వాడబడినాయి. దీనికి కారణం ప్రేక్షకుల ఆదరణను పొందడానికి సినిమా కవులు చేసిన ప్రయత్నమే. సినిమాలపై జానపద సాహిత్య ప్రభావం ఉందని చూపడానికిది చాలు.



ఖాండవ మున్యాశ్రమంలో పాండవులున్నపుడు మహర్షికి ఆహారమైన ఒకే ఒక చూత ఫలాన్ని బాణంతో కొట్టి అర్జునుడు పడవేస్తాడు. ధర్మరాజు కీడు శంకించి కృష్ణుని ప్రార్థింపగా కృష్ణుడు వస్తాడు. పాండవులను, ద్రౌపదిని వారి వారి మనస్సులలో దాగిన సత్యాలను చెప్పమంటాడు. అలాచేస్తే పండు మళ్లీ చెట్టుకు అతుకు కొంటుందంటాడు. ధర్మరాజాదులు తమ మనస్సుల లోని విషయాలు చెపుతారు. పండుకొంత దూరం పైకి వెళుతుంది. కాని యధాస్థానం చేరదు. ద్రౌపది వంతురాగా ఆమె "షష్ఠో మే రోచతే పతిః" అని చెపుతుంది. పంచ పాండువులందే గాక కర్ణుని యందును తనకు ప్రేమ గలదని వెల్లడి చేస్తుంది. వెంటనే ఫలం చెట్టులో దాని స్థానాన్ని చేరుతుంది.

ఈ కథ కవిత్రయ భారతంలోగాని, తెలుగులోని మరే భారతంలో గాని లేదు. కన్నడ భారతంలో ఈ కథ ఉంది. విల్లకవి తన తమిళ భారతంలో 'పళం పొరుందు సర్గం' పేరుతో ఆరణ్య పర్వాంతంలో ఈ కథ చెప్పినాడు. ఈ కథ సంస్కృత భారతంలో ఒకప్పుడు ఉండి కాలక్రమంగా జారిపోయి ఉంటుందని పండితుల అభిప్రాయం. అప్పటి నుండి ఈ కథ జానపద సాహిత్యంలో చేరింది. ఈ కథ మూల భారతంలో ఉండినదేమోనని నమ్మడానికి కృష్ణుడు

"పాంచాలరాజ పుత్రియు,

నంచితముగ నిన్ను బొందు నార్గుర వరుసన్"అని కర్ణునితో చెప్పిన విషయం సాక్ష్యం. ఈ పండుకథ 'దాన వీర శూర కర్ణ' సినిమాలో ఉంది. "అత్తగారి నడకను స్ఫురింప జేసే విధంగా ఠీవిగా నడిచే కర్ణుని ఆరవ భర్తగా పొందాలని ఉంది." అని ద్రౌపది కృష్ణునితో రహస్యంగా చెపుతుంది. వెంటనే పండు యధాస్థానాన్ని చేరుతుంది. ఈ సినిమాలో కృష్ణుడు కర్ణునికి చెప్పిన ఈ కింది పద్యం తిరుపతి వెంకటకవులది.

ఏ సతివహ్నిలోన జనియించెను జన్న మొనర్చువేళ, ము
న్నేసతి పెండ్లినాడు నృపులెల్ల పరాజితులైరి క్రీడిచే
నేసతి మీద మోహమున నింతలు చేసిరి రాజునీవు ని
న్నాసతి పెండ్లియాడ గల దాఱవ భర్తగ సూర్య నందనా!

జానపద కథగా ప్రచారంలోగల పండుకథ సినిమాకెక్కింది.

# అనుబంధం - 2

జానపద సాహిత్య ప్రభావం సినిమాలపై ఎంతో ఉంది. అలాగే సినిమాల ప్రభావం మనపైన ఉంది. సాంఘిక సినిమాలకు భారత కథా ఘట్టాలను, భారతంలోని వ్యక్తుల పేర్లను స్ఫురింప జేసే పేర్లు పెట్టడం చూస్తే ఈ విషయం అర్థమవుతుంది. 1964 నుండి అలాంటి పేర్లుగల సాంఘిక చిత్రాలివి.

| | | | |
|---|---|---|---|
| రాముడు - భీముడు | - 1964 | కృష్ణ పరమాత్మ | - 1986 |
| కలియుగ మహాభారతం | - 1979 | కులాల కురుక్షేత్రం | - 1987 |
| మరో కురుక్షేత్రం | - 1981 | కృష్ణలీల | - 1987 |
| కృష్ణార్జునులు | - 1982 | భారతంలో అర్జునుడు | - 1987 |
| కృష్ణావతారం | - 1982 | అశ్వత్థామ | - 1988 |
| నవభారతం | - 1988 | కలియుగ కర్ణుడు | - 1988 |
| నేటి భారతం | - 1983 | రాముడు భీముడు | - 1988 |
| మరో మాయాబజార్ | - 1983 | గాండీవం | - 1994 |
| కురుక్షేత్రంలో సీత | - 1984 | మాయాబజార్ | - 1995 |
| కృష్ణ గారడి | - 1986 | ఘటోత్కచుడు | - 1995 |

## ఉపయుక్త గ్రంథాలు - పత్రికలు


అప్పప్పకవి : శశిరేఖా పరిమయం. వావిళ్ల, మద్రాసు, 1954

ఆనందకుమార స్వామి : Christian and oriental philosophy of Art, 1974.

ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్యం. అయిదవ సంపుటం, విజయవాడ, 1990

ఎఱ్ఱన : ఆంధ్ర మహాభారతం, అరణ్యపర్వం

: నృసింహ పురాణం

కాళిదాసు : మేఘ సందేశం

గంగాదేవి : మధురా విజయం

గోపమంత్రి, నాదెండ్ల : కృష్ణార్జున సంవాదం

గోపాలరెడ్డి, ముదిగంటి : సంస్కృత సాహిత్య చరిత్ర.

సుజాతారెడ్డి, ముదిగంటి తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ, 1986

జయదేవుడు : గీత గోవిందం

తిక్కన : ఆంధ్ర మహాభారతం

ధర్మన, చరిగొండ : చిత్ర భారతం

నన్నయ : ఆంధ్ర మహాభారతం, ఆదిపర్వం

నాగయ్య. జి : తెలుగు సాహిత్య సమీక్ష. రెండవ సంపుటం, తిరుపతి, 1985

పిన వీరభద్రకవి, పిల్లలమర్రి : జైమిని భారతం కొండపల్లి వీరవెంకయ్య అండ్‌సన్స్, రాజమండ్రి - 1960

పైడిపాల : తెలుగు సినిమాపాట, మద్రాసు - 1992

ప్రేమలత, రావి : తెలుగు జానపద సాహిత్యం - పురాగాధలు, సికింద్రాబాదు, 1983

బ్రహ్మానంద, హెచ్.ఎస్. : శిష్ట సాహిత్యంలో జానపద ధోరణులు అనంతపురం - 1989

: తెలుగు చలన చిత్ర గేయ సౌందర్యం, అనంతపురం - 1982

రాఘవన్, వి.యస్ : తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీలనము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ - 1982

రాఘవరాజు, ప్రత్తిగొడుపు : జైమిని భారతం (హరికథలు), 1956

రామగోపాలరెడ్డి, ఎన్ : ఆంధ్ర శాసనాలు - సాహిత్యంలో ప్రతి ఫలించే దేవదాసీ వ్యవస్థ, యస్వీయుకు సమర్పించిన పి.హెచ్.డి సిద్ధాంత గ్రంథం (అముద్రితం) 1994

రామరాజు. బి : తెలుగు జానపదగేయ సాహిత్యం, హైద్రాబాదు, 1990.

రామరాజు. బి
కృష్ణకుమారి, నాయని : జానపద గేయాలు - సాంఘిక చరిత్ర ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ

లక్ష్మీకాంతం, పింగళి : సాహిత్య శిల్ప సమీక్ష, తిరుపతి, 1965

లక్ష్మీరంజనం, ఖండవల్లి : ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి, హైద్రాబాదు 1992

వాల్మీకి : శ్రీమద్రామాయణం, బాలకాండ, అయోధ్య కాండ

వ్యాసుడు : సంస్కృత భారతం, ఆదిపర్వం

శాస్త్రి, కెన్, ఎన్. టి : అలనాటి చలన చిత్రం, సికింద్రాబాదు, 1995

శ్రీరామ అప్పారావు, పి. : తెలుగు నాటక వికాసం, హైద్రాబాదు, 1967

ఇండియాటుడే, 1996 వార్షిక సంచిక

ఈనాడు ఆదివారం సంచిక 1 జనవరి 1995

వందేళ్ల సినిమా చరిత్ర. 1996 ఏప్రిల్ స్వాతి సచిత్ర మాసపత్రికతో వచ్చిన అనుబంధం.


